# సంసారసుఖం

సోన్యా నేనూ మా అమ్మకోసం ఏడుస్తూ కూచున్నాం. ఆకురాలేకాలంలో (శిశిరఋతువు) మా అమ్మ చనిపోయింది. శీతాకాలమంతా మేము పల్లెటూళ్ళోనే బిక్కు-బిక్కుమంటూ - ఒంటరిగా గడిపాం. కాట్యా మాత్రం మాకు తోడుగాఉంది.

మా కుటుంబానికి పరమ ఆప్తురాలు కాట్యా. ఇప్పటినుంచి కాదు - ఎప్పటినుంచో. మమ్మల్ను పెంచి పెద్ద చేసిందీ, మాకు చదువు - సంధ్యలు నేర్పిందీ ఆమే. బుద్ధి తెలిసినప్పటినుంచీ ఆమెను నేను ఎరుగుదును. ఆమెఅంటే నాకు పంచప్రాణాలు. పోతే, సోన్యా నా చెల్లెలు.

పొక్రొవొస్కొయ్‌లో మా నివాసం. అక్కడ మాకున్న ఇల్లు పాత ఇల్లు. ఎక్కడాలేని అంధకారం వచ్చి ఆ కొంపలో ఆవరించింది. అక్కడ మమ్మల్ను పిలిచేవారు లేరు, తలిచేవారు లేరు; శీతాకాలమంతా మేము ఆ కొంపలోనే పడిఉన్నాం ఒళ్ళు ఎక్కడికక్కడ బిగుసుక పోయ్యేటట్లు ఒకటే చలి, ఈదురుగాలి. విపరీతంగా మంచుకురవడం. కిటికీ అద్దాలపై బెత్తెడెత్తున మంచు పేరుకునిఉండేది. వెలుగు చూచే ప్రాప్తం లేదు. బయటి ప్రపంచంతో మాకు సంబంధంలేదు. మేమూ మా కొంప. అహర్నిశలూ తలుపులు బిగించుకుని ఆ కొంపలోనే పడిఉండేవాళ్ళం. మమ్మల్ను ఆదరించడానికయినా వచ్చేవారెవరూ లేరు. అధవా - ఒకరూ-అరా వచ్చినా, మాకు ఒరగబెట్టేదేమీ లేదు. మాకంటె

ఇనుమిక్కిలిగా వారి వదనాలలో విషాదం ప్రేలాడుతూ ఉండేది. నిద్రపోయ్యేవారిని లేపడ మెందుకులే - అన్నట్లు ఎక్కడో, నూతిలో గొంతులుపెట్టుకుని చచ్చిచచ్చి-మాట్లాడే వాళ్ళు. వెదకిచూచినా వారిముఖాల్లో నవ్వు కనుపించదు! ముఖాలు ఇంతింతచేసుకునేవాళ్ళు. ఊరికే నిట్టూర్చేవాళ్లు. పదేపదే మమ్మల్లను చూచి గుడ్ల నీళ్ళుకుక్కుకునేవాళ్ళు. నల్లగౌను వేసుకుని కూచున్న మాచెల్లెలు సోన్యాను చూస్తే సరి - మరీ గుండె పగిలినట్లు బావురుమనేవాళ్ళు.

ఏమైనా మాకొంపలో ఇంకా మృత్యుదేవత కొట్టు - మిట్టాడుతూనే ఉంది. అసలా వాతావరణంలోనే ఎక్కడ లేని విషాదం, భయం అలుముకొని ఉన్నాయి.

మా అమ్మగదికి తాళంపెట్టారు. నేను పడుకోడానికి అటువైపు వెళ్ళినప్పుడల్లా, నిర్జీవంగా, నిస్తేజంగా, నిర్మానుష్యంగా ఉన్న ఆ గదివంక చూచేదాన్ని. బావురుమంటున్నట్లుండేది. ఏదో చెప్పలేనిబాధ కలిగేది. లోపలికి వెళ్ళిచూడాలనిపించేదికూడా.

అప్పటికి నేను పదిహేడేండ్ల దాన్ని. ఆయేడే మా అమ్మ చనిపోయింది. నన్ను పీటర్సుబర్గు నగరానికి తీసుకుని వెళ్ళి అక్కడ ఉన్నతసమాజంలో ప్రవేశపెట్టాలని ఆమె గారు తహతహలాడింది. కాని అంతలోనే ఆమెకు చావు ముంచుకొచ్చింది.

మా అమ్మ పోవడం నాకు తీరని - ఆరని దుఃఖం అయింది. అంతేకాదు. దానికితోడు మరొక దిగులుకూడా పట్టుకున్నది. నేను చాలా చక్కనిదాన్ని అని అంతా అం

టాయి. కాని ఏం లాభం? నా చక్కదనం, నా యౌవనం అంతా వృథాఅయిపోతున్నది. మరో ఏడాదిపాటు నేను ఇక్కడే - ఈ పల్లె కొంపలోనే ఒంటిగా పడివుండాలి. అదే దిగులు. ఆ దిగులువల్ల ఎంత డీలాపడిపోయానో, ఆ శీతా కాలం అయిపోయేసరికి - ఎంత యాతన అనుభవించానో చెప్పలేను. అస్తమానం ఒకటే దిగులు, ఎక్కడలేని చిరాకు- దానికితోడు ఒంటరిగా ఉండటం - అబ్బబ్బ! దుర్భరమై పోయింది. నా గది విడిచి పద - చరణం బయటపెట్టి ఎరగను. ఒక్కమాటు అయినా 'పియానో' వాయించుకున్న పాపానపోలేదు. ఆఖరుకు పుస్తకమయినా ముట్టలేదు. నా పరిస్థితి అలా అయిపోయింది

అప్పుడప్పుడు కాట్యా నావద్దకు వచ్చేది. 'అదేమి టమ్మా, కాస్త ఆ పనీ ఈ పనీ చేస్తూఉండు. పనిరంధిస పడితే దిగులు కొంత తీరుతుంది'.

అందుకు నేను - 'ఊహుఁ. నావల్లకాదు-'అని సమాధానం చెప్పేదాన్ని.

అంతేకాదు - 'ఏం చెయ్యాలి? ఎందుకు చెయ్యాలి? అయినా ఈ పని - పాటలూ - ఇవన్నీ దేనికి నాకు? నా జీవితంలో బంగారంలాంటి కాలం ఇలా వ్యర్థమైపోతూఉంటే, ఇహ నేను ఏం చేసి ఏం లాభం?' — అని నాలో నేను తర్కించుకునేదాన్ని.

నా తర్కాలకూ ప్రశ్నలకూ - నాలో నేను గుడ్ల నీళ్ళు కుక్కుకోవడం తప్ప సమాధానమంటూ లేదు.

నేను చిక్కి - శల్యమైపోతున్నానని అందరూ అంటున్నారు. అందవికారంగా తయారవుతున్నానని అన్నారు. అయినా నాకు తేడా కనుపించడంలేదు అంతా ఒకటిగానే ఉంది.

అప్పుడు దేనికీ ఆందచందాలన్నీ? ఎవరికోసం? ఎవరు చూడాలి, ఎవరు సంతోషించాలి?—

ఇలా నా జీవితమంతా ఏకాంతంలో, విషపషాదంలో గడిచిపోయేలా కనుపించింది నాకు. కాని ఏం చెయ్యను? దానినుంచి బయటపడే శక్తి నాకు లేదు. అలా బయటపడాలన్న కోరికా లేదు.

శీతాకాలం వెళ్ళిపోవచ్చింది. నా విషయమై కాట్యా ఎంతగానో ఆందోళనపడడం మొదలుపెట్టింది. నన్ను ఎక్కడికయినా దూరంగా తీసుక వెళ్ళాలని నిశ్చయించుకున్నది. అందుకు సంసిద్ధురాలయిందికూడా. కాని ఏం లాభం? ప్రయాణసన్నాహాలకు డబ్బు కావాలి. మాకు ఉన్న దేమిటో లేని దేమిటో - మా అమ్మ పోతూ మాకు ఏమి అట్టిపెట్టి పోయిందో - మా కెవ్వరికీ తెలియదు. మాకు 'గార్డియన్' (సంరక్షకుడు) ఒకాయన ఉన్నాడు. ఆయనవస్తేనే కాని అన్ని వ్యవహారాలూ చక్కబడవు.

ఏమైతేనేం, మార్చి నెలలో ఆయన రానేవచ్చాడు.

'అమ్మయ్యా! ఇప్పటికైనా ఆ దేవుడు దయదలచాడు -' అన్నది, ఒకనాడు కాట్యా నావద్దకు వచ్చి. నేనేమిటో - తోచక, పిచ్చిదాన్నిలా, ఆ గదిలోనుంచి ఈ గదిలోకీ ఈగదిలోనుంచి ఆగదిలోకీ, నీడలాతిరుగుతున్నాను -

'సెర్జీ మిఖాలిచ్ వచ్చాడమ్మా. మన క్షేమం అడిగిరమ్మని మనిషిని పంపాడు భోజనానికి ఇక్కడికే వస్తాట్ట '- అన్నది కాట్యా - 'రామ్మా మాషా! ఇప్పుడైనా కాస్త ఓపిక తెచ్చుకోమ్మా లేకపోతే ఆ వచ్చిన ఆయన ఏమనుకుంటాడు- నీవన్నా, సోన్యాఅన్నా ఆయనకు పంచప్రాణాలు' అన్నది.

సెర్జీ మిఖాలిచ్ మాకు దగ్గరబంధువు. మా పొరుగున ఉన్నవాడు. ఆయన, చనిపోయిన మా నాన్నగారికంటె వయస్సులో చాలా చిన్న అయినా నాన్నగారితో ఆయనకు మిక్కిలి స్నేహం. ఆయన రాకవల్ల మా ఆలోచనలన్నీ సానుకూలమవుతాయి. మమ్మల్ని ఈ పల్లెటూరినుంచి ఆయన పంపించివేస్తాడు. ఇదీ మా ఆశ అంతేకాదు చిన్నప్పటి నుంచీ ఆయనంటే నాకు అభిమానమూ గౌరవమూను. అందుకే కాట్యా నన్ను కాస్త ఓపిక తెచ్చుకుని, ఉల్లాసంగా ఉండమని చెప్పింది. తక్కినవాళ్ళదగ్గిర ఎలా ఉన్నా పరవాలేదు. ఆయనముందు మాత్రం ఇలా ముఖం ముడుచుకుని ఉండటం బావుండదు. కాట్యాకు అన్నీ తెలుసు — అందుకే చెప్పింది. ఆయనంటే మా చెల్లెలికి చనువు. కాట్యాకు అభిమానం. పనివాళ్ళుకూడా ఆయన్ను ఎంతో గౌరవిస్తారు. ఆయనంటే మా ఇంట్లో అందరికీ అంతే. నాకూ అదే అబ్బింది. అంతేకాదు. మరో విషయం ఉంది. నా చిన్నతనంలో ఒకమాటు మా అమ్మ ఆయన్ను నాకు చూపింది-

'అమ్మాయ్, మాషా! నీకు ఖచ్చితంగా ఇలాంటి మగడు దొరకాలే!'—అన్నది.

మా అమ్మ అన్నమాట నా కింకా జ్ఞాపకంఉంది. అందువల్లే ఆయన నాకు అదోలా - ప్రత్యేకంగా అగు పిస్తాడు.

అవుతే, ఆనాడు మాఅమ్మ అన్నమాట నాకు అంతగా రుచించలేదు. తెల్లగా, సన్నగా, రెబ్బలా ఉండి, ఎప్పుడూ ఏదో ఆలోచిస్తున్నట్లుండేవాడు, నాకు భర్త కావాలని నేను కలలుకంటూఉండేదాన్ని. సెర్జీ మిఖాలిచ్ అందుకు పూర్తి భిన్నంగా ఉండేవాడు. మనిషి పొడుగు, లావు. భారీమనిషి. నడికారువయస్సులో ఉన్నాడు. మనిషి ఎప్పుడూ నవ్వుతూ - పేలుతూ ఉంటాడు. కనుక నేను ఊహించుకున్న వ్యక్తికీ - మిఖాలిచ్‌కీ ఎక్కడా పోలికే లేదు. అయినా మా అమ్మ అన్నమాట నాకు మరపుకు రాలేదు ఎప్పుడూ అది నా మనస్సులో మెదులుతూనే ఉంది సరిగ్గా ఇప్పటికి ఆరేండ్లక్రిందటిమాట. అప్పుడు నాకు పదకొండేండ్లు. అప్పుడుకూడా మిఖాలిచ్ నన్ను - "చిట్టీ" అని ముద్దుగా పిలిచేవాడు. 'దేవకన్యా!' అనేవాడు. అది విని నా కో ఆలోచన తట్టేది. నన్ను పెండ్లిచేసుకుంటావా!- అని హఠాత్తుగా ఆయన అడిగినట్లయితే, నే నేం సమాధానంచెప్పను?' అని నాలో నేను అనుకునేదాన్ని. భయంతో కంపించిపోయేదాన్ని.

సెర్జీ మిఖాలిచ్ వస్తాడని కాట్యా ఏవేవో పిండివంటలు ఫలహారాలు చేసింది. భోజనంవేళ కాకముందే ఆయన వచ్చాడు. బండెక్కి వచ్చాడు. బండి ఆ మూలతిరుగుళ్ళో ఉండగానే నేను కిటికీలోనుంచి చూచాను. ఆయన ఎప్పుడు

వస్తాడా అని నేను కనిపెట్టుకుని ఉన్నానని అనుకోకుండా, గబ గబ చావిట్లోకి వెళ్ళాను ఉప్పిస్ - చప్పిస్ కాకుండా - ఏమీ ఎరగనట్లు కూచున్నాను.

కాని ముందుగదిలో ఆయనపదధ్వని, పెద్దగొంతు, కాట్యాచేస్తున్న హడావుడి - ఇవన్నీ నాకు వినవచ్చాయి. ఇహ అక్కడ క్షణం ఉండబుద్ధిపుట్టలేదు. గభాలున లేచి ఆయనదగ్గరికి పరుగెత్తాను. ఆయన కాట్యాచెయ్యి పుచ్చు కుని, బిగ్గరగా మాట్లాడుతూ వస్తున్నాడు. ముఖంలో చిరు నవ్వు చిందుతోంది.

నన్ను చూచీచూడ్డంతోనే ఆగిపోయాడు. ఎగాదిగా నావంక చూచాడు. కొద్దిక్షణాలు అలాగే రెప్పవాల్చకుండా చూచాడు. చెప్పొద్దూ, నాకు చచ్చే సిగ్గు ముంచు కొచ్చింది !

'అరె ! నీవేనా ? నిజంగా నీవేనా ? ఎంత మారి పోయావు? ఏమిటీ ! నాకళ్ళను నేను నమ్మలేకుండా ఉన్నాను! అసలు గుర్తుపట్టలేకుండా నే అయిపోయినావే. నిన్ను చిన్న ప్పుడు 'బిట్టీ' అనీ, 'దేవకన్యా' అనీ పిలిచేవాణ్ణికాదూ ? ఇప్పుడు రాణీలా తయారయినావే !-' అన్నాడాయన తన సహజ సరళహృదయాన్ని వ్యక్తంచేస్తూ. ఇలాఅంటూ నా దగ్గరికి వచ్చాడు నాచెయ్యి పట్టుకున్నాడు. గట్టిగా నొక్కాడు. నాకు నొప్పిపుట్టింది. నాచెయ్యి ముద్దాడతాడనుకున్నాను. ముందుకు వంగాను. కాని ఆయన ముద్దుపెట్టుకో లేదు. మళ్ళీ ఒకమాటు నాచెయ్యి గట్టిగా నొక్కారు. నాకళ్ళల్లోకి

సూటిగా చూచాడు ఆ చూపులో ఎక్కడలేని ఆనందం, ప్రసన్నత ఉన్నాయి.

నేను ఆయననుచూచి ఆశ్చర్యమయింది. అప్పటికీ ఇప్పటికీ ఆయనలో ఎంతో మార్పు కనుపిస్తున్నది. మనిషి ముదురుబారాడు. నలుపెక్కాడు. గడ్డంకూడా పెరిగింది. ఆ ముఖానికది అదోలా ఉంది. కాని తక్కినవిషయాల్లో ఏమీ మార్పు కనుపించడంలేదు. విశాలమయిన, ప్రసన్నమయిన ఆయనవదనం, మిలమిలలాడే కనులు, అనురాగాన్నీ అమాయకత్వాన్నీ ఒలకబోసే ఆ చిరునవ్వు – అన్నీ వెనకటిలాగానే ఉన్నాయి.

ఆయన మాఇంట్లో అడుగుపెట్టి అయిదునిముషాలు అయిందో లేదో – మా అందరికీ చనువయిపోయాడు. మా కుటుంబంలో ఒకడయిపోయాడు. ఇంట్లో పరిచారకులకు కూడా ఆయనంటే కొత్తపోయింది. ఆయనకు పనులు చెయ్యడానికి అంతా ఉల్లాసంతో ముందుకు వచ్చారు.

మా అమ్మ పోయినతరువాత మాయింటికి అనేకమంది వచ్చారు. కాని వాళ్ళంతా వేరు. కాసేపు గుసగుసలాడటం, గుడ్లనీళ్ళుకుక్కుకోవటం – ఇదీ పని. అసలే ఏడుస్తున్న మమ్మల్ని మరింత ఏడిపించిపోయేవాళ్లు! కాని మిఖాలిచ్ అలాకాదు. ఈయన ధోరణే వేరు. ఈయన మా అమ్మమాటే ఎత్తలేదు. వచ్చినప్పటినుంచీ ఎంతో ఉల్లాసంగా ఉంటున్నాడు. మా అందరితోనూ నవ్వుతూ [illegible] మాట్లాడుతున్నాడు. [illegible] పోయింది.

చింది కాట్యా. టీపాత్రపైన మూత పెట్టి ఆతుసుకుంటే చూచింది. ఆమె కనులలో గిర్రున నీళ్ళు తిరిగాయి.

తరువాత మిఖాలిచ్ నావంక చూచాడు.

'అమ్మాయ్, మీ నాన్నగారు నీకు గుర్తున్నారా ?-'

'కొంచెం జ్ఞాపకముందీ -' అన్నాను నేను.

'ఇప్పుడాయనగారు బ్రతికిఉన్నట్లయితే మిమ్మల్సు చూచి ఎంతగా పొంగిపోయేవాడో -' అన్నాడు మిఖాలిచ్, మెల్లగా - 'మీనాన్నగారికీ నాకూ ఎంతో స్నేహం. అలాంటిమిత్రుడు మరి దొరకడు.-' అన్నాడు, ఇంకా మెల్లిగా. అప్పుడాయనస్మృతిపథంలో ఏదో మెరిసినట్లున్నది. ఆయనకనులు మిలమిలలాడాయి

'ఇప్పుడు తల్లికికూడా కరువయినారు ఈ పిల్లలు ! ఇంతలోనే ఆ దేవుడిట్లాచెయ్యాలీ?—' అంటూ కాట్యా చేరుమాలు ముఖానికి అడ్డంపెట్టుకుని వెకివెక్కి ఏడ్వసాగింది.

'అవును. కష్టాలన్నీ ఒక్కమాటే కట్టకట్టుకుని వచ్చాయమ్మా ఈ ఇంటికీ—' అన్నాడు మిఖాలిచ్ ముఖం పక్కకుతిప్పి. తరవాత సోన్యాను చూచి — 'అమ్మాయ్, సోన్యా! నీ బొమ్మలు, ఆటవస్తువులూ ఒకమాటు నాకు చూపించమ్మా—' అన్నాడు. ఇలా అని కొద్దిక్షణాల తరువాత వరండాలోనికి వెళ్ళిపోయాడు. ఆయనలా వెళ్ళిపోతుంటే నా కనులలో నీళ్ళు తిరిగాయి. కాట్యావంక చూచాను.

'ఆయన ఎంతమంచివాడవన్నా! మాగ్రాంటీపుస్తకు అంద రికీ నొరికి ఇష్టం—' అన్నానే కోపాగ్ని.

పరాయివాడయినప్పటికీ ఆయన మంచితనమూ నిర్మల మనస్సూ నన్ను ఆకర్షించి ఆకట్టుకున్నాయి. దుఃఖంలో మునిగిఉన్న నా మనస్సుకు, ఆయనచూపిన ఆదరణవల్ల ఏదో చల్లని - మెల్లని శాంతి చేకూరినట్లనిపించింది.

ఆయన వరండాలో కూచుని సోన్యాను ఆడిస్తున్నాడు. ఆయన ఏవో కబుర్లు చెప్తూ ఉండడం, సోన్యా కిలకిల నవ్వుతూ ముద్దుమాటలతో బదులు చెప్తూ ఉండడం ఇవతల గదిలోకి నాకు వినిపిస్తూ ఉంది. నేను ఆయనకు గ్లాసులో 'టీ' పోసి వరండాలోకి పంపించాను. అంతలో ఆయన సోన్యాను ఒడిలో కూచోబెట్టుకుని 'పియానో' ముందు కూచు న్నాడు. సోన్యా కోమల వేళ్ళతో పియానోను తాకిస్తూ వాయిం చడం మొదలుపెట్టాడు.

'మేరీ అలెగ్జాండ్రోవ్నా! ఇలా వచ్చి ఒకపాట వాయించుదూ, వింటాను.-' అని పిలిచాడు.

ఆయన ఆజ్ఞాపించినప్పటికీ అది నాకు ఆజ్ఞలా అని పించలేదు. ఎంత ముద్దుగా - ముచ్చటగా పిలిచాడు! నా కెంతో ఆనందం కలిగింది. వెంటనే లేచి వరండాలోకి వెళ్ళాను.

ఆయన అక్కడున్న 'బిథోవెన్' పుస్తకం ఒకటి తెరి చాడు. అందులో ఒకపాట గుర్తుపెట్టాడు——

'ఇదిగో, ఈ పాట వాయించు!——ఎలా వాయిస్తావో చూస్తాను -' అన్నాడు. ఇలా అని 'టీ' గ్లాసు తీసుకున్నాడు. గదిలో ఒకమూలకు వెళ్ళి నిలుచున్నాడు.

ఆ రోజున నాయుడుగారు చెప్పిన పాట 'నెలరాజా! వెన్నెల రాజా —' అనే పాట నాకు 'పియానో'లో వాయించడం బాగా రాదని చెప్పి తప్పించుకుందామనుకున్నాను. కాని నా అంతరం కాలేదు బుద్ధిగా ఒప్పుకున్నట్లుగా వెళ్ళి 'పియానో' ముందు కూర్చున్నాను నా చేతనయినంత బాగా వాయించడానికి ప్రయత్నించాను. కాని లోపల గుండె అదురుతూనే ఉంది. ఆయనకు సంగీతం వచ్చు. సంగీతమంటే, చెవికోసుకుంటాడు. నాకా విషయం తెలుసు. అందుకే ఎక్కడ తప్పులుపట్టి గుండె తాళంతో అది వెనుకబడుతుంది

నన్నైతే నేం, ఆయన చెప్పిన పాట నేను బాగానే వాయించాను అంతటితో ఊరుకుంటే పోయేది. మరొక కొత్తపాట వాయించడం మొదలుపెట్టాను వెంటనే ఆయన వచ్చి – 'వద్దు, వద్దు. ఆ పాట నీవు వాయించలేవు –' అని ఆపుచేశాడు

'అయినా పరవాలేదు. మొదటిపాట బాగానే వాయించావు సంగీతంలో నీకు మెళుకువలు తెలుసు.–' అన్నాడు.

ఆయన నన్ను అంతగా పొగడకపోయినా ఆ ఒక్క మాటకే నేనుఉబ్బితబ్బిబ్బయినాను. ఎక్కడలేనిసిగ్గు ముంచు కొచ్చిందికూడా ఆయన మా నాన్నగారి స్నేహితుడు, పెద్ద వాడు. అలాంటివాడు – పసిపిల్లలతో పరాచకాలాడినట్లు నాతో పరాచకాలాడలేదు. చాలాగంభీరంగా పెద్దవాళ్ళతో మాట్లాడినట్లు మాట్లాడాడు. నన్ను తగినరీతిగా గుర్తించాడు. అది నా కెంతో ఆశ్చర్యాన్ని, ఆనందాన్నికూడా కలిగించింది. అది నా కొక కొత్త అనుభవమూ మధురానుభూతీని.

సోనాల్యను పంటకోతకెళ్ళటానికై కాల్యా మేకపోదికి వెళ్ళింది. ఇహా ఆయనా-నేనూ, మేమిద్దరమే సంసారంలో మిగిలిపోయాం.

ఆయన మా నాన్నగారిని గురించి ఎన్నెన్నో విషయాలు మాట్లాడాడు. తమ ఇద్దరికీగల గాఢమైన అనుబంధాన్నిగురించి చెప్పారు. ఆరోజుల్లో వాళ్ళిద్దరితో హాయిగా ఆనందంగా గడిపారట. అప్పుడు నేను చాలా చిన్నపిల్లనట. బొమ్మసామానులు పెట్టుకుని ఆడుకుంటూ ఉండేదాన్నట! ఇలా ఆయన ఎన్నెన్నో కథలు చెప్పారు. అవన్నీ వింటుంటే నే నేదో కొత్తలోకంలో ఉన్నట్లనిపించింది. తొలిసారిగా మా నాన్నగారు, నా కన్నతండ్రి పొడగట్టారు. మిత్రాలిచ్చ్ ఎంత మంచివాడో, ఎంత కల్లా-కపటం లేనివాడో నిజంగా అప్పుడు నాకు తెలిసింది. అంతకుముందెన్నడూ ఆయన ఇంత మంచివాడని నేను అనుకోలేదు.

తరువాత ఆయన నా చదువునుగురించి అడిగారు. నాకు ఏమేమిటి ఇష్టమో, ముందుముందు ఏం చెయ్యాలను కుంటున్నానో ఇవన్నీ అడిగి తెలుసుకున్నారు. నాకు కొన్ని సలహాలుకూడా ఇచ్చారు. నాకు బొమ్మలుచేసి పెడుతూ, నాతో ఆడుతూ పాడుతూ గడిపే కాల్యాసా పురుషుడులా నా కిప్పుడాయన కనుపించడంలేదు. నా కళ్ళ కొక దివ్య పురుషుడిగా, ఒక దేవుడిలా కనుపించసాగారు. నా హృదయాన్ని ఆకర్షించి, ఆకట్టుకున్నారు ఆయన. ఆయనతో గడుపుతున్నంతసేపూ నా కెంతో హాయిగా ఉంది. ఏదో ఆనందంతో గాలిలో తేలిపోతున్నట్లనిపించింది. కాని అదే సమ

యంలో నాకోవిధమైన కష్టంకూడా కలిగింది. నేనుమాటాడే ప్రతిమాటా—తూచినట్టు ఎంతో జాగ్రత్తగా మాటాడాలి. అలా మాటాడుతున్నానో లేదో అని నాభయం. ఇంతకాలం నే నాయనకళ్ళకు కేవలం ఒకస్నేహితునిమాత్రలా కనుపించాను.మరి ఇప్పుడో?- ఇప్పు డలా కనుపించకూడదు ఇప్పుడు నేను ఆయన ప్రేమకు పాత్రురాలినికావాలి. ఆయన ఆదరాభిమానాలు పొందాలి - ఎలాగయినాసరే! ఇదీ నా తాపత్రయం.

పోన్యాను నిద్రపుచ్చి కాట్యా మళ్ళీ మాదగ్గరికి వచ్చింది. నేను చాలా దిగులుగా ఉంటున్నాననీ, కుళ్ళికుళ్ళి పోతున్నాననీ ఆయనతో చెప్పింది. అంతవరకూ నేను నా దిగులునుగురించి ఆయనకు చిన్నమెత్తుమాటయినా చెప్పలేదు.

'అరె ! ఇంతకూ అసలువిషయం నాకు చెప్పనేలేదే ! అమ్మపిల్లా !-' అన్నా డాయన. చిరునవ్వునవ్వాడు. ఎందుకు దాచావన్నట్లు తలఊచాడు.

'చెప్పడాని కేమున్నదండీ. ఇదేమంత పెద్దవిషయం కాదు క్రమేణా అన్నీ చక్కబడతాయి !-' అన్నాను నేను.

ఆక్షణంలో నాదిగులంతా మటుమాయమైపోయినట్లనిపించింది. అసలు నాకు ఏచింతా లేనట్లు తోచింది.

'ఏవో కష్టాలొస్తుంటాయి. ఒక్కొక్కప్పుడు ఒంటరిగా గడపవలసివస్తుంది. అంతమాత్రానికే అంతా మునిగి పోయినట్లు దిగులుపడడం, బేజారయిపోవడం మంచిదికాదు. నీవేం పసిపిల్లవా? ఈడొచ్చినపిల్లవు, ఆమాత్రం తెలుసుకోవద్దూ ?-' అన్నా డాయన మళ్ళీ.

'అవునండీ, మీరన్నది నిజమే –' అన్నాను నేను నవ్వుతూ.

'పదిమందిలో ఉన్నంతసేపూ నేనేమో కులాసాగా నవ్వుతూ – పేలుతూ ఉండేటట్లునూ, ఎవరిదో వనవాసు వెళ్ళగానే ఏవిషయం పట్టించుకోకుండా ముఖం ముడుచుకుని కూచోడమూ, ఇవన్నమాట ! దీన్నిబట్టి నీకు పైడంబాచారంతప్ప అసలుసరుకు సున్నా అని తేలుతోంది !–'

'భలేవారండీ, నన్ను గురించి మీకు భలే అభిప్రాయాన్ని ఏర్పరుచుకున్నారు !–' అన్నాను నేను, ఏదో జవాబు చెప్పాలనుకుని.

'కాదు, కాదు. అచ్చం మీ నాన్నపోలికే వచ్చింది నీకు. అవును మరి ? ఆ బుద్ధు లెక్కడికిపోతాయి ? అవే పట్టుబడినాయి !–' అన్నా రాయన మళ్ళీ, ఒక్కక్షణం ఆగి. ఇలా అంటూ గుచ్చినట్లు నావంక చూశారు. ప్రసన్నమైన ఆ చూపులు వచ్చి నన్ను తాకాయి. నేనొక విచిత్రమైన ఆనందంలో మునిగి, కలవరపోయాను.

ఎల్లప్పుడూ ఎంతో ఉల్లాసంగాఉండే ఆయనముఖమండలం అప్పుడు నాకు అదోతీరుగా అగుపించింది. ఆ ఉల్లాసం వెనకాల, ఏదో గాంభీర్యమూ, శ్రద్ధాసక్తులు, ఏదో విషాదమూ, ఎన్నెన్నో ఆలోచనలూ దాగిఉన్నాయని తోచింది. ఈ విషయం గమనించడం ఇదే నాకు తొలిసారి.

'నీ విలా అనవసరంగా క్రుంగిపోవటం ఏం బాగాలేదమ్మాయ్. ఇది ఏమాత్రం మంచిదికాదు. పైగా చదువుకున్నదానివి. ఏదో పుస్తకం చదువుకుంటూ కూర్చోవచ్చునే

అంతో -ఇంతో సంగీతం నేర్చుకున్నావుకదా; పాడుకుంటూ కులాసాగా గడుపవచ్చునే. పైగా ఇప్పు డేంముంచుకపోయిన దని? ముందెంతో జీవితవున్నది. ఇప్పటికింకా ఆనగింజలో అర్ధభాగం కాలేదమ్మాయ్! భవిష్యత్తుకు బాటలువేసుకో వలసిన వయస్సు ఇది. ఈ వయస్సులో ఇలా కుళ్ళికుళ్ళిపోతే తరువాత నీవు చెయ్యగలిగిందేమీ లేదు. ముందు ముందు విచారించవలసివస్తుంది. అప్పుడు విచారించినా ప్రయోజనం ఉండదు. కనుక ఇప్పుడే జాగ్రత్తపడు. దీపం ఉండగానే ఇల్లు చక్క పెట్టుకోవా లమ్మాయ్!—' అని హితవుచెప్పా డాయన.

కన్నతండ్రిలాగానూ కేక పినతండ్రిలాగానూ బుద్ధి చెప్పాడు. కాని మాట్లాడుతున్నంతసేపూ నన్ను కించపరచ కుండా ఉండాలని ఎంతో ప్రయత్నంచేశాడు అది నాకు స్పష్టంగా తెలుస్తూనేఉంది

న న్నెందుకూ కొఱగానిదాన్నిగా చూచాడని ఒక వైపు నా మనస్సు ఖేదపడింది. కాని మరోవైపు నన్ను గురించి - కేవలం నన్నొక్కదాన్నిగురించి ఆయనఇలాశ్రద్ధా సక్తులుచూపడం నా కెంతో ఆనందం కలిగించింది. నాపై గల అనురాగాన్ని ఆయన ఈతీరుగా వెల్లడించాడు.

తరువాత ఆసాయంత్రమంతా కాట్యాతో ఏవేవో మా కుటుంబపరిస్థితులనుగురించి మాట్లాడాడు.

'సరే, ఇహ నే వెళ్ళొస్తాను అంటూ' అందరిదగ్గరా సెలవుపుచ్చుకున్నాడు. నాదగ్గరికి వచ్చి నా చెయ్యిపట్టుకొని వెళ్ళొస్తానని మరీమరీ చెప్పాడు.

'మళ్ళీ తమ రెప్పుడు వస్తారు?—' అని అడిగింది కాట్యా.

'ఈ వేసవికాలంలో వస్తానమ్మా' అని ఆయన బదులు చెప్పాడు- 'నే నిప్పుడు జేవిలోవ్కాకు వెళుతున్నాను. (మాతాలూకు మరో ఎస్టేటు అది) అక్కడి పరిస్థితు లెలా ఉన్నాయో చూచి అన్నిఏర్పాట్లూ చేస్తాను తరువాత ఎకా ఎకి మాస్కో వెడతానమ్మా. నా కక్కడ పనిఉంది. మళ్ళీ ఎండాకాలంలో ఇక్కడికి వచ్చేస్తాను-' అన్నాడు. ఇంతసేపూ ఆయన నా చెయ్యి వదిలిపెట్టనే లేదు.

'అమ్మయ్యో, అన్నిరోజులకు వస్తారా?' అన్నాను నేను, గుండె పగిలినట్లయిపోయి - నిజానికి రోజూ ఆయన్ను చూస్తుంటే అలవాటైపోయిందనిపించింది నాకు. ఆయ నలా వెళ్ళి ఎన్నాళ్ళకో వస్తానని చెప్పగానే ఒక్కమాటుగా గుండె గుభిల్లు మన్నది. మళ్ళీ వెనుకటిదిగులూ విచారమూ - అన్నీ కట్ట కట్టుకునివచ్చి నన్ను చుట్టుముట్టినట్టనిపించింది. నా చూపునూ మాటనూబట్టి నా పరిస్థితి ఇట్టే గ్రహించినట్లున్నా డాయన.

'బెంగపెట్టుకోకు - ఏదో పనీ-పాటా చూచుకుంటూ ఉండు. గుండె చెడకూడదుసుమా!—' అన్నాడు ఈ మాట చాలా నెమ్మదిగా, మామూలుగా అనేశాడు—

'అయినా మళ్ళీ వేసంకాలంలో వచ్చినప్పుడు చూస్తాగా - నే చెప్పింది ఎంతవరకు ఆచరణలో పెడతావో అప్పుడు తెలుస్తుంది—'. అన్నాడు మళ్ళీ. నా చెయ్యి వదిలి పెట్టి, నావంక చూడకుండా అన్నాడు ఈమాట.

ఆయన్ని సాగనంపడానికి మేము వసారాలోకి వచ్చి నిలుచున్నాం. ఆయన గబగబ ఉన్నికోటు వేసుకున్నారు. మళ్ళీమాయి నావంక తేరిపార చూడాలని ఎంతో తంటాలు పడ్డారు. నే నది గ్రహించాను – 'ఈయనగారు ఇంత శ్రమ పడవలసినపని లేదు. ఆయన నావంక చూడాలని నాకేంలేదు. ఆయనగారు ఏమైనా అనుకుంటున్నారేమో!—' అనుకున్నాను నాలో నేను — 'మొత్తానికి ఇలాంటివారిని — ఇంత మంచివారిని ఎక్కడా చూడం కాని... ...'

ఆ రాత్రి నేనూ – కాబ్యా పడుకునేటప్పటికి ఎంతో పొద్దుపోయింది. చాలాసేపు ఆవిడా నేనూ మాట్లాడుతూ కూచున్నాం ఆయన్నిగురించి కాదు, వచ్చే వేసవికాలంలో ఎలా గడపాల్సిందీ, చలికాలంలో ఎక్కడ ఉండాల్సిందీ, – యీ విషయాలన్నీ మాట్లాడుకున్నాం.

'ఎందుకు? ఎవరికోసం? దేని కిదంతా?—' అన్న విరక్తిభావం నాలో తొలగిపోయింది. నేను మళ్ళీ మనుష్యుల మధ్యకు వచ్చాను. ప్రతి ఒక్కరూ జీవించాలి. హాయిగా, ఆనందంగా జీవించాలి. అంతేకాని, ఇలాంటి పిచ్చి ప్రశ్నలు వేసుకోకూడదు. నాకూ మంచి రోజులు వస్తాయి. ముందుముందు నేనూ సుఖపడతాను – ఇలా అనుకునేసరికి పాడుకొట్లాడుతున్న మా కొంపలోకి – మళ్ళీ కళ వచ్చినట్లు కనుపించింది. కొత్తజీవంతో ఇంటికి శోభవచ్చినట్లనిపించిది.

# 2

వేసవికాలం రానేవచ్చింది.

వసంతశోభతో వసుంధర కళకళలాడింది. నా చీకూ-చింతలన్నీ మటుమాయమైనాయి. ఏవేవో మధురభావాలు నాలో మొలకెత్తాయి కొత్తకొత్త ఆశలు, ఆకాంక్షలు చిగురించాయి. ఏదో స్వప్నజగత్తు నాముందు సాక్షాత్కరించింది.

నే నిప్పుడు వొంటరిలాగా లేను. వొంటరి మనిషిని కాను. నిత్యం ఏదో ఒక వ్యాసంగంలో హాయిగా ప్రొద్దు పుచ్చుతున్నాను. పుస్తకాలు చదువుకుంటున్నాను. పాటలు పాడుకుంటున్నాను. మా చెల్లెలు సోనాల్తో ఆడుకుంటున్నాను. రోజూ తోటలోకి వెళ్ళి షికార్లు చేస్తున్నాను. అక్కడ వేదికలమీద కూచుని ఎన్నెన్నో కలలు కంటున్నాను. నా మనస్సు పరిపరివిధాలపోతోంది. ఏవేవో తీయని తలపులతో నా హృదయం నిండిపోతోంది.

ఒక్కొక్క రాత్రి పిండారబోసినట్లున్న వెన్నెలను చూస్తూ నా గదిలో కిటికీ చెంత కూచునేదాన్ని. ఎన్నెన్నో ఊహలు నా మనస్సులో తళుక్కుమనేవి అలా ఊహించుకుంటూ ఉండగా భళ్ళున తెల్లవారిపోయేది. ఇంకా నిద్రపోతున్న కాట్యాతో చెప్పకుండా నే తోటకు బయలుదేరేదాన్ని. వలిపెంలాంటి ఓణీ సైనకప్పుకుని ఒంటిగా తోటలలోనుంచి నడిచివెళ్ళేదాన్ని. అప్పుడప్పుడే తూరుపున తెలిరేకలు విచ్చుతూ ప్రభాతవేళ ఎంతో మనోహరమై పొడసూపేది. పచ్చని పచ్చిక పరుచుకున్న పుడమిపై మంచుబిందువులు

తళతళ మెరిసిపోతుంటేవి అవన్నీ చూస్తూ అలా వెళ్ళినవ్వి చెరువుగట్టుకు చేరుకునేదాన్ని. ఒక్కొక్క రాత్రి ఒంటరిగా వనాలన్నీ కలయతిరిగేదాన్ని.

అప్పుడు నా మనస్సులో ఎన్నెన్ని ఊహాలు పరుగు లెత్తేవో నిజంగా ఇప్పుడు చెప్పలేను అవి తలుచుకుంటేనే ఇప్పుడు నాకు అదోలా అనిపిస్తుంది. నిజంగా ఆ మనిషి నేనా నేనని ఆశ్చర్యంకలుగుతుంది. ఆనాటి నా ఊహాలన్నీ గాలిమేడలేకాని నిజాలుకావని తోస్తుందికూడా.

ఏమైతేనేం, ఊళ్ళమీద వెళ్ళిన మిఖాలిచ్, అన్న మాట తప్పకుండా మే నెల ఆఖరుకల్లా తిరిగి రానేవచ్చాడు.

ఒకనాడు ప్రొద్దుకూకువేళ తలవనితలంపుగా ఆయన ఊడిపడ్డాడు అప్పుడు మేమంతా ముందువసారాలో కూచు న్నాం. టీ తాగే ఎత్తుమానంలో ఉన్నాం. పక్కన తోటంతా పచ్చగా చివురించి కన్నులపండువగా కనుపిస్తోంది. గుబురులమధ్య కోయిలమ్మల కుహూకుహూరావాలు వినవస్తు న్నాయి. గుబుర్లుగా అల్లుకొనిఉన్న 'లిలాక్' పూపొదలు అంతటా అగుపిస్తున్నాయి. ఎరుపూ, తెలుపూ కలిసిన రంగు రంగు పూలతో విరిలిపోతున్నాయి. అస్తమిస్తున్న సూర్య కాంతి వచ్చి అల్లంతదూరాన నిమ్మచెట్లపై పడి తళతళ లాడుతోంది. వసారాలో ఆ కొసనుంచి ఈ కొసకు నీడ వచ్చింది. ఆ సాయంసంధ్య ఎంత చల్లగా, ఎంత హాయిగా ఉంది! అప్పుడే మంచువచ్చి కురుస్తున్నది పచ్చికంతా మెరుస్తున్నది. తోట వెనకాల బాటలో - పొలాలనుండి ఇండ్లకు మరలివస్తున్న ఆలమందల అరుపులు, పశువుల

గిట్టలచప్పుళ్ళు వినవస్తున్నాయి. మా ఇంటిముందున్న సన్నని త్రోవగుండా 'నికాన్' నీళ్ళబండిని తోలుకొస్తున్నాడు. పూలపాదులలోనికి కట్టిన నీళ్ళకాలువ జలజల ప్రవహిస్తూ చుట్టూ చల్లదనంఇస్తోంది.

వసారాలో ఒకవైపు పొయ్యిమీద పాత్రలో, తేనీరు తెర్లుతోంది. టేబిల్‌మీద తెల్లటి గుడ్డ పరచి - పళ్లాలలో వెన్న, రొట్టె, బిస్కట్లు, మాంసంతో చేసిన పిండివంటలు- మాకోసం సిద్ధంగాఉన్నాయి. ఇంటిపనులలో ఆరితేరిన కాట్యా గబగబా టీకప్పులు కడుగుతోంది. ఆవిడచేతులు ఎంత బొద్దుగా, ముద్దుగా ఉన్నాయనుకున్నారు! నే నప్పుడే, స్నానంచేసి వచ్చాను. కడుపులో ఆకలి రెపరెపలాడుతోంది. ఉండబట్టలేక - టీ కలిపేలోపుస రొట్టె వెన్నలో నంచుకుని తింటున్నాను నా తలతడి ఇంకా ఆరలేదు అందుకని రుమాలుతో జాడుముడి వేసుకొన్నాను. వదులుగా ఉన్న పల్చటిగౌను తొడుక్కున్నాను. మిఖాలిచ్ అల్లంత దూరాన ఉండగానే ముందు కాట్యా కిటికీలోనుంచి చూచింది.

'అరుగో! బాబుగారు రానేవచ్చారు. మీకు నిండా నూరేండ్లు. ఇప్పుడే మీమాట అనుకుంటున్నాం!'- అన్నది.

నేను ఉలిక్కిపడి లేచాను. బట్టలు మార్చుకొని వద్దామని మేడపైకి పరుగెత్తబోయాను. కాని ఆయన వాకిట్లోనే ఆపివేశాడు.

'ఏమి టమ్మాయ్ ఆ తొందర? అంత కంగారు దేనికి? పల్లెటూళ్ళో ఉన్నా, మీ కీ దర్జాలు పోలేదే - అయినా కొత్త వాళ్లెవరొచ్చారని? ఎందు కంత బిడియం?-

నే నేం పరాయివాణ్ణి కాదు!–' అన్నా డాయన చిరునవ్వు నవ్వుతూ – ఇలా అని జాపుముడివేసుకున్న నా జుట్టువంక ఓరగా చూచాడు.

ఆయన పరాయివాడు కాదు ఆ మాట నిజమే. కాని అందరి చూపులు వేరు, ఆయన చూపులు వేరు. అది నేను ఇదివరకే కనిపెట్టాను. అందుచేత ఆయనన్న చూడగానే నాకు ఎక్కడలేని సిగ్గు, బిడియం ముంచుకొచ్చాయి.

'ఇప్పుడే వస్తానండీ'– అంటూ ఇంట్లోకి పరుగెత్తాను.

'ఇప్పుడా బట్టలు మార్చుకోకపోతే ఏం? అలా ఉంటే ఏం పరవాలేదు. బంగారపు బొమ్మలాంటి పల్లెపడుచులా ఉన్నావు, తెలుసా?' అన్నా డాయన, వెనకనుంచి.

నేను మేడమీదికి వెళ్ళి బట్టలు మార్చుకున్నాను 'ఆయన నావంక ఎంత చిత్రంగా చూచాడు ? సరే, ఎలా గయితేనేం, ఆ దేవుడిదయవల్ల ఆయన వచ్చాడు నా కదే పదివేలు! ఇహ నా కెంతో హాయిగా ఉంటుంది'– అనుకున్నాను నాలో నేను.

గబగబా ఒకమాటు అద్దం చూచుకున్నాను. ఆదరా బాదరా మేడమెట్లు దిగి మళ్ళీ వసారాలోకి వెళ్ళాను. నా హడావుడి అందరికీ కనుపిస్తూనేఉంది. ఆయన టేబిల్ముందు కూచుని మా విషయాలు ఏవేవో శాట్యాకు చెపుతున్నాడు. ఒకమాటు నావంక చూచి చిరునవ్వు నవ్వాడు. మళ్ళీ ముచ్చట్లలో మునిగిపోయాడు. ఆయన చెప్పేదాన్నిబట్టి చూస్తే మా పరిస్థితులన్నీ మరుగుపడినట్లు అర్థమైంది. ఎలాగో ఈ వేసంకాలం మాత్రం ఈ పల్లెటూళ్లో గడిపేస్తే, తను

వాత మేము పీటుక్కుబక్కగాని, ఇంకా పై పట్టణాలకుగాని వెళ్ళవచ్చు నట. బస్తీలలో ఉండి మా సోన్యాకు చదువు చెప్పించుకోవచ్చు.

'సరే, బాబుగారూ! అంతా బాగానే ఉంది. కాని ఒక్క విషయం. మేం బస్తీలకు వెళ్ళినప్పుడు మీరూ మాతో వస్తే మరీ బాగుంటుంది–' అన్నది కాట్యా.

'ఓ ! మీ వెంట ఎక్కడికి రమ్మంటే అక్కడికి వస్తాను. దేశాలన్నీ చుట్టబెట్టిరమ్మన్నా చుట్టబెట్టివస్తాను, సరేనా ?–' అన్నాడాయన, ఆయనమాట ఒకవంక పరాచకంగాను, ఒక వంక నిజంగానే అంటున్నట్లు ధ్వనించింది.

'అలా అవుతేసరే, వెంటనే బయలుదేరండి. దేశాలన్నీ తిరిగివద్దాం !–' అన్నాను నేను. ఆయన చిరునవ్వు నవ్వుతూ తలఊచాడు.

'నిజంగా రావడానికి అభ్యంతరం లేదు. కాని మా అమ్మగారున్నారు. ఆమెగారిని ఏం చేసి వచ్చేది ? పోతే తలమునకలయ్యే వ్యవహారాలున్నాయి నాకు. అవన్నీ ఏం కాను ? సరే – ఇహ ఆ విషయాలు అలా ఉంచుదాం. ముందు నా కో విషయం చెప్పు. ఇన్నాళ్ళూ ఎలా గడుపుతున్నావు నీవు ? కులాసాగా ఉంటున్నావా ? లేక మళ్ళీ దిగులుపడ్డావా ?–' అని అడిగాడు.

ఆయన వెళ్ళినలగాయతూ ఇన్నాళ్ళూ నేను ఎలా గడిపిందీ – అంతా పూసగుచ్చినట్లు చెప్పాను. కాట్యాకూడా నిజమేనని సాక్ష్యంఇచ్చింది. ఈమాటు అమ్మాయి ఎంత మాత్రం దిగులుపడలేదనీ, కులాసాగా గడిపిందనీ ఆమె ఆయ

నకు చెప్పింది. అంతా విని ఆయనగారు నన్నెంతగానో మెచ్చుకున్నారు. అలా మెచ్చుకోడానికి తనకొక్కరికే సంపూర్ణ హక్కున్నట్టు మాట్లాడారు. నేనూ ఒక్కవిషయాన్నికూడా ఆయనముందు దాచలేదు. ఈశ్వర సాన్నిధ్యంలో నివేదించుకున్నట్టు - జరిగింది జరిగినట్టుగా ఆయనకు చెప్పుకున్నాను. నా మనస్సు ఎంతో తేలికపడిపోయింది.

ఆ సాయంత్రం చాలా హాయిగా గడిపాం. టీలు తాగడం అయిపోయినతరువాత సామానులన్నీ అక్కడినుంచి తీసివేయించి, మేము అలాగే వసారాలో కూచుండిపోయాం. కులాసాకబుర్లలో మునిగిపోయాం. మా కబుర్లు మావి తప్ప, మరెవరిమాటా మా చెవుల్లో దూరడంలేదు. చీకటిపడిన సంగతికూడా మాకు తెలీలేదు. చుట్టూ పూలమొక్కలనుంచి వచ్చే పరిమళం గుప్పున కొడుతోంది. పచ్చికనేలంతా మంచుతో నిండిపోయింది. పూపొదలోని కోయిల ఒకటి పాట పాడిపాడి అకస్మాత్తుగా ఆపివేసింది. తారలతో మిలమిల లాడే నీలాల నింగి వచ్చి మా నెత్తిపై వాలింది.

అప్పటికి చుట్టూ చిమ్మచీకట్లు అలుముకున్నాయి. వసారా చూరుక్రిందికి ఒక గబ్బిలం హఠాత్తుగా వచ్చి తప తప కొట్టుకుంది. నేను కప్పుకున్న తెల్లటి శాలువామీద వాలింది. అది చూచి 'అమ్మయ్యో' అని అరవబోయాను. గోడకు ఆనుకున్నాను. అంతలో అది గభాలున లేచి చూరుక్రిందిగా తోటలోకి వెళ్ళి కనపడకుండా పోయింది. బాగా చీకటిపడిందని అప్పుడు నేను తెలుసుకున్నాను.

'మీ ఇల్లంటే నా కెంతో ఇష్టం. ఇక్కడే - ఈ వసారాలోనే కూచుని జీవితమంతా గడిపివేస్తే బాగుంటునని పిస్తుంది?' - అన్నా డాయన, అకస్మాత్తుగా ముచ్చట మార్చి.

'అంతకన్నానా బాబుగారూ. సలక్షణంగా ఇక్కడే కూచుని కాలంగడపండి!'- అన్నది కాట్యా.

'నీవు చెప్పింది బాగానే ఉందమ్మా. కాని బ్రతుకనేది ఒకచోట నిశ్చలంగా ఉండదే'-అన్నా డాయన.

'అవుతే మీరు వివాహం ఎందుకు చేసుకోకూడదు బాబుగారూ? మీ కా ఉద్దేశం ఉంటే కాని ఎవరైనా మిమ్మల్ని కళ్ళకద్దుకుని పిల్లనిస్తారు' అన్నది కాట్యా.

'ఎందుకనీ? నేను కదలకుండా ఒకచోట కూచునే వాణ్ణనా?' అన్నా డాయన, పకపక నవ్వుతూ. 'అదికాదు కాటరీనా కార్లోవ్‌నా! (కాట్యా పూర్తిపేరు) నా కిప్పుడు పెళ్ళేమిటి? అది పోయి చాలాకాలమయింది. పెళ్ళీ పెటాకులు లేని బ్రహ్మచారి క్రింద నన్ను ఏనాడో నా స్నేహితు లంతా జమకట్టేశారు అది నిజమేనని నేనూ ఒప్పుకున్నాను. అందుకే ఇలా ఉండిపోవడానికి నిశ్చయించుకున్నాను. నా కిదే బావుంది ఏ జంజాటమూ లేదు. నిజం చెపుతు న్నాను సుమా?'- అన్నాడు.

ఆయనధోరణి నా కో విధంగా కనుపించింది.

'అది సరే బాబుగారూ! మీకు నిండా ముప్ఫయి ఆరేండ్లు లేవు. అప్పుడే జీవితంమీద విరక్తి పుట్టిందటండీ!'- అని అడిగింది, మళ్ళీ కాట్యా.

'పుట్టుక ఏముందమ్మా? నే కోరేదల్లా ప్రశాంతంగా జీవితంగడవాలనేకాని పెళ్ళిచేసుకోదలచుకున్నవాడు అలా ఉండకూడదు. అతని లక్షణాలు వేరుగా ఉండాలి. అందులో ఒక్కటీ నాదిగ్గర లేదమ్మా!'— అంటూ ఆయన నావంక తిరిగాడు— 'ఇంకా నా మాట అబద్ధమేమో ఈ అమ్మాయిని అడిగి చూడు. పెళ్ళికావలసింది ఇలాంటి పడుచుపిల్లలకు. నీకూ నాకూ కాదమ్మా. ఇలాంటి పిల్లలు పెళ్ళిచేసుకుని సుఖంగాఉంటే చూచి ఆనందించడానికే మనవంటివారం!'— అన్నాడు.

ఆయన కంఠస్వరంలో ఒకవిధమైన విషాదం తొంగిచూచింది. ముఖంలో ఏదో తీరని ఆరని బాధ, ఆవేదన ద్యోతకమైనాయి. నేను కనిపెట్టాను. ఆయనకొంత సేపు మౌనంగాఉండిపోయాడు. కాట్యా, నేనూకూడా మాట్లాడలేదు.

ఆయన కుర్చీమీద ఒకప్రక్కకు తిరిగి కూచున్నాడు.

'ఒకవేళ అకస్మాత్తుగా, ఏదో దురదృష్టవశాత్తూ ఓ పదిహేడేండ్ల అమ్మాయిని - మన మేరియా అలెగ్జాండ్రోవ్‌నా లాంటి అమ్మాయిని నేను పెళ్ళాడడం సంభవిస్తుందనుకోండి! అలా సంభవిస్తే ఎంతో మంచిది. అందుకు నేను ఎంతో సంతోషిస్తానుకూడా - సందేహం లేదు. ఈ విషయంలో ఈ అమ్మాయి చక్కని ఉదాహరణ!'— అన్నాడు.

నేను పక్కున నవ్వాను. అలా జరిగితే ఆయనగారు సంతోషించడం దేనికో - ఇందుకు నన్నే ఉదాహరణగా ఎందుకు చెప్పాలో - నాకు కారణం కనుపించలేదు...

'సరే - ఇప్పుడు నిన్నొక విషయం అడుగుతాను' - అంటూ ఆయన నన్ను ఇలా అడిగాడు. 'నీవు మనస్ఫూర్తిగా - ఆత్మసాక్షిగా నాకో మాట చెప్పు అమ్మాయ్! నీవు పసుపిల్లవు. నీ మనస్సులో ఎన్నెన్ని కోర్కెలున్నాయో, ఎలాంటి ఊహాలున్నాయో ఎవరూ ఎరుగరు కదా! అలాంటప్పుడు వయస్సుమీరిన నావంటివాణ్ణి ఒక చోట కూచుని నిశ్చలంగా కాలంగడపాలనుకునేవాణ్ణి - నీవు పెండ్లాడగలవా? పెండ్లాడి భరించగలవా? అది నీ కొక పరీక్షకాదా? దాచకుండా చెప్పు అమ్మాయ్!'-

నేను కలవరపోయాను. ఆ ప్రశ్నకు ఏం సమాధానం చెప్పాలో తోచలేదు.

'కొంపతీసి నన్ను పెండ్లాడమని అడుగుతున్నాననుకునేవు!' అన్నాడాయన చిరునవ్వు నవ్వుతూ. 'అదికాదు నా ఉద్దేశం ఇలాంటి చల్లని సాయంత్రాన - ఏకాంతాన నీవు నిమ్మతోటలో విహరించేటప్పుడు ఎలాంటి పురుషుడు ప్రక్కనఉండాలని కోరుకుంటావు? చెప్పు అమ్మాయ్, నాకు నిజం చెప్పు? నావంటివాడు నీకు నచ్చుతాడా? నావంటివాడే దొరికితే నీకది అసౌఖ్యంకాదా?'- అని అడిగాడాయన, చిరునవ్వు చిందిస్తూ.

'లేదు. అసౌఖ్యం ఏమీలేదు...' అంటూ ఏదో చెప్పడం మొదలుపెట్టాను.

'అసౌఖ్యం లేకపోతే, అసంతృప్తి అయినా ఉంటుంది!' అన్నాడాయన మళ్ళీ, నా మాటకు అడ్డువచ్చి.

'అన్యథానుకోకండి—అయినా నాటి తప్పుడు అభిప్రాయం కావచ్చుగా...' అంటూ, చెప్పబోయాను.

కాని ఆయన మళ్ళీ నా మాటకు అడ్డువచ్చాడు.

'సరే, ఇహ చాలు ఇప్పుడు విన్నావుకదమ్మా కాట్యా, ఆ అమ్మాయి చెప్పిందీ. ఆ అమ్మాయి చెప్పింది అక్షరాలా నిజం. ఉన్నమాట చెప్పినందుకు ఆవిడకు నా ధన్యవాదాలు అంతేకాదు, మన మాటల్లో ఈ ప్రస్తావన వచ్చినందుకు నే నెంతో సంతోషిస్తున్నాను. అంతేకాకుండా, ముఖ్యంగా నామటుకు నాకు ఇలాంటి వివాహంవల్ల సౌఖ్యంఅన్నమాట ఉండనే ఉండదమ్మా' — అన్నాడు.

'మీరు భలేవారండీ బాబుగారూ! అప్పటికీ ఇప్పటికీ మీలో చిన్న మెత్తయినా మార్పు లేదు. ఎప్పుడూ ఇంతే, అంతా వింతగా మాట్లాడతారు!' — అన్నది కాట్యా. ఇలా అని ఆవిడ మాకు భోజనాల ప్రయత్నం చెయ్యడానికి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

ఇహ — ఆయనా నేనూ మిగిలాం. ఇరువురమూ మౌనంతాల్చాం. మా చుట్టూ ఎక్కడా అలికిడి అన్న మాటలేదు. తోటలో కోయిలపాటమాత్రం తీయకుండా వినిపిస్తోంది మధ్యాహ్నం మధ్యమధ్య వినిపించిన ఆ కోయిల కంఠం ఇప్పుడు అదేపనిగా వినిపిస్తోంది. ఎక్కడో కొండ లోయలోఉన్న మరో కోయిల దీని పాటకు బదులుపలుకుతోంది. అది వినడానికి కాబోలు తోటలో కోయిల మధ్య మధ్య ఆగి, తరువాత మళ్ళీ ఉచ్చస్వరంతో రాగయుక్తంగా మధురగానం చేసి మైమరపిస్తోంది. నిశ్శబ్దంగా ఉన్న ఆ

రాత్రివేళ యీ పక్షులసంగీతం ప్రపంచమంతా ప్రతిధ్వని స్తోంది. అబ్బ! ఎంతఅద్భుతంగా ఉంది! ఎంత హాయిగాలు వుతూ ఉంది!

తోటవాడు తోటలోఉన్న తనగుడిసెలో పడుకోడానికి వెడుతున్నాడు. అతని కాలిచెప్పుల చప్పుడు స్పష్టంగా వినవ స్తోంది కొండకొసన ఎవరో రెండుసార్లు ఈలవేశారు. మళ్ళీ అంతలో అంతటా నిశ్శబ్దం. పూలమొక్కలు గాలికి మెల్లగా అల్లలాడుతున్నాయి. వసారాచూరుమీద కాన్వాసుగుడ్డ అటుఇటు కొంచెంగా ఊగుతోంది. వసారాఅంతా పరి మళవాయువులు వీచాయి.

ఇన్ని ముచ్చట్లు జరిగిన తరువాత అలా మాట్లాడ కుండా - మౌనముద్రవహించి కూచోడం నాకెంతో కష్ట మనిపించింది. కాని ఏం మాట్లాడాలో తోచలేదు. ఆయన వంక చూచాను. కనుపించీ కనుపించని చీకటిలో ఆయన కనులు మిలమిలలాడుతున్నాయి. తదేకంగా నావంక చూస్తు న్నాడు.

'ఈ లోకాన జీవించటంలో ఎంత హాయిఉంది!' అన్నా డాయన. కారణం ఏమిటోకాని, నేను విశ్వసించాను.

'అవునా ?-' అని మళ్ళీ అడిగా డాయన.

'అవును, నిజమే -' అన్నాను.

మళ్ళీ సూ ఇరువురిమధ్య మౌనం. ఆ మౌనంవల్ల మళ్ళీ నాలో కలవరం కలిగింది. ఆయన ముసలివాడని నేనూ అంగీకరించాను. అందువల్ల ఆయనమనస్సు నొచ్చిఉంటుంది- అనుకున్నాను. ఎలాగయినా ఆయన్ను ఓదార్చాలనిపిం

చింది. కాని ఎలా ఓదార్చడం ? ఏం చేస్తే ఆయనమనస్సు చల్లపడుతుంది ?- ఏమో !-

'సరే - ఇహ వెళ్ళొస్తాను -' అన్నాడాయన, కుర్చీ లోనుంచి లేస్తూ - 'మా అమ్మగారు భోజనంచెయ్యకుండా నాకోసం కనిపెట్టుకుని ఉంటారు. అసలివ్వాళ ఆకుగాగి కంటికే నేను కనుపించలేదు -' అన్నాడు.

'కాని నే నొక కొత్తపాట నేర్చుకున్నాను అది విని పోదురుగాని -' అన్నాను నేను.

'మరోమాటు ఎప్పుడైనా వింటాను' అన్నాడాయన, మెల్లగా. ఆయన చాలా నిరుత్సాహంగా ఉన్నట్టనిపించి నాకు. అందుకు నేనే కారణమనీ, మనస్సు నొప్పించాననీ చాలా బాధపడ్డాను. లోలోపల విచారించాను. ఆయన్ను సాగనంపడానికి నేనూ, కాట్యా వాకిలిదాకా వెళ్ళాం. ఆయన గుర్రంఎక్కి వెళ్ళాడు. కనుమరుగయ్యేంతవరకూ అలాగే వాకిట్లో నిలువబడి తరువాత వసారాలోకి వచ్చి కూచు న్నాను. మంచుకురుస్తోన్న ఆ చల్లని మెల్లని రాత్రివేళ, ఎంతో ప్రొద్దుపోయేదాకా చెట్లవంక చూస్తూ అక్కడే ఒం టిగా కూచుండిపోయాను. నా ఇష్టంవచ్చినట్లు ఎన్నెన్నో మెల్లని శబ్దాలువిన్నాను. నా కుతూహాలం తీరేటట్లుఎన్నెన్నో చిత్రాలు కన్నాను.

ఆ తరువాత మళ్ళీ ఆయన రెండుమూడు తడవలు మా ఇంటికి వచ్చాడు. నాతో కబుర్లాడాడు. మా ఇరువురి మధ్య ఏర్పడిన తెరమరుగు క్రమక్రమంగా తొలగిపోయింది.

ఆ వేసవికాలం గడిచేవరకూ ఆయన వారానికి రెండు మూడు తడవలు వస్తూ వచ్చాడు రానురాను ఆయనతో నాకు చనువు ఎక్కువయింది ఇహ ఆయన్ను చూడనిదే ఉండలేని పరిస్థితికి వచ్చాను. ఎప్పుడైనా రెండురోజులు ఆయన కనుపించకపోతే నాకు పిచ్చెక్కినట్టుండేది. ఏమీ తోచేది కాదు. మనస్సు పరిపరివిధాలపోయేది. ఇలా ఆయన రాకుండా ఉన్నందుకు ఆయనమీద ఎక్కడలేని కోపంకూడా వచ్చేది.

తన స్నేహితురాలిని చూచినట్లు చూచేవాడాయన నన్ను. ఎన్నెన్నో ప్రశ్నలడిగేవాడు. దాచుకోకుండా అన్నీ చెప్పమని అడిగేవాడు అప్పుడప్పుడు నాకు సలహాలిచ్చే వాడు. ఉత్సాహపరిచేవాడు. నాలో పొరపాట్లేమైనా ఉంటే చీవాట్లుపెట్టేవాడు నాపై పెత్తనంచలాయించేవాడు.

ఇలా ఆయన నాతో సరిసమానంగా ప్రవర్తించాలని విశ్వప్రయత్నం చేశాడు కాని ఆయన పూర్తి స్వభావం నాకు అంతుపట్టలేదు. ఆయనతత్వం నాకు కొంతమట్టుకే అవగతమైంది. దాని వెనకాల నాకు తెలియని మనోప్రపంచం ఏదో దాగిఉన్నట్లు నాకు అనిపిస్తూ వచ్చిందికాని, ఆ రహస్యం లోకంలోకి నన్నాయన అడుగు పెట్టనివ్వడంలేదు. అది అనవసరమనుకున్నాడో - ఏమో ! నేనాయన ప్రభావానికి లొంగిపోవడానికీ, ఆయన నా ఆకర్షణలో పడిపోవడానికీ ఇదే ప్రధాన కారణం.

ఆయన్నుగురించి కాట్యా, ఇంకా ఇరుగుపొరుగువారు చెప్పగా విన్నాను. ఆయనకు వృద్ధురాలయిన తల్లి ఉన్నది అశక్తురాలుగా ఉన్న ఆమెను తనదగ్గరే ఉంచుకుని పోషిస్తూ

న్నాడు. అంతేకాదు ఆయని కింకా బోలెడన్ని బాధ్యత లున్నాయి. భూస్వామి అవడంవల్ల, తనకున్న పొలమూ-పుట్ర అన్నీ విచారణలు చేసుకోవాలి. దానికితోడు మరో వ్యవహారాలన్నీ ఆయనే చూస్తున్నాడు. ఇవికాక ఊళ్లో పది మందికీ ఉపయోగపడే ధర్మకార్యాలెన్నో ఆయన నెత్తిన ఉన్నాయి. ఇష్టంఉన్నా, లేకపోయినా పాపం, ఇన్ని కార్య భారాలు పైనవేసుకుని తలమునకలవుతున్నాడు.

కాని తన స్వవిషయాలనుగురించి ఆయన ఎన్నడూ నాతో పల్లెత్తుమాట చెప్పలేదు. తన ఉద్దేశాలుకాని, ఆశలూ, ఆకాంక్షలుకాని – ఫలానివని ఎన్నడూ బయటపెట్టలేదు. ఈ విషయంలో ఎంతో జాగ్రత్తగా ఉంటూవచ్చాడు. ఎన్న డైనా నా అంతట నేనే కదిపేదాన్ని. ఇన్ని పనులలో ఎలా మునిగితేలుతున్నారండీ – అని అడిగేదాన్ని. మీరేం సంక ల్పించుకున్నారో చెప్పండీ – అనేదాన్ని. ఊహుం. అప్పుడు కూడా ఆయన మనసువిప్పి చెప్పేవాడుకాదు. ముఖం చిట్లిం చుకునేవాడు. 'అవి నా స్వవిషయాలు. వాటితో నీకు సం బంధంలేదు. దయచేసి ఆ విషయాలు అడగకు, నీకు పుణ్యం ఉంటుంది.'' అంటూ మరోవిషయం ఏదో మాట్లాడడం మొదలుపెట్టేవాడు.

ఆయన ఇలా మనసువిప్పి చెప్పకపోవడంవల్ల మొట్ట మొదట నాకు కోపంకూడా వచ్చింది. కాని తరువాత తరు వాత అది ఆయనస్వభావంలెమ్మని సరిపుచ్చుకున్నాను. నాకు సంబంధించిన విషయాలుమాత్రమే మాట్లాడుతూ వచ్చాను. నా కదే బావుంది.

మరొక విషయం. నేను ఎలా ముస్తాబు చేసుకున్నా, ఎలా అలంకరించుకున్నా, తన కేమీ పట్టనట్లుండేవాడాయన. అంతే కాదు, నా వేషం చూచి చీదరించుకునేవాడు. ఏమిటో అది - నా కర్థం కాలేదు. మొట్టమొదట ఆయన ప్రవర్తన చూచి ఎంతో బాధపడ్డాను. కాని రానురాను అలవాటుపడి పోయాను. అలవాటయిన పిమ్మట హాయిగా నేఉంది.

నేను అందంగా ఉన్నానని ఆయన నోటితో ఎన్నడూ అని ఎరుగడు. పైపెచ్చు తన సమక్షంలో ఆమాట ఎవరన్నా అంటే, సహించేవాడు కాదు ముఖం ముడుచుకు పెట్టుకునేవాడు. విషపు నవ్వు నవ్వేవాడు. నాలో అందవికారాలు ఎక్కడున్నాయో అని వెతికి వెతికి వారికి చెప్పేవాడు కూడా. ఏదైనా పండుగనాడు కానీ, కార్యప్పట్లకానీ కాట్యా నాకు కొత్తబట్టలు కట్టి ముస్తాబు చేసేది. తలదువ్వి రకరకాలుగా జడ వేసేది. అది చూచి ఆయన సంతోషించడానికి మారు వేళాకోళం చేసేవాడు. ఏమిటీయన, ఇలా అంటాడని కాట్యా ఎంతో నొచ్చుకునేది. ఇది చూచి మొట్టమొదట నాకూ బాధగా నేఉండేది.

నాపై ఆయనకు ఇష్టమున్నదనీ, నన్నాయన ప్రేమిస్తున్నాడనీ కాట్యా తన మనస్సులో నిర్ధారణ చేసుకున్నది. తనకు ఇష్టమైన స్త్రీ అందంగా అలంకరించుకుంటే చూచి సహించలేడేమిటి ఈయన ?- ఏమిటీ మనిషి వింత ప్రకృతి !- అనుకునేది కాట్యా. పాపం, ఆ అమాయకురాలికి అంతర్యం అర్థమయ్యేది కాదు. కాని ఆయన స్వభావం నేను త్వరలోనే అర్థం చేసుకున్నాను. ఈ కాలపు పలుకులు - తళుకులు ఆయనకు నచ్చవు. వేషభాషల్లోనేమి, ప్రవర్తనలోనేమి, ఈ

పటాటోపాలూ పర్జాలూ ఆయనకు పనికిరావు. నేను సంసార సుఖంగా ఉండాలని ఆయన ఉద్దేశం. అది కనిపెట్టి అలాగే ఉంటూవచ్చాను. బిందుయౌవనంలో ఉన్నప్పటికీ షోకులు చేసుకోడం మానేశాను. ఏదో మామూలుపద్ధతిగా ఉంటూ వచ్చాను.

ఆయన నన్ను ప్రేమిస్తున్నాడని నాకు తెలుసు. కాని అది ఎలాంటి ప్రేమ? ఒక పసిపిల్లను ప్రేమిస్తున్నట్లు ప్రేమిస్తున్నాడా? లేక నన్నొక యువతిగా ప్రేమిస్తున్నాడా? - అని మాత్రం నాలో నేను ప్రశ్నించుకోలేదు. ఆయన ప్రేమ ఎంత అమూల్యమైనదో మాత్రం గ్రహించాను. అవును, నా అంత మంచిపిల్ల ఈ లోకంలో వెదకిచూచినా కనుపించదు నన్నుగురించి ఆయన అభిప్రాయం ఇదీ-సందేహం లేదు. ఆయన ఎల్లప్పుడూ ఈ భ్రాంతిలోనే ఉంటే మంచిదనికూడా నేను అనుకున్నాను

ఆయన్ను మోసంచెయ్యాలని నాకు ఏకోశానా లేదు. అయినా మోసంచేశాను. ఆయన అలా ఒకవంక మోసపోతుంటే, ఒకవంక నేను బాగుపడుతున్నాను. నా దేహసౌందర్యంకంటె నా ఆత్మసౌందర్యమే ఆయనకు చూపాలన్న అంతులేని ఆకాంక్ష నాకు కలిగింది.

నాముక్కు, ముఖం, నాతీరు - తెన్ను, నాజుట్టు - కట్టు, - అన్నీ ఆయనకు తెలుసు. నా అందచందాలేవీ ఆయనకు తెలియనివికావు బాగున్నా బాగులేకపోయినా ఎప్పుడో ఒకప్పుడు అన్నీ ఆయన చూచాడు. వాటిలో ఇంకా నేనేదో

విశేషం చూపాలనుకుంటే, అది ఆయన్ని మోసంచెయ్యడం తప్ప మరేమీకాదు.

కాని నా ఆత్మ ఉన్నదే - అది ఆయన ఎరుగడు. నా ఆత్మను ఆయన ప్రేమిస్తున్నాడు. అది నానాటికీ వికసించి వెలుగులు విరజిమ్ముతోంది. అలాంటి నా అంతరంగాన్ని ఆయనకు విప్పిచూపడం ఎంతో అవసరం. ఆవిషయంలో ఆయన్ని మోసంచెయ్యడమూ సులువే. ఇది అవగతంచేసుకునేసరికి నాహృదయం ఎంతో తేలికఅయింది. ఆయనఎదుట ఎలా నడుచుకోవాలో నాకు ఇట్టే పట్టుపడింది. అందులోని సులువూ సుఖమూ తెలిసివచ్చాయి. అంతవరకూ నాలో చెలరేగుతూవచ్చిన అనవసరమైన ఆందోళన నా వెకిలిపద్ధతులు - అన్నీ మటుమాయమైనాయి.

నేను కూచున్నా, నిలుచున్నా, జుట్టు ఎగదువ్వుకున్నా, జారవేసుకున్నా - ఎలా ఉన్నా ఆయనచూచే ఉంటారు. ఏపక్కనుంచో ఒక పక్కనుంచి నా తీరుతెన్నులు ఆయన కనిపెట్టేఉంటాడు. సందేహంలేదు. నేనాయనకు నచ్చాను ఇహ నా అందచందాలను గురించి ఎవరూ ఆయనకు చెప్పవలసినపనేలేదు.

కాబట్టి ఎవరైనా నన్నుచూచి ఎంతోముచ్చటగా ఉన్నానని ఆయనతో అంటే నాకు ఒరిగేదేమిటి? - పైగా అపహ్యాంకూడా కలిగేది. నన్నాయన తేరిపారచూచి - 'అవును. నీలో ఏదో విశేషముంది. ఎవరిలోనూ లేని విశేషముంది. నిజంగా నీవు భలేఅమ్మాయివి! చెప్పొద్దూ. - అనేవాడు. అప్పుడు నాకెంత హాయిగాఉండేది! ఎంతఆనందంగా

ఉండేది! నాగుండెల్లో ఏదో పెద్ద బరువు దించి నట్లనిపించేది.

—వృద్ధుడైన మా వంటవాడు గ్రెగరీకి తన మనుమ రాలంటే ఎంతో ముద్దు. అది చూచినప్పుడు నా కెంతో జాలికలుగుతుంది. ఏదైనా ఒక మంచికావ్యంకానీ, నవలకానీ చదివినప్పుడు నా హృదయం కరిగిపోతుంది. ముఖ్యంగా మొజార్ట్, షులాఫ్‌లు రచించిన గ్రంధాలంటే నా కెంతో ఇష్టం—అని నే నిలా చెప్పినప్పుడు ఆయన నన్ను ఎంతో మెచ్చుకునేవాడు. ఆయన మెప్పుకు నేను మురిసిపోయేదాన్ని.

అంత చిన్నతనంలోనే ఏది మంచిదో, ఏది చెడ్డదో, విచక్షణగా తెలుసుకునేటంత సూక్ష్మబుద్ధి, జ్ఞానం నాకు ఉండేవి. అవి తలచుకుని నాలో నేనే ఆశ్చర్యపడేదాన్ని. అయినా నిజానికి, ఏది మంచిదో, ఏది ఆయనకు నచ్చేదో నాకు పరిపూర్ణంగా తెలీదు.

నా వెనుకటి అలవాట్లన్నా, అభిరుచులన్నా, చాల వరకు ఆయనకు నచ్చేవికావు. నా నోట్లోమాటనోట్లో ఉండగానే నేనేం చెప్పదలుచుకున్నదీ ఆయన పసికట్టేవాడు. ముఖం చిట్లించుకుని గానీ, కనుసైగతో గానీ తన కిష్టంలేనట్లు సూచించి నన్ను చెప్పనిచ్చేవాడుకాదు. అంతలోనే నా అభిప్రాయం మార్చుకునేదాన్ని.

ఏ విషయంలోనయినా ఆయన సలహాఇవ్వబోతే - ముందుగానే నా కా విషయం తెలిసిపోయేది. తరుచు ఇది సంభవిస్తూఉండేది. నన్ను ఏదైనా అడిగి, సూటిగా నా కళ్ళలోకి చూచేవాడు. ఆ చూపు నన్ను ఆకర్షించి ఆకట్టుకునేది. ఆయనకు ఎలాంటిమాట ఇష్టమో అలాంటిమాటే

సమాధానం చెప్పేదాన్ని. ఆ రోజుల్లో నా ఆలోచనలు, అభిప్రాయాలు - అన్నీ నావికావు, ఆయనవి! ఆయన భావాలన్నీ నాలో చొరబడి నాకొక జీవితం ప్రసాదించాయి. జీవించేటట్లు చేశాయి నా జీవితం ఒక వెన్నెలవెలుగు అయింది! నాకు ఏమాత్రం తెలియకుండానే అన్ని విషయాలలోనూ నాదృష్టిమారింది. ఏవిషయంలోచూచినా వెనుకటి దృష్టికాదు నాది. కాట్యావిషయంకానీ, మా చెల్లెలు సోన్యా విషయంకానీ, మా కుటుంబవిషయంకానీ, నావిషయమే కానీ - అన్నివిషయాల్లోనూ నాచూపు వేరయింది. ఇప్పుడు నాకు అన్నీ కొత్తగా కనుపించడం మొదలుపెట్టాయి.

ఇదివరకు నేను ఏమీ తోచక, పొద్దుపోక పుస్తకాలు చదివేదాన్ని. కాని ఇప్పుడలాకాదు. ఆ పుస్తకాలే నాకు ప్రాణప్రదంగా కనుపించాయి. కారణంమరేమీకాదు. ఇప్పుడు పుస్తకాలు ఆయన తెచ్చియిస్తున్నారు. ఇరువురం కలిసి ఆ పుస్తకాలు చదువుకుంటున్నాం. వాటినిగురించి చర్చించుకుంటున్నాం. అదీ విషయం! ఇదివరకు నేను సోన్యాకు చదువు చెప్పేదాన్ని. దానిదగ్గరకూచుని పాఠాలునూరిపోయటం తలనొప్పిగా ఉండేది. అయినా విధిలేక ఆ పని చేస్తూఉండేదాన్ని ఇప్పుడాయనవచ్చి స్వయంగా సోన్యాకుపాఠంచెబుతున్నాడు అందుచేత నాకెంతో బరువుతగ్గినట్టూవుంది, మనస్సుకు హాయీ కలిగింది

ఇదివరకు నే నేదైనా ఒక పాట నేర్చుకోవాలంటే - కంఠతా పెట్టాలంటే - బ్రహ్మప్రళయం అయ్యేది. కాని ఇప్పుడలాకాదు. నేను పాట చదివితే ఆయన వింటాడు. విని

మెచ్చుకుంటాడు. అంచాత నాకెంతో ఉత్సాహంగా ఉం టోంది. ఒక్కొక్క పాట కనీసం ఓ యాభై తడవలయినా చదివి - పియానోమీద వాయించి నంగతా పెడు తున్నాను. వినలేక పాపం, కాట్యా చెవుల్లో దూదిపెట్టు కుంటున్నది. కాని నాకు మాత్రం వినకటలేదు నేను పాడే పాత పాటలన్నీకూడా ఇప్పుడు నా చెవులకు కొత్తగా విని పిస్తున్నాయి.

ఎన్నాళ్ళబట్టో నా ప్రాణానికి ప్రాణంగా ప్రేమిస్తూ వచ్చిన కాట్యాకూడా ఇప్పుడు నా కనులకొక కొత్తవ్యక్తిగా కనుపిస్తూవచ్చింది. ఇన్నాళ్ళూ తల్లిలేని మమ్మల్ని తల్లిలా సాకింది. మాఇంట్లో దాసిలాఉండి మాకు సమస్తపరిచర్యలు చేసింది కాని అదేమిటో ఇప్పుడు మొదటిసారిగా నాకో విషయం తట్టింది. న్యాయానికి ఆమె ఈ పనులన్నీ చెయ్య వలసినఅవసరం ఎంతమాత్రంలేదనిపించింది. ఆమె మాకోసం ఎంతోత్యాగంచేసిందనీ, కళ్ళలో పెట్టుకుని పెంచిందనీ, నేను గ్రహించేసరికి - ఆమెమీద నాకు ఎక్కడలేని జాలిపుట్టు కొచ్చింది. పూర్వంకంటె వెయ్యిరెట్లు మిన్నగా ఆమెను ప్రేమించసాగాను.

ఇంతెందుకూ! మా ఇంట్లో సేవకులు, పరిచారికలు, మా పొలంచేసే రైతులు, మాకింద బ్రతికేవారు మొద లయిన మా ఆశ్రితులు యావన్మందినీ వెనుకటిలాగా కాక, వేరేవిధంగా చూడడం ఆయనగారే నాకు నేర్పారు.

నిజానికి ఒక విషయం చెప్పకోడానికికూడా నాకు సిగ్గుగా ఉంది. పదిహేడేండ్లు నేనీ మనుష్యులమధ్య మెలి

గాను. ఈ ఆడవాళ్ళు-మగవాళ్ళు అంతా నాచుట్టూ ఉన్నారు. అయినా ఇంతకాలం వీరినిగురించి నాకేమీ తెలియదు. నాలాగే వారికీ అనేక ఆశలు, ఆకాంక్షలు, అనురాగాలు, కష్టసుఖాలు ఉంటాయని ఇంతకుముందు నే నెన్నడూ అనుకోలేదు. చూచారా ఎంత దారుణమో !

ఇన్నాళ్ళుగా, ఇన్నేళ్ళుగా నేను చూస్తూవచ్చిన మాతోటలు, దొడ్లు, పొలాలు, బీళ్ళు - అన్నీ ఇప్పు డక స్మాత్తుగా నా కళ్ళకు కొత్తగా కనుపిస్తున్నాయి. ఎంతో మనోహరంగా ఉంటున్నాయి 'మన జీవితాన్ని మరొకరికి అంకితంచెయ్యడమే ఆనందం. దాన్ని మించినఆనందం లేదు!—' అన్నా డాయన ఒకమాటు నాతో. అప్పుడామాట నాకు అర్థంకాలేదు. ఏదో వింతగా తోచిందికూడా. కాని తరువాత ఆయనచెప్పింది అక్షరాలా నిజం అని గ్రహించు కున్నాను. నాకు తెలీకుండానే ఆమాట నాహృదయంలో గాఢంగా నాటుకునిపోయింది. నా జీవితంలో పెద్దమార్పేమీ లేదు అయినా ఆయనప్రభావం నాపై పనిచేస్తున్నది. ప్రతి విషయంలోనూ ఆయనవ్యక్తిత్వం నాపై ముద్రవేస్తున్నది. ఇప్పు డాయన ఒకానొక ఆనందపూరితమైన జీవితాన్ని నా ముందు చిరిచాపలా పరిచాడు. నా చిన్నతనంనుంచీ జరిగి పోయిన విషయాలన్నీకూడా ఇప్పుడు అకస్మాత్తుగా ప్రాణం పోసుకుని కళకళలాడుతూ కనుపిస్తున్నాయి. ఆయన కను పిస్తేచాలు, దగ్గరుంటేచాలు, మాట్లాడితేచాలు— నాఅంత రంగంలో సంతోషం పెల్లుబికివస్తుంది. నాఆత్మ ఆనందంలో మునిగి తేలుతుంది.

# సంసార సుఖం

ఆ వేసవిలో, మేడమీద నా పడకగదిలోకి పడుకో డానికి వెళ్ళినప్పుడు అనేకరాత్రిళ్ళు నాకు నిద్రఉండేదికాదు. మనస్సులోకి ఎన్నెన్నో ఆలోచనలువచ్చేవి. తియ్యని తల పులు పుట్టుకొచ్చేవి. చెప్పలేనంత సంతోషంతో నాలో నేను పొంగిపోయేదాన్ని. ఎంతకూ నిద్రపట్టక చివరకు కాట్యా పక్కమీదికి వెళ్ళి కూచునేదాన్ని. సునుపటికంటె నేనెంతో హాయిగా, ఆనందంగా ఉంటున్నానని ఆవిడతో చెప్పుకునే దాన్ని. నా పిచ్చిగాని, నే నిప్పుడు ఎలా ఉంటానో ఆవిడ తనకళ్ళతో చూడ్డంలేదూ, నే చెప్పడం దేనికి? అయినా నాకలా చెప్పబుద్ధిపుట్టేది అంతా విని కాట్యా – 'అవు నమ్మా. నీవు బావుండడమే నాకు కావలసింది. నిన్ను చూస్తుంటే నాకడుపు నిండినట్లుంది తల్లీ'– అంటూ ఎంతో ప్రేమతో నన్ను ముద్దాడేది. ఆవిడ అన్నది నిజం. ఆవిడ మాటమీద నాకెంతో నమ్మకం. ఆవిడ ఒక్కతేకాదు. ఆరోజులలో నాకు లోకమంతాకూడా కళకళలాడుతున్నట్లు కనుపించేది. ప్రతిజీవీ సంతోషంగా ఉండాలనీ, అది ప్రతిజీవికీ అవసరమనీ, సాధ్యమేననీ అనిపించేది. నే నిలా అపరాత్రిళ్ళు ఒకటే నూచ్చట్లు చెపుతుంటే కాట్యాకు నిద్రాభంగం కలిగేది. వినివిని ఆవిడకు చివరకు విసుగుపుట్టేది. ఇహ వెళ్ళి పడుకోఅమ్మా – అంటూ నన్ను బలవంతాన తనపక్క మీదినుంచి దించి తాను పడుకుని నిద్రపోయేది. నేను మళ్ళీ నాపక్కమీదికి వెళ్ళి కూచునేదాన్ని. అలా గంటలతరబడి గడిచేది. కంటిమీదికి కునుకు వచ్చేదికాదు. నాకింత సంతో షం దేనికి? ఏమిటి కారణం? అని పదేపదే ఆలోచించేదాన్ని.

ఒక్కొక్కప్పుడు నా కింతటి ఆనందం ప్రసాదించిన ఆ ఈశ్వరుని పలుమారులుధ్యానించి, మొక్కుకుని సి వసా యేదాన్ని.

ఇలాగే ఒకనాటిరాత్రి మేలుకొని ఉన్నాను. గదంతా నిశ్శబ్దంగాఉంది. గాఢంగా నిద్రపోతోన్న కాట్యా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు, మధ్యమధ్య గడియారం టిక్కుటిక్కుమనడం తప్ప మరేమీ అలికిడిలేదు. నేను పక్కమీంద అటూ ఇటూ పొర్లుతున్నాను. నా మెడలో కట్టుకున్న శిలువగుర్తు పదే పదే కళ్ళకద్దుకున్నాను. జీసస్‌ను ప్రార్థించుకున్నాను. గది తలుపులు బిగించిఉన్నాయి. కిటికీరెక్కలుకూడా వేసి ఉన్నాయి. ఒక చిన్న ఈగో, దోమో వచ్చి ఎక్కడో 'మెంయ్' మని ధ్వనిచేస్తోంది. అసలు ఇలాగే తెల్లవారకుండా ఉంటే ఎంత బావుంను! ఎప్పుడూ నా గదిలో ఇలాగే నిశ్చల నిశ్శబ్దంలో పడుకుని ఉంటే ఎంత హాయిగా ఉండును! నా మనస్సు ఎప్పటికీ ఇలాగేఉండిపోతే ఎంత బావుంను !– అనిపించింది నాకు ! నేను కంటున్న కలలు, నాలో చెలరేగుతున్న ఆలోచనలు, నా దైనప్రార్థనలు – అన్నీ ప్రాణంవచ్చినట్లు ఆ నిశ్శబ్ద నిశీథిలో పారాడుతున్నాయనీ, ఆ గదిలో కదులుతున్నాయనీ, మెదులుతున్నాయనీ, నాపక్క చుట్టూ మూగుతున్నాయనీ అనిపించింది నాకు.

నా ప్రతిఆలోచనా నాదికాదు ఆయనిది. నా ప్రతి భావమూ నాదికాదు ఆయనిది. నా ప్రతి ఆనందమూ నాది కాదు ఆయనిది ! ఇదంతా ప్రేమఫలితమేనని అప్పటికింకా నాకు తెలీదు. అప్పటి నా మనస్థితి అలాగే, ఎప్పటికీ ఉండిపోతుందనీ, మధ్యలో ఎప్పుడూ మారదనీ అనిపించింది నాకు!

# 3

ఒకనాడు మా పొలంలో పైరు కోస్తున్నారు. మధ్యాహ్నం భోజనాలయినతరువాత, నేను, కాట్యా, సోన్యా - ముగ్గురం పొలంచూడ్డానికి వెళ్ళాం. మా తోటలో నిమ్మ చెట్లనీడను కూచున్నాం. అక్కడెంతో హాయిగా ఉంటుంది. అక్కడనుంచి చూస్తే దిగువన ఒకలోయ, దూరంగా పొలాలు, అడవులు చక్కగా అగుపిస్తాయి.

సెర్జి మిఖాలిచ్ మాకు కనుపించి రెండురోజులయింది. ఆవేళఅయినా వస్తాడేమోఅని కనిపెట్టుకుని ఉన్నాం. తప్పకుండా పొలంచూడ వస్తానన్నాడని మా రైతుకూడా చెప్పాడు. మధ్యాహ్నం రెండుగంటలప్పుడు ఆయన 'రై' పైరు వేసిన పొలంవైపు గుర్రంమీద వెళ్ళడం మేము చూచాం. కాసిని పండ్లు (పీచ్ పండ్లు, చెర్రీపండ్లు, కోసుకురమ్మని మా పనిమనిషిని పంపింది కాట్యా పండ్లంటే ఆయనకెంతో ఇష్టం. ఇలా పనిమనిషికి పురమాయించి, కాట్యా నావంకచూచి చిరునవ్వునవ్వింది. తరువాత చెట్లనీడనుఉన్న ఒకబెంచీమీద పడుకుని కునుకుతీయసాగింది. నేనొక చిన్ననిమ్మకొమ్మ విరిచాను. బాగా ఆకులున్న రెమ్మఅది. తడి తడిగాకూడా ఉంది. దానితో కాట్యాకు విసురుతూ పక్కనకూచున్నాను. ఒక చేతిలో పుస్తకం ఉంది. పుస్తకం చదువుతూ మధ్యమధ్య ఆయన వస్తున్నాడేమోఅని తలఎత్తి పొలాలవంక చూస్తున్నాను.

సోన్యా ఒక పెద్ద నిమ్మచెట్టు మొదట్లో కూచుని బొమ్మరిల్లు కట్టుకుంటోంది. ఎండ మండిపోతోంది. విపరీతంగా

ఉక్కపోస్తోంది. గాలిఅన్నమాటలేదు. ఆకాశంలో కారుమబ్బులు కమ్ముకుంటున్నాయి. అసలారోజు ప్రొద్దుటినుంచీ బ్రహ్మాండంగా ఉఱుముతోంది. ఉఱిమినప్పుడల్లా నా గుండెలు జల్లుమంటున్నాయి. కాని మధ్యాహ్నంఅయ్యేసరికి మబ్బులు విడిపోయాయి. మళ్ళీ ఫెళఫెళలాడుతూ ఎండ వచ్చింది. మబ్బువిడిచినఎండ! ఒకవైపుమాత్రం ఇంకా దట్టంగా మేఘం కమ్ముకునేఉంది. ఉండిఉండి ఉఱుముతూనే ఉంది. దూరంగా పొలాలలో దుమ్ములేచి ఆకాశంలో కలిసిపోతోంది. అప్పుడప్పుడు మెరుపులు మెరుస్తున్నాయి. ఏమైనా ఆరోజుకు ఇహ వర్షంరానట్లే.

తోటవెనకాలఉన్న బాటగుండా, కోసినపైరు కట్టలు కట్టి వేసుకపోతున్న బండ్లచప్పుడు మధ్యమధ్య మాకు వినవస్తోంది ఖాళీబండ్లు కొన్ని ధాన్యపుకట్టలు వేసుకురావడానికి పరుగులుతీస్తూ పోతున్నాయి. బండ్లవెంట రంగురంగుల చొక్కాలువేసుకున్న రైతులు ఉల్లాసంగా నడిచివెడుతున్నారు. బాటపొడుగునా దట్టంగా ధూళి చెలరేగుతోంది. చెట్లనిండా కమ్ముకుంటోంది దూరంగా చొప్పదొడ్లముందు బండ్లచప్పుడు, మాటలు వినవస్తున్నాయి దొడ్లచుట్టూఉన్న కంచెనుఆనుకుని కూలీలుపంటగూళ్ళువేస్తున్నారు. చెట్లసందులలోనుంచి నాకు కనుపిస్తూనేఉంది. అంతకంతకూపంటగూళ్లు గుమ్మటాల్లా పైకిలేస్తున్నాయి. కూలీలు, రైతులు పైననిలుచుని కట్టలు సర్దుతున్నారు. ఇటువైపు ఎదురుగాఉన్న పొలాలలోనుంచికూడా బండ్లచప్పుళ్ళూ, రకరకాల ధ్వనులూ వినిపిస్తున్నాయి. కూలీలు ఉల్లాసంగా పల్లెపదాలు పాడుతున్నారు.

ఒకపక్క పొలంలో పైరు పూర్తిగా కోశారు. దుం పలతోను, అక్కడక్కడ మళ్ళుమళ్ళుగాఉన్న కలుపు మొక్కలతోను కనుపిస్తోంది.

ఇంకాదూరంగా కుడివైపుకు చూస్తే - కొన్ని పొలాలలో అప్పుడే పైరుకోయడం పూర్తిఅయింది. కూలీలు వంగి, కోసినపైరు కట్టలుకడుతున్నారు. రంగురంగుల బట్టలు వేసుకున్న ఆడవాళ్ళు కన్నులపండువగా కనుపిస్తున్నారు. చేతులూపుకుంటూ, ఒకరినొకరు పిలుచుకుంటూ పచ్చని పైరు కట్టలుకట్టి పక్కవారికి అందిస్తున్నారు. ఆ దృశ్యం ఎంత మనోహరంగా ఉంది!

నే నలా చూస్తూ చూస్తూ ఉండగానే నా కళ్ళ ముందు అకస్మాత్తుగా వేసవికాలం వెళ్ళిపోయి. శిశిరఋతువు వచ్చినట్టనిపించింది. తోటలో మేము కూచున్నచూల మాత్రం చల్లగా, హాయిగాఉంది. అంతే నాలుగుదిక్కులా ఎండ నిప్పులుచెరుగుతోంది. సుడిగాలికి దుమ్మెలేస్తోంది. ఆ ఎర్రని ఎండలో, ఆ గాలిదుమారంలో కర్షకులు, కూలీలు వంచిననడుము ఎత్తకుండా పొలంపని చేస్తున్నారు. పని చేస్తూనే కులాసాగా కబుర్లాడుకుంటున్నారు.

చుట్టూ ఇంత జరుగుతున్నా మా కాట్యామాత్రం, చల్లని చెట్టునీడన బెంచీమీద పడుకుని, హాయిగా గురకలు తీస్తూ నిద్రపోతోంది. ముఖంమీద తెల్లసిల్కు చేరుమాలు కప్పుకున్నది. పక్కన పళ్ళెంలో, నల్లగా పండిన చెర్రీపండ్లు నిగనిగలాడుతూ కనుపిస్తున్నాయి చూస్తూంటే నోరూరుతోంది. మేము వేసుకున్నగౌనులు, పరిశుభ్రంగా, తెల్లగా

తళతళలాడుతున్నాయి. పక్కన చెంబులో చల్లనిమంచినీళ్ళు న్నాయి. ఇవన్నీ చూస్తూంటే నా కెంతో హాయిగా, ఆనందంగా ఉంది! —'కాని దేని కీ హాయి? దేని కీ ఆనందం? ఎవరికోసం? నా ఆనందంలో పాలుపంచుకునేవా రెవరున్నారు? అయినా నేను ఆనందంగాఉండడంలో తప్పేముంది?...' ఇలా నాలో నేను పరిపరివిధాల అనుకోసాగాను.

అప్పటికి ప్రొద్దువాలింది పశ్చిమదిశన కొండరావిచెట్లసందులలోనుంచి సూర్యకిరణాలు వచ్చిపడుతున్నాయి. పొలాలలో గాలిదుమారం అణిగింది. తళతళలాడే సూర్యకాంతిలో ప్రతిఫలిస్తూ, స్పష్టంగా ప్రకాశవంతంగా అగుపిస్తోంది. మబ్బులన్నీ మాయమయినాయి. దూరంగా చెట్లసందులలోనుంచి అప్పుడే వేసిన మూడు నాలుగు పంటగూళ్ళు కనుపిస్తున్నాయి. రైతులు, కూలీలు పనిపూర్తి చేసుకుని గూళ్ళువదలి వస్తున్నారు. ఇహ ఆనాటికి పనిఅయిపోయింది. ఖాళీబండ్లు ఇళ్ళకు మళ్ళాయి. చప్పుడుచేసుకుంటూ మేము ఉన్నప్రదేశం దాటేసి దూరంగా పోతున్నాయి. పల్లెపడుచులు దంతెలు, సలకపారలు, మోకులు బుజానవేసుకున్నారు. కొడవళ్ళు రొండిన దోపుకున్నారు ఉల్లాసంగా పాటలుపాడుకుంటూ ఇళ్ళకుపోతున్నారు కాని ఇంతమంది వస్తున్నా, సెర్జీ మిఖాలిచ్ మాత్రం జాడ - అయిపూ లేదు! ఆయన ఎప్పుడనంగానో పొలానికిరావడం చూచాను. కాని ఇంతసేపయినా ఆయన ఈ చాయలకురాలేదు. అకస్మాత్తుగా నేనిలా అనుకుంటూ ఉండగానే ఆయన పొడుగాటి విగ్రహం కనుపించనేకనుపించింది ఆయన వేరే త్రోవను వస్తు

న్నాడు. ఆ త్రోవను వస్తాడని నే ననుకోనేలేదు. కొండ లోయప్రక్కనుంచి వచ్చే మట్టిత్రోవ అది. టోపీ చేతపుచ్చుకున్నాడు. ముఖం కళకళలాడుతోంది. ఉల్లాసంగా ఉన్నాడు గబగబా నేనున్నచోటికి వచ్చాడు. కాట్యా నిద్రపోతూఉండడం అల్లంతదూరాన్నుంచే చూచాడు. 'అరెరె' అన్నట్లు నాలుక కొరుక్కున్నాడు. కళ్ళుమూసుకున్నాడు. మెల్లగా, చప్పుడుకాకుండా మునివేళ్ళపై నడుస్తూ నాదగ్గఱకు వచ్చాడు ఆయన చాలా హుషారుగా ఉన్నాడని నే నిట్టే కనిపెట్టేశాను. మామూలు హుషారు కాదు. వెర్రి ఉల్లాసం ! ఆయన అలాఉంటే చూడడం నాకెంతో ఇష్టం. బళ్ళో పాఠాలు ఎగగొట్టివచ్చిన కుర్రాడు ఎలాఉంటాడో సరిగ్గా అలా ఉన్నా డాయన ఆపాదమస్తకం పరిశీలించి చూచాను. ఎక్కడలేని సంతోషం, సంతృప్తి పుచ్చఆయనలో ఉట్టిపడుతోంది.

'ఏం రాణీ! ఎలా ఉన్నావు? కులాసాగా ఉన్నావా ? వంట్లో బాగుంటోందా? అని అడిగాడు మెల్లగా. నా చెయ్యికుని నొక్కాడు ...తరువాత నేనేదో అడిగాను.

అందుకు జవాబుగా - 'అవును. ఇవాళ ఎంత హుషారుగా ఉందనుకున్నావు? ఇప్పుడు నేను పదహారేండ్ల బాలకుమారుడులా ఉన్నాను; చెట్లెక్కాలనీ, కోతికొమ్మచ్చులాడాలనీ ఉంది, చెప్పొద్దూ!' అన్నాడు.

'మీా కేమన్నా పిచ్చెక్కిందా ఏమండి? ఇది పిచ్చి సంతోషం కాదుకదా!' అన్నాను నేను, నవ్వుతున్నట్లు ఆయనకళ్ళవంక చూస్తూ. నిజానికి ఆయన కొక్కడికే కాదు.

పిచ్చెక్కింది, నాకుకూడా. అప్పు డేదో కొత్రి ఆవేశంవచ్చి నన్నూ ఆవహించింది!

ఆయనకు నవ్వొచ్చింది. ఆపుకున్నాడు. కళ్ళొత్తుక్కుంటూ—

'అది సరేకాని, పాపం, ఎందు కా కాట్యాను నిమ్మ కొమ్మతో అలా, ముక్కుల్లో పొడుస్తున్నావు?' అన్నాడు.

నేను ఆయనవంక చూస్తూ, కొమ్మతో కాట్యాకు విసురుతున్నాను ఆవిడ ముఖంమీది దుమాలు తొలగి పోయింది. కొమ్మకొసలు ఆవిడముక్కుకు తాకుతున్నాయి. నా తెలివితెల్లవారిపోను — నే నది చూడనేలేదు !

నేను నవ్వాను — 'చూడండీ! ఈమె ఇంత వళ్ళు తెలీకుండా నిద్రపోతున్నదా - కాని, నేను నిద్రేపోతే గంటుంది! —'అన్నాను రహస్యంగా. ఆయనతో అలా ఏకాంతంగా మాట్లాడాలని నా కెంతో అభిలాష.

నేనుచెప్పింది తనకు వినిపించలేదన్నట్లుగా ఆయన పెదవులుకదల్చి ఏదో గుసగుసలాడాడు. నన్ను ఎగతాళి చేశాడు.

పళ్లెంలోఉన్న చెర్రీపండ్లు చూచి వాటిని సంగ్రహిస్తున్నట్లుగా నటించాడు. తరువాత నిమ్మచెట్టుక్రింద ఆడుకుంటున్న సోన్యాదగ్గఱకు వెళ్ళాడు అది కట్టుకున్న బొమ్మరిళ్ళపై గభాలున కూచున్నాడు మొదట్లో సోన్యాకు కోపం వచ్చింది. కాని ఆయన — 'చెర్రీపండ్లు ఎవరు ఎక్కువ తింటారో చూద్దాం!...' అంటూ ఆ పిల్లను సమాధాన పరిచాడు.

'కావాలంటే చెప్పండి, ఇంకా పండ్లు తెప్పిస్తాను. లేదా మీరే వెళ్ళి తెచ్చుకోండి!—' అన్నాను

ఆయన పళ్ళెం పట్టుకున్నాడు సోన్యా బొమ్మలు తీసి అందులో పెట్టాడు తోటలోకి వెళ్ళాడు నేనూ ఆయనతో బయలుదేరాను. సోన్యా పకపకనవ్వుతూ ఆయన వెనకాలే పరుగెత్తింది. ఆయన కోటుఅంచు పట్టుకొని గుంజుతూ 'నా బొమ్మలు నా కిచ్చెయ్యండి!—' అంటూ మారాంచేసింది.

దానిబొమ్మలు దాని కిచ్చేశాడు. మళ్ళీ నాతో,ఏదో కొంపమునిగినట్లు మాట్లాడడం మొదలుపెట్టాడు.

'అది సరేకాని, రాణీ!' అన్నాడు, మెల్లగా— 'నేను ఈ ఎర్రని ఎండలో, గాలిదుమారంలో పొలాలన్నీ తిరిగి తిరిగి వచ్చాను. కాని ఇక్కడికి వచ్చి, నిన్ను చూచేసరికి — నా అలసటంతా మటుమాయమైంది. నీవు నిజంగా రాణివి ! మామూలురాణివి కాదు, మహారాణివి!' అన్నాడు.

'అది సరేకానీండి — ఈవేళ మీ పొలంపనులుఎలా జరుగుతున్నాయి?—' అని అడిగాను. నేనుఆయన మాటలకు పొంగిపోయాను. ఆ పొంగుబాటు పైకి కనబడకుండా ఉండా లని అలా అడిగాను.

'పొలంపనులకేం ? సలక్షణంగా సాగుతున్నాయి. మన రైతులూ, కూలీలూ ఉన్నారే - వాళ్ళలాంటి మను ష్యులను మనం ఎక్కడాచూడం! వాళ్ళను అర్థంచేసుకోవాలే కాని, చేసుకుంటే ప్రాణాలు విడుస్తారనుకో!—' అన్నాడు.

'అవునండీ. ఇవాళ నేను కళ్ళారా చూచాను. ఇంతకుముందు- మీ రొచ్చేదాకా ఇక్కడే తోటలో కూచు

న్నాను. వాళ్ళు ఎర్రనిఎండలో రేకులు పియమకుంటు న్నారు. సహజంగా వాళ్ళనుచూస్తే నాకుసిగ్గేసింది. వాళ్ళంతా పనిచేస్తుంటే, నే నిలా వళ్ళుబరువుతో నీడపట్టున నిమ్మ పండులా కూచోడమేమిటా అనిపించింది, చెప్పొద్దూ ?—' అంటూ, నేను ఇంకా ఇంకా ఏదో చెప్పబోయాను. కాని ఆయన నామాటకు అడ్డువచ్చాడు—

'కాని, ఒక్కమాట చెపుతాను, విను అమ్మాయ్ ! నీ వంత తేలిగ్గా తీసిపారెయ్యవలసినవిషయం కా దిది. ఏదో అయ్యో పాపం, అని వాళ్ళమీద దయచూపించి ఊరుకుంటే సరిపోదు. ఇది చాలా గొప్పవిషయం. దీన్ని నీవు తమా షాగా తీసుకోడానికి ఎంతమాత్రం వీల్లేదు, తెలిసిందా ?–' అన్నాడు.

ఆయనముఖం గంభీరముద్ర తాల్చింది. నా కళ్ళలోకి చూచాడు. ఆ చూపులో ఎక్కడలేని కారుణ్యం తొణికింది.

'ఏదో మీరుకనుక-చనువువల్ల ఈవిషయం అన్నాను. మరొకరైతే ఎందు కంటానండీ !–' అన్నాను.

'సరే, ఇహ ఆవిషయం పోనీ...... ఇంతకూ మనకు చెర్రీపండ్లు కావాలి, ఎలాగ ?–' అని అడిగా డాయన.

తోటగేటుకు తాళంవేసిఉంది. తాళపుచెవి తోట మాలిదగ్గర ఉంది తోటమాలీ లెవరూ అక్కడలేరు. (అంద రికీ పనులుచెప్పి ఆయనే పంపించాడు); ఏమయితేనేం? తాళపు చెవికోసం పోన్యా పరుగెత్తింది. కాని అంతవరకూ ఆయన గారు ఓపికపడితేనా, వెళ్ళి తోటగోడ ఎక్కనే ఎక్కాడు. ఎగిరి లోపలికి దూకాడు.

'నీకూ కాసిని పండ్లు కోసివ్వనా? ...ఏదీ. ఆ పళ్లెం ఇలా అందించు.-' అన్నాడాయన, తోటలోనుంచి.

'నేను కోసుకుంటానులెండి, మీరేం కొయ్యక్కర్లేదు... ...తాళపుచెవికోసం సోన్యా వెళ్ళిందేమోనని, దాని వల్ల కాదు నేనే వెళ్ళి తెస్తాను.-,' అన్నాను నేను, ఇవతలున్నించి.

ఇలా అన్నానేకాని, అక్కడనుంచి కదల్లేదు. అకస్మాత్తుగా నాకో ఆలోచనతట్టింది. తోటలో ఆయన ఏంచేస్తున్నాడో చూడాలనిపించింది. తను ఒంటిగాఉన్నాననీ, ఎవరూ తనను చూడడంలేదనీ అనుకుంటాడుకదా. మరి ఇప్పుడాయన ఏంచేస్తుంటాడో! చూడాలి చూడాలని బుద్ధిపుట్టింది నాకు. నిజానికి అప్పుడు నా పరిస్థితి అలాగేఉంది ఒక్కక్షణం కూడా ఆయన్ను చూడకుండా ఉండలేను! ఇంకేం! మెల్లగా, చప్పుడుకాకుండా మునివ్రేళ్ళపైన నడిచివెళ్ళాను. త్రోవలో దురదగొండిచెట్లను తప్పించుకొని తోటఅవతలిప్రక్కకు వెళ్ళాను. అక్కడ ఒకమూల ప్రహరీగోడ ఎత్తు తక్కువగా ఉంది. గోడప్రక్కన ఖాళీగాఉన్న నీళ్ళతొట్టి ఒకటిఉంది. తొట్టిమీద కాలుపెట్టి, పిట్టగోడమీదగుండా తోటలోకి తొంగిచూచాను.

ఆయన ఎక్కడున్నాడో అని తోటంతా కలయ చూచాను తోటనిండా చెర్రీచెట్లు. ఏనాటిచెట్లో అవి! సందు లేకుండా ఆకులతోను, నల్లటిపండ్లతోను విదిలిపోతున్నాయి. ఒక పెద్ద చెర్రీచెట్టుకొమ్మక్రింద సెర్జీ మిఖాలిచ్ ఉన్నాడు.

నేను తాళంచెవికోసం వెళ్ళానని అనుకునిఉంటాడు;

తన నవుకూ చూడటం లేదనీ అనుకుంటూ ! అంతు టోపీ తీసి కళ్ళుమూసుకున్నాడు. చెట్టుక్రింద ఒక మొద్దుమీద కూచుని ఏదో దీర్ఘాలోచనలో మునిగిఉన్నాడు. చుట్టుకున్న బంక కాస్త తీసి చేత్తో ఉండచేస్తున్నాడు. అలా ఉండిఉండి అకస్మాత్తుగా బుజాలెగరేశాడు. కళ్లు తెరిచాడు. తనలో తాను ఏదో గొణుక్కున్నాడు. ఆయనలా తనలోతాను ఏవో పిచ్చిపనులు చేసుకుంటూఉంటే, నేను దొంగతనంగా చూస్తున్నాను. నిజం చెప్పొద్దూ నాకు కష్టమనిపించింది. ఆయన తనలోతాను - 'మాషా' అని నాపేరే తలుచుకుంటు న్నట్లు వినిపించింది.

'ఆఁ, నన్నెందుకు తలుచుకుంటాడు !–' అను కున్నాను మళ్ళీ.

కాని అది నిజమే - 'మాషా ! నా చిన్నారి మాషా' అని ఆయన మళ్ళీ నన్ను తలుచుకున్నాడు. ఈతడవ నాకు స్పష్టంగా వినిపించింది. నాగుండెలు దడదడ కొట్టుకున్నాయి. ఏదో వెర్రిఆవేశం, ఆనందం వచ్చి నన్ను ఆవహించాయి. నా చేతులూ కాళ్ళూ వణికిపోతున్నాయి. జారిపడతానేమో నని గోడఅంచు గట్టిగా పట్టుకున్నాను. కాని, నా గాభరా వల్ల అలికిడి కానేఅయింది. ఆయన ఉలిక్కిపడి తలఎత్తి చూచాడు నేను కనుపించాను. కళ్ళు దించుకున్నాడు. ముఖం ఎర్రగా కందగడ్డలా అయింది తప్పుచేసిన పసిపిల్ల వాడిలా తలవాల్చుకున్నాడు. ముఖాన నెత్తురుచుక్క లేదు.

ఏదో నాకు చెప్పాలని ప్రయత్నించాడు. కాని చెప్ప లేకపోయాడు. ముఖం అంతకంతకూ జేవురించింది. ఎలా

గయితేనేం, మళ్ళీ తలెత్తి నావంక చూచాడు. ఆయనకు నవ్వొచ్చింది. ఆయనన్ను చూడగానే నాకూ నవ్వొచ్చింది. అప్పుడాయన ముఖం సంతోషంతో ఇంత అయింది

ఎప్పుడూ నాకూ బుద్ధులు చెపుతూ, నన్ను మెచ్చుకుంటూ ఉండే వయోవృద్ధుడిలా అప్పుడాయన కనుపించలేదు. ఆయన నాకన్న గొప్పవాడు కాదు, తక్కువవాడూ కాదు. నాతో సరిసమానస్థుడిలా నాకళ్ళకు కనుపించాడు! ఆయనంటే నాకు ప్రేమ, భయం!

ఇరువురం ఒకరితో ఒకరం మాట్లాడకుండా అలాగే ఉండిపోయాం. కాని ఒకరినొకరం చూచుకుంటూనే ఉన్నాం. అంతలో ఆయన ముఖం చిట్లించుకున్నాడు. ముఖకవళికలు మారిపోయినాయి. కళ్ళలో ఆ కాంతిలేదు. పెదవులపై ఆ చిరునవ్వులేదు. మళ్ళీ వృద్ధాప్యపుఛాయలు ఆయనలో అలుముకున్నాయి. అంతవరకూ మేమేదో చెయ్యకూడనిపని చేస్తున్నట్లు, ఇప్పుడు తనకు తెలివివచ్చినట్లు నన్నుకూడా తెలివి తెచ్చుకోమన్నట్లు కనుపించాడు.

'అమ్మాయ్! ఇహ నీ వా గోడమీదనుంచి దిగు. క్రింద పడ్డావూ అంటే ఏ కాలో చెయ్యో విరుగుతుంది; చస్తాం!... అదిగో! ఆ జుట్టు చూడు! ఎలా గద్దగూడులా అయిందో!... కాస్త సవరించుకో!—'అన్నాడు.

'ఎందుకీయన ఇలా ప్రవర్తిస్తాడు? లోపల ఒకటీ పైన ఒకటీను - ఎందుకీ నటనంతా? అనవసరంగా నా మనస్సును నొప్పిస్తాడు దేనికి?—' అనుకున్నాను నాలో నేను చిరాగ్గా. క్షణంలో నాకు ఉద్రేకం పుట్టుకొచ్చింది. ఆయనన్న

కలవరపెట్టాలనీ, నా అంతటా ఆయన అంతటా తేల్చుకోవాలనీ అనిపించింది.

'నేను పండ్లుకోసుకోవాలి. నేను దిగను -' అంటూ, వ్రేలాడుతోన్న ఒక చెట్టుకొమ్మ పట్టుకొని గోడమీద నిలుచున్నాను. ఆయన నాదగ్గరికి వచ్చేలోగానే నేను గభాలున తోటలోకి దూకాను.

'ఏమిటీ వెర్రివేషాలు?... ఎక్కడా దెబ్బతగల్లేదు కదా? ... అయినా మళ్ళీ బయటికి ఎలా వెడదామనుకున్నావ్? - అన్నాడాయన; ఆయనముఖం జేవురించింది. గాభరాపడ్డాడు.

నేను తోటలోకి దూకినతరువాత ఆయన గాభరా మరీ ఎక్కువైంది. అది చూచేసరికి నాకు సంతోషానికి మారుగా భయంపుట్టింది ఎక్కడలేని సిగ్గు, బిడియం ముంచుకొచ్చాయి. ఆయనకు కొంచెం ఎడంగా తొలిగి నిలుచున్నాను. ఏమీ తోచలేదు. ఆయన కేం చెప్పాలో పాలుపోలేదు. తలఅయినా ఎత్తలేదు. క్రింద రాలిన చెర్రీపండ్లు ఏరుకోవడం మొదలుపెట్టాను. కాని పండ్లు పెట్టుకోడానికి నాదగ్గ రేమీలేదు. నన్ను నేనే తిట్టుకున్నాను నాలో నేను పశ్చాత్తపించాను. నే నిలా దురుసుగా ప్రవర్తించటంవల్ల నామీదఉన్న సదభిప్రాయంకాస్తా పోతుందేమోనని భయపడ్డాను. ఇరువురమూ మౌనం వహించాం, ఆ మౌనం మహా దుర్భరంగాఉంది.

ఆ పరిస్థితిలో సోన్యా తాళపుచెవి తీసుకుని పరుగెత్తుకుంటూ వచ్చింది అమ్మయ్య మేం తెప్పరిల్లుకున్నాం.

కొంతసేపు ఇకపురగం సోన్యాతో మాట్లాశాం.

తరువాత తోటలోనుంచి ఇవతలికి వచ్చాం. కాట్యా దగ్గరికి వెళ్ళాం. నే నసలు నిద్రపోలేను, ఇంతసేపూ మేలుకొనే ఉన్నాను - అన్నది కాట్యా, చిత్రంగా. ఆయన మళ్ళీ తన మామూలుధోరణిలో మాకు బుద్ధులుచెప్పడం ప్రారంభించాడు కాని ఎన్నిచెప్పినా నేనుమాత్రం నమ్మలేదు. ఆయనతత్వం నాకు అర్థమైంది. అంతకుక్రితం - కొద్దిరోజుల క్రింద మామధ్య జరిగిన సంభాషణఒకటి - అప్పుడు నాకు జ్ఞాపకానికివచ్చింది.

'ఒకస్త్రీని ప్రేమించడమన్నా' ఆప్రేమను వెల్లడించడమన్నా మగవాళ్ళకు చాలా తేలిక - ఆడవాళ్ళ కది సాధ్యంకాదు— అన్నది కాట్యా. — 'నేను ఫలానాస్త్రీని ప్రేమిస్తున్నాను అని మగవాడు నిర్భయంగా చెప్పగలడు. ఆడకూతురు ఆపని చేయలేదు -' అన్నది.

అందు కాయన -'వట్టిది. మగవాడు అలా ఎన్నటికీ చెప్పలేడు -' అన్నాడు.

'ఏం ? ఎందుకని ?'- అని అడిగాను, నేను. 'ఎందు కంటావా, చెపుతాను, విను - తా నొకస్త్రీని ప్రేమిస్తున్నా ననేది ఎప్పటికీ నిజంకాదు. పైగా ప్రేమించడమంటే, ఏమిటా ప్రేమ! ఏమిటి దానికి అర్థం? ఒకవేళ నే నొకస్త్రీని ప్రేమిస్తున్నానని చెపితే, తక్షణమే, తా నా స్త్రీకి దాసుడు అవుతున్నాడన్నమాట! కాబట్టి మగవా డెన్నడూ అలా చెప్పలేడు చెపితే ఇతరులనుమోసగించడమేకాక,తన్నుతాను మోసగించుకుంటున్నాడన్నమాట'- అన్నా డాయన, మళ్ళీ.

'అవుతే బాబుగారూ! మగవాడు చెప్పడంటున్నారు. ఇహ మరి, తన లోకపురుషుడు ప్రేమిస్తున్నాడన్నవిషయం స్త్రీకి తెలియడం ఎలాగ!' - అని అడిగింది కాట్యా.

'అదేలాగో నాకు తెలీదు ప్రతిఒక్కరికీ తమభావాలను వెల్లడించేతీరు వుండనేవుంటుంది ఒకొక్కరు ఒకొక్కతీరుగా వ్యక్తంచేస్తుంటారు ప్రేమఅనేది మనస్సులో మొలకెత్తాలేకాని, అది ఏదోతీరుగా బయటికి పొటకరించక మానదు. అంతకుతప్ప మనం చదివే నవలల్లో జరిగినట్లు ఎన్నటికీ జరగదు ఆ నవలలు చదువుతుంటే, నాకు చచ్చే నవ్వు వస్తుంది. ఉదాహరణకు మన నవలల్లోని లెఫ్టినెంట్ స్ట్రియిల్స్కీకానీ, ఆల్ఫ్రెడ్ కానీ ఎకాఎకి ప్రియురాలిదగ్గరికి వెళ్ళి - ఓ, నా ఎలిజనాక్! ఓ, నా ప్రియసఖి! నిన్ను నా ప్రాణానికి ప్రాణంగా ప్రేమిస్తున్నాను' - అని ఉపన్యాసమిస్తాడు. ఏదో అసాధారణమైనవిషయం ఒకటి జరుగుతుందనుకుంటాడు కాని, పాపం! ఏమీ జరగదు. అటు కథానాయకి, ఇటు కథానాయకుడు - ఇరువురు యథాతథంగానే ఉంటారు. అవే కళ్ళు, అదే ముక్కు - అన్నీ అవే, ఏమీ మార్పుండదు' అన్నా డాయన.

ఆయన నన్నే మనస్సులోపెట్టుకొని అలా పరాచకాలాడాడని అప్పుడు నే ననుకున్నాను. ఆ పరాచకాలవెనకాల మరేదో అర్థమున్నదనీ, అది నాకు సంబంధించిందేననీ గ్రహించుకున్నాను. కాని కాట్యామాత్రం ఆయనలా ప్రేమకథల్లోని నాయకీనాయకులను ఎందుకూ పనికిరాకుండా తీసివెయ్యడం ఒప్పుకోలేదు.

'మీరెప్పుడూ ఇలాగే పరాచకాలాడుతుంటారేం బాబుగారూ! కాని, ఇప్పుడు నా కో విషయం నిజంచెప్పండి? నేను నిన్ను ప్రేమిస్తున్నానని మీరెన్నడూ ఒకస్త్రీతో చెప్పలేదా?'- అని అడిగింది.

'ఎన్నడూ చెప్పలేదు. ఇదివరకుగాని, ఇప్పుడుగాని - ఇహాముందు చెప్పనుకూడా!' అన్నా డాయన, పకపక నవ్వుతూ.

ఎప్పుడో మామధ్య సాగిన ఈ సంభాషణ ఇప్పుడు చటుక్కున నాకు తలపుకువచ్చింది.

'అవును. నన్ను ప్రేమిస్తున్నానని చెప్పవలసిన అవసరం ఆయనకు లేదు-' అనుకున్నాను, నాలో నేను. 'ఆయన చెప్పినా చెప్పకపోయినా, నన్ను ప్రేమిస్తున్నాడు. అది నాకు తెలుసు. ఆయన నన్నేదో మసిబూసి మారేడు కాయచెయ్యాలని చూస్తున్నాడు కాని, నే నేం పిచ్చిదాన్ని కాదు!' అనుకున్నాను.

ఇహ ఆ సాయంత్రం ఆయన నాతో అట్టే మాట్లాడ లేదు. కాట్యాతోనూ, సోన్యాతోనూ ఏవోకబుర్లు చెబుతూనే ఉన్నారు. ఆయన అనే ప్రతిమాటలోనూ, కదలికలోనూ, చూపులోనూ ప్రేమ స్పష్టంగా కనుపిస్తూనేఉంది. నేను కనిపెడుతూనే ఉన్నాను మరి తన కా విషయం ఏమీ పట్ట నట్లు ఉంటాడు దేనికి? ఎందు కా నటన? ఆయనమీద నాకు జాలి, కోపముకూడా వచ్చాయి. అందులోనూ పరిస్థితులన్నీ ఎంతో అనుకూలంగా ఉన్నతరుణం ఇది. ఇలాంటిసమయం పోతే మళ్ళీరాదు. ఎంతో హాయిగా ఆనందంగా ఉండవల

సిన ఈ సమయంలోకూడా మరి ఈయన ఇలా భీష్మించుకొని ఉండడం దేనికి? అనుకున్నకొద్దీ నాకు చిరాకుపుడుతోంది. కాని ఒక్క విషయం నన్ను వేధిస్తున్నది. నేను గోడదూకి తోటలోకి వెళ్ళినందుకు ఆయనకు కోపంవచ్చింది కాబోలు. నేను మంచిపిల్లను కాదనుకున్నాడు కాబోలు! అదే నా భయమూ, బాధ.

టీ తాగినతరువాత నేను పియానో వాయించడానికి వెళ్ళాను. ఆయన నా వెనకాలే వచ్చారు.

'ఏదీ, ఒక్క పాట వాయించు, వింటాను. నీ పాటవిని చాలాకాలమయింది!'- అన్నాడు.

'వాయించడానికే వెడుతున్నాను... కాని ముందు నా కోవిషయం చెప్పండి మీకు నామీద కోపం లేదుకదా.' అని అడిగాను.

'ఎందుకూ కోపం?'

'ఇవాళ మధ్యాహ్నం నేను చేసిన తప్పుపనికి. మీ మాట వినలేదుగా'- ఆయన ఇట్టే గ్రహించేశాడు. కోపమే లేనట్లు తలూపాడు.

నేను పియానోముందు కూచున్నాను.

'అవుతే మళ్ళీ మనం ఎప్పటిలాగా స్నేహితులమన్న మాట ! అవునా ?-' అని అడిగాను.

'ఓ, ముమ్మాటికీ !'- అన్నా డాయన.

మేము డ్రాయింగ్ రూంలో ఉన్నాం. పెద్దగది. అంత పెద్దగదిలో రెండు కొవ్వొత్తిదీపాలు, పియానోకు ఆ పక్క ఒకటీ, ఈపక్క ఒకటీ వెలుగుతున్నాయి. ఇహా నేరే

దీపాలు లేవు. తక్కినగదంతా మసక వెలుతురులో మునిగిఉంది. కిటికీ తెరిచిఉంది. వేసవినాటిరాత్రి. అంతా నిర్మలంగా, నిశ్శబ్దంగా ఉంది. మధ్యమధ్య కాట్యా పదధ్వని వినవస్తోంది ఆవిడ గదులలో అటూఇటూ తిరుగుతోంది కిటికీక్రింద కట్టి వేసిఉన్న మిఖాలిచ్ గుఱ్ఱం అప్పుడప్పుడు సకిలిస్తూ, కాళ్ళు కదుపుతూ ఉంది.

ఆయన నా వెనకాల కూచున్నందున నాకు కనుపించ డంలేదు. కాని మసక వెలుతురులో ఉన్న ఆ గది అంతటా ఆయన మసులుతున్న ట్లే నాకు అనిపిస్తోంది! నేను చూడకి పోయినా, ఆయన ప్రతిచూపు కదలిక – అన్నీ నా హృద యంపై ముద్ర వేస్తున్నాయి.

మొజార్ట్ వ్రాసిన పాటఒకటి నేను ఆయనదగ్గర నేర్చు కున్నాను. ఆయన కెంతో ఇష్టమైనపాట అది. ఆపాటే ఇప్పుడు వాయించడం మొదలుపెట్టాను పాట వాయిస్తు న్నంతసేపూ ఇహ నాకు వేరే ఆలోచనలేదు. ఎంతో బాగా వాయిస్తున్నాననీ, ఆయన ఎంతో సంతోషిస్తున్నాడనీ అను కుంటున్నాను. ఆయన నాకు కనుపించడంలేదు. అయినా, ఆయనకళ్ళన్నీ నామీాదే ఉన్నాయనీ, నాపాటవిని మురిసి పోతున్నాడనీ నా భావన

అలా వాయిస్తూ వాయిస్తూ అనుకోకుండా ఆయనవంక తిరిగిచూచాను. మసకమసక వెలుతురులో ఆయనతల కనుపిం చింది తలక్రింద చేతులుపెట్టుకుని రెప్పవాల్చకుండా నావంకే చూస్తున్నాడు. ఆయనకనులు మిలమిలలాడుతున్నాయి.

నేను పాటవాయించడం ఆపి, చిరునవ్వు నవ్వాను. ఆయన నావంక చూస్తూ మళ్ళీ నవ్వారు. వెంటనే నేను పాట ఆపినందుకు కోపంగా - 'ఆపుతావేం, కానీ' అన్నట్లు తలఊచారు.

అప్పటికి చంద్రుడుదయించాడు. బారెడు పైకి వచ్చాడు. వెన్నెలవెలుగు కిటికీలోనుంచి దూసుకునివచ్చి గదిలోపడుతోంది. గదంతా వెండి కరిగిపోసినట్లున్నది!

మాంచిరసపట్టులో నేను పాట ఆపినందుకు కాత్యా నచ్చి కేకలువేసింది. 'అబ్బే, ఇదేం బాగాలేదమ్మా'- అన్నది. కాని ఆయన ఒప్పుకోలేదు. నేను బాగా వాయించాననీ, అంత అద్భుతంగా ఎన్నడూ వాయించలేదనీ నన్ను సమర్థించారు. డ్రాయింగ్‌రూంలోనుంచి, చీకటిగా ఉన్న అవతలగదిలోకి - అటుఇటు పచార్లుచెయ్యడం మొదలు పెట్టారు. అదేపనిగా నావంక చూస్తూ చిరునవ్వులు ఒలక పోస్తున్నారు. ఆయన నవ్వినప్పుడల్లా నేనూ నవ్వుతున్నాను. నాకు నవ్వాగడంలేదు. అకారణంగావస్తున్న నవ్వు అది. ఎందుకో నాకు చెప్పలేనంత సంతోషంగాఉంది. ఆనాడు ఏం జరిగినా జరగవచ్చుననిపిస్తోంది!

ఆయన నాకు అగుపించకుండా అవతలగదిలోకి వెళ్ళి నప్పుడు, నాదగ్గరే పియానోప్రక్కన నిలబడిఉన్న కాత్యా చెయ్యి పుచ్చుకుని పదేపదే ముద్దాడాను. ఆయన మళ్ళీ ఇవతలికి రాగానే, ఏమీఎరగనట్లు గంభీరంగా ఉండిపోయి, వచ్చేనవ్వు బలవంతాన అపుకుంటూవచ్చాను.

'ఏమిటి బాబుగారూ! ఇవాళ మామా ఇంత చేటు నవ్వుతోంచేమిటీ.' - అని అడిగింది కాట్యా.

ఆయన జవాబు చెప్పలేదు. ఊరికే నావంక చూచి నవ్వసాగాడు. ఆవేళ నే నెందు కలా ఉన్నానో ఆయనకు తెలుసుగా మరి!

'ఈరాత్రి ఎంత చల్లగా, ఎంతహాయిగా ఉంది!' అన్నా డాయన, కిటికీలోనుంచి తోటలోకి తేరిపారచూస్తూ.

మేమూ ఆయనదగ్గరికి వెళ్ళి నిలుచున్నాం. బయటికి చూశాం. నిజంగా అది ఎంతో చక్కనిరాత్రి, ఎంతో చల్లనిరాత్రి! అలాంటిరాత్రి నా జన్మలో చూడలేదు. పున్నమనాటి పండువెన్నెల. చంద్రుడు అవతలిప్రక్కకు వాలి నందున మాకు కనుపించడంలేదు. మా ఇంటినీడ వచ్చి తోటలో పడుతోంది. చుట్టూ అంతా పిండారబోసినట్లు వెన్నెల, అక్కడక్కడ చెట్లమధ్య మడుగులుకట్టి కను పిస్తోంది. ప్రతిపస్తువూ వెన్నెలవెలుగులో తళతళ మెరిసి పోతోంది. అవతల ఇసుకబాటలో వెన్నెల కాలువకట్టింది! ఇసుక వెండిరజనులా తళతళలాడుతోంది. పచ్చికపై మంచు బిందువులు ముత్యాల్లా మెరుస్తున్నాయి. ఒకప్రక్క పూల పొదులు, చెదురు చెదురుగా పడిన నీలినీడలు, ఎక్కడ చూచినా కాంతి. చక్కదనం, చల్లదనం. వెన్నెల్లో గులక రాళ్లు మిలమిలలాడుతున్నాయి. ఎంత చల్లనిరాత్రి! ఎంత చక్కనిరాత్రి!

దూరంగా లోయలో పొగమంచు పొరలు పొరలుగా లేస్తున్నది. పూలపొదలు, పండ్లచెట్లు వెన్నెల్లో స్నానంచేస్తు

న్నాయి! ప్రతిచోటూ ఒక కాంతినిలయంగా. ఒక కాంతి వలయంగా వెలుగొందుతోంది. కొంతనీడ, కొంతవెలుగు కష్టసుఖాలు కలబోసినట్లు! తోటలు, బాటలు, ఇళ్ళు, - అన్నీ అద్భుతంగా అగుపిస్తున్నాయి.

ఇటు కుడిప్రక్క, మా ఇంటినీడలో అంతా మసక చీకటి. ఆ చీకట్లో ఒక పెద్ద బూరుగువృక్షం. దానికొమ్మలు వెన్నెల్లో తడిసిపోతున్నాయి. నిశ్చలంగా, నిర్మలంగాఉన్న నీలాలనింగిని తాకుతూ తళతళలాడుతున్నాయి.

'అలా కాసేపు బయటికివెళ్ళి తిరిగివద్దాం'- అన్నాను నేను.

కాట్యా సరేనన్నది. ఎత్తుబూట్లు తొడుక్కొని మగీ వెళ్ళమన్నది.

'అక్కర్లేదు కాట్యా. నే నాయనచెయ్యిపుచ్చుకుని నడుస్తాను' అన్నాను. ఏమిటో పిచ్చి! ఆయనచెయ్యి పుచ్చుకుంటేమాత్రం నా కాళ్ళు మంచులో తడిసిపోవా ఏమిటి?

అయినా అప్పుడు నేనన్నమాటలోని అంతరార్థం నాకేకాక వారిరువురికీకూడా అవగతమయింది. అంచేత ఎవరికీ విపరీతంగా కనుపించలేదు ఆయనచెయ్యి పుచ్చుకుని ఇంతకుముందెన్నడూ నేను నడవలేదు. అయినా ఇప్పుడు ఆయనచెయ్యి పుచ్చుకున్నాను. అందుకు ఆయనా అభ్యంతరం చెప్పలేదు. మేం బయులుదేరి బయటకివెళ్ళాం. నిత్యం చూచే ఈ నీలాలనింగి, ఈ అందాలతోట.-ఈయావత్ ప్రపంచమూ-అన్నీ నాకుఅప్పుడు అదోలా-కొత్తగాకనుపించాయి!

మే మొక చిన్న సందులోనుంచి వెళుతున్నాం. కాని నాకు కాలుసాగడంలేదు ఏక్షణానోౖ ఆగిపోదామనిపిస్తు న్నది. చుట్టూ కనుపించే ఈ సుందర ప్రకృతి ఎప్పటికీ ఇలాగే ఉండిపోతే బావుంటుందనిపిస్తున్నది.

అయినా మేము నడుస్తూనేఉన్నాం. నా కేదో అంతా మాయగాఉంది, మంత్రంలాఉంది! ముందున్న అందాల తెరలు ఒకొ్కక్కటే తొలగిపోతూ మాకు ప్రోత్సనిస్తు న్నాయి. చెట్లు, చేమలు, తోటలు, బాటలు - అన్నీ దాటి పోతున్నాం మబ్బులు కట్టిన వెలుగునీడల వలయాలను చీల్చు కుని వెళుతున్నాం. మా అడుగుల క్రింద, రాలిన ఎండు టాకులు గలగల చప్పుడవుతున్నాయి. చల్లని-మెల్లని గాలి వచ్చి నాముఖానికి తాకుతోంది. ఆయన మెల్లగా నా రెక్క పుచ్చుకుని నడిపించుకుపోతున్నాడు. మా వెనకాలే కాట్యా రివ్వురివ్వున వస్తోంది. మబ్బుల్లో చందమామ మనోహరంగా ప్రకాశిస్తున్నాడు. చెట్లకొమ్మల సందులలోనుంచి మావంక తొంగిచూస్తున్నాడు. కాని నా కేమీ తెలియడం లేదు. ఇదంతా కలా, నిజమా!

అడుగడుగునా మాముందు వాస్తవంఅనే తెర విడిపో తోంది. మా వెనకాల మాయఅనే పొర మూసుకుపోతోంది.

'అయ్యో, కప్పరా, కప్ప!'-అని కేకపెట్టింది కాట్యా.

'ఎవరా కేకపెట్టింది? ఎందుకు?' అనుకున్నాను. మళ్ళీ కాట్యా లెమ్మని సమాధానం చెప్పుకున్నాను. కాట్యాకు కప్పలంటే చచ్చే భయం. ప్రక్కకుతిరిగి చూచాను. ఒక

కప్పపిల్ల ఎగిరివచ్చి నాముందు దూకింది. వెన్నెల్లో దాని నీడకూడా అగుపించింది!

'కప్పలంటే నీకు భయంలేదా?'- అని అడిగాడాయన.

నేను ఆయనవంక ఓరగా చూచాను. నిమ్మతోటలో బయలుగాఉన్నచోట మేము ఆగాం. ఆ వెన్నెల్లో ఆయన ముఖం వెలిగిపోతోంది. ఆయనముఖం ఎంత అందంగాఉంది! ఎంత ఆనందంగాఉంది!

'నీకు భయంలేదా!'- అని ఆయన అన్నమాటలో ఎంతో అంతరార్థం ఉంది.

'ఓ, చిన్నారిచిలుకా ! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. ప్రేమిస్తున్నాను!' అన్నట్లుగా ఉంది నాకు, ఆయనచూపు. నా రెక్కపుచ్చుకున్న ఆయనచెయ్యి. నాచుట్టూ ఉన్న వెన్నెలవెలుగులు, నీడలు, గాలి - ఈ సుందరప్రకృతి — అన్నీకూడా మళ్ళీ అదేమాట పలుకుతూ, ప్రతిధ్వనించి నట్లున్నది.

మేము తోటంతా చుట్టబెట్టి వచ్చాం. కాట్యాకూడా మాతోనే వచ్చింది. ఈతిరుగుడుతో ఆమెకుఅలుపువచ్చింది. 'చాలా ప్రొద్దుపోయింది, ఇహ ఇంటికి వెళదాం' అన్నది

పాపం, ఆ వృద్ధురాలిని చూస్తే నాకు జాలిపుట్టింది.

'ఎంతసేపు తిరిగినా తిరిగినట్లులేదు మాకు. మాలాగా ఆవిడకు సంతోషంలేదేమిటి? ఈ చల్లని, చక్కని రాత్రివేళ, ఆయన - నేనూ ఉన్నట్లు అంతా పడుచుదనంలో - సంతోషంలో ఎందుకు తేలిపోకూడదు?'— అనుకున్నాను. ఆశ్చర్యపోయాను.

మేం ఇల్లుచేరేసరికి తొలికోడికూసింది. ఇంటిలో పని వాళ్ళంతా గాఢనిద్రలో మునిగిఉన్నారు. కిటికీక్రింద కట్టేసి ఉన్న ఆయనగుర్రం అదేపనిగా సకిలిస్తూ - కాళ్ళతో నేలను తన్నుతూ చప్పుడుచేస్తోంది. మే మిద్దరం మళ్ళీ చావడిలో కూచుని కబుర్లుచెప్పుకోసాగాం. ఎన్నెన్నో కబుర్లు- అప్పటికి తెల్లవారుజామున మూడుగంటలయిందన్న జ్ఞానంకూడా మాకులేదు! కాట్యాకూడా మమ్మల్ని వారించలేదు.

మలికోడికూడా కూసి తెల్లవారవచ్చేసమయాన ఆయన వెళ్ళిపోయాడు. వెళ్ళేటప్పుడు మామూలుగానే చెప్పి వెళ్ళాడు. అంతేకాని నాకుమాత్రం అలాలేదు. ఆ క్షణం నుంచీ ఆయన నావాడు-నా స్వామి, అని నిర్ధరించుకున్నాను. ఆయన్ను పోగొట్టుకో కూడదనుకున్నాను. ఆయన్ను ప్రేమిస్తున్నట్లు నా అంతరంగం చెపుతూనేఉంది. వెంటనే ఈ కథంతా కాట్యాతో చెప్పాను ఆవిడ ఎంతో సంతోషించింది. నే నిలా దాచకుండా చెప్పినందుకు ఆమెపొందిన సంతోషం ఇంతా - అంతా కాదు. కాని పాపం, ఆ వృద్ధురాలు ఆ తెల్లవారగట్లదాకా ఏం మేలుకొనిఉంటుంది? ఉండలేక నే చెప్పింది విని, అలాగే నిద్రపోయింది. నాకు మాత్రం నిద్రరాలేదు. వరండాలో కాసేపు ఒంటిగా అటు-ఇటు తిరిగాను. మళ్ళీ తోటలోనికి వెళ్ళాను. ఇందాకటిదాకా ఆయనా నేనూ ఏమేమి చెప్పుకున్నామో అన్నీ జ్ఞాపకంతెచ్చుకోసాగాను. ఆయనా - నేనూ కలిసి ఎక్కడెక్కడ తిరిగామో ఆ ప్రదేశాలన్నీ మళ్ళీ తిరగడంమొదలుపెట్టాను.

ఆ రాత్రంతా నేను కన్నుమూస్తే ఒట్టు! తెల్లవార్లూ అలా జాగారం చెయ్యడం నా జీవితంలో అదే మొదటిసారి. భళ్ళున తెల్లవారింది. సూర్యోదయంఅయింది. అంత చక్కని రాత్రిని, అంత చక్కని సూర్యోదయాన్ని నా జన్మలో చూడలేదు!

కాని ఒక్కటి - 'ఎందు కాయన నోటితో చెప్పడు, నిన్ను ప్రేమిస్తున్నానని? ఏమిటి కారణం? ఇంత అందంగా, ఇంత హాయిగా ఉంటున్నప్పుడు ఆయన ఎందు కలా తాను ముసలివాణ్ణనీ, ఇంకా ఏవేవో కష్టాలు ఊహించుకోవడం? ఎందు కిలా కాలం వృథాచెయ్యడం? ఈసమయంపోతే మళ్ళీ రాదే! ఈ వయస్సు పోతే మళ్ళీ రాదే! 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను' అని నోరారా ఒక్కమాటు ఎందుకు అనకూడదు? నాచెయ్యిపుచ్చుకొని ఒక్కతడవ ఎందుకుముద్దాడకూడదూ? ఏమిటో అర్థంకాదు. పోనీ, చెప్పడానికి సిగ్గుపడుతూ తల వాల్చుకుని నాముందు నిలబడితే చాలునే - అప్పు డంతా నేనే చెప్పేసేదాన్నే! లేదా, ఆయనవక్షస్థలంపై వాలిపోయి నా కౌగిట్లో బంధించుకునేదాన్నే. ఆనందభాష్పాలు రాల్చే దాన్నే ... ... లేక నేనే పొరపడుతున్నానా! ఆయన నన్ను ప్రేమించడమే లేదా!'

హఠాత్తుగా ఈ ఆలోచన నా మనస్సుకు తట్టింది. వెంటనే నామనస్సు వికలశకలాలయిపోయింది. ఇహ ఆ భగవంతుడు నన్నేంచేస్తాడో అనిపించింది. నేను తోటలోకి దూకినప్పుడు, నా కలవరం, ఆయన కంగారు — ఇప్పుడు జ్ఞాపకంవచ్చాయి. నా గుండె బరువెక్కింది.

కనులవెంట బొటబొటా నీరు కారింది. భగవంతుని ధ్యానించు కుందామనుకున్నాను. అంతలోనే ఒక విచిత్రమైన ఆలోచన వచ్చి నా మనోవేదనను చల్లార్చింది. నాలో మళ్ళీ ఆశ చిగిర్చింది. ఆరోజు లగాయతూ ఉపవాసం చెయ్యాలను కున్నాను త్వరలో నాపుట్టినరోజుపండుగ రానున్నది. అప్పటి దాకా ఉపవాసాలుచేసి, ఆనాడు దైవప్రార్థనలో పాల్గొని దైవప్రసాదం స్వీకరించాలనుకున్నాను. ఆనాడే ఆయనతో నా వివాహం స్థిరపరుచుకుని ప్రధానంజరిపించుకోవాలనీ నిశ్చయించుకున్నాను.

ఎందుకు ? ఎక్కడ ? ఈ కార్యం ఎలాజరుగుతుంది?– ఏమో ! నా కేమాత్రం తెలీదు. కాని ఆక్షణం లగాయతూ నా కొక గట్టినమ్మకం ఏర్పడింది. ఈ కార్యం తప్పక నెర వేరుతుందనిపించింది.

అప్పటికి బాగా తెల్లవారిపోయింది. జనమంతా లేచి తిరుగుతున్నారు. నేను నా గదిలోకి వెళ్ళాను.

# 4

నేను ఉపవాసవ్రతంపట్టింది ఆగస్టు రెండవవారంలో అవడంచేత, అందుకు మా ఇంట్లోవారెవరూ ఆశ్చర్య పోలేదు. (ఆగస్టు 15 మేరీ స్వర్గానికివెళ్ళినరోజు క్రైస్తవు లకు పండుగ. ఆవారంలో క్రైస్తవులు ఉపవాసాలుంటారు.)

ఆ వారంలో ఒక్కమాటుఅయినా ఆయన మా ఇం టికి రాలేదు అందుకు నేను ఆశ్చర్యపడలేదు; గాభరా

పడనూలేదు. మనస్సులో నించు కోనూలేక పైగా ఆయనలా రాకుండా ఉండడమే మంచిదనుకుంటాను. ఆయన నా పుట్టినరోజు పండుగనాడు వస్తే చాలు వస్తాడనే అనుకుంటున్నాను. అంతే!

ఆ వారంరోజులూ ఉదయాన్న చీకటితోటే లేచేదాన్ని. ఒక్కదాన్నే తోటంతా తిరిగివచ్చేదాన్ని. అలా తిరుగుతూ భగవంతుణ్ణి ప్రార్థించుకునేదాన్ని. ఆ క్రితంరోజు నేను చేసినపాపాలేమైనా ఉంటే లెక్కపోసుకునేదాన్ని. ఇహ ఆవేళఅయినా ఏతప్పూ చెయ్యకుండా పుణ్యకార్యాల్లో గడపడం ఎలాగాఅని ఆలోచించుకునేదాన్ని.

ఒక్కతప్పుకూడా చెయ్యకుండా గడపడం ఎంతో తేలిక అనిపించేది అప్పుడు నాకు. మనం ప్రయత్నంచెయ్యాలే కాని, అసాధ్యమయింది ఏదీ లేదనిపించేది. గుర్రబ్బండి కట్టడమే ఆలస్యం – కాట్యానో లేక మా పనమనిషినో వెంట తీసుకొని బండిమీద బయలుదేరి దేవాలయానికి వెళ్ళేదాన్ని. మా ఇంటికి మూడుమైళ్ళదూరంలో ఉంది చర్చి. ఆలయంలో అడుగుపెట్టగానే నాకు ప్రార్థనాగీతాలు స్ఫురణకువచ్చేవి. 'భగవంతుడంటే భయపడేవాళ్ళకు'– అన్న పాట మనస్సులో మెదిలేది. అలా ప్రార్థన మనస్సులో చేసుకుంటూనే మెట్లెక్కి వెళ్ళేదాన్ని.

నాలాగా ఉపవాసవ్రతంచేస్తూ ఆలయానికి వచ్చిన వాళ్ళు ఓ పది – పన్నెండుమంది ఉండేవాళ్ళు. వాళ్ళందరికీ నమస్కారాలుచేస్తూ వెళ్ళి, నాఅంతట నేనే దీపారాధన చేసేదాన్ని. అల్లంతదూరాన పీఠంమీద ఎత్తుగా ఏసుక్రీస్తు

విగ్రహం కనుపించేది. ఆ తట్టూ - ఈ తట్టూ రెండు దేవకన్యల విగ్రహాలు - వారిచేతుల్లో పూలమాలలు రెండు వైపులా పట్టు తెరలు. నాలో ఎన్నెన్నో ఊహాలు మొలకెత్తేవి. దివ్యదృశ్యాలు కనులముందు పొడగట్టేవి.

ప్రార్థన ముగిసినతరువాత పూజారి - 'భగవంతుడు మిమ్ము ఆశీర్వదించుగాక !'- అని పలికేవాడు. నా హృదయం ఏదో చెప్పరాని ఆనందంతో ఊగిపోయేది. 'రాత్రి మీ ఇంటికివచ్చి పూజచేయించమంటారా అమ్మా ?'- అని అడిగేవాడు అర్చకుడు 'అక్కర్లేదు బాబుగారూ! నేనే వస్తాను. లేదా మీకు తెలియపరుస్తాను '- అని చెప్పేదాన్ని నేను.

'నేనుండగా మీ కెందుకమ్మా అంత శ్రమ ?-' అనేవా డాయన మళ్ళీ. నాకు గర్వంఉన్నట్లు కనుపిస్తానేమోనని, ఏం జవాబుచెప్పాలో తెలియక ఊరుకునేదాన్ని.

ఇలా దేవాలయంలో పూజఅంతా అయిపోయినతరువాత ఇంటికి బయలుదేరేదాన్ని. కాట్యా ఉంటే సరే, లేకపోతే వట్టిబండిని ఇంటికి పంపించేదాన్ని. నేనుకాలినడకను వెళ్ళేదాన్ని. త్రోవలో కనుపించినవాళ్ళందరికీ వినయ విధేయతలతో నమస్కరించేదాన్ని. ఇతరులకు ఏమాత్రమయినా మంచిచేద్దామనీ, సలహాలిద్దామనీ తహతహలాడిపోయేదాన్ని.

ఒకనాటిసాయంకాలం మా బంట్రోతు వచ్చి సైమన్ అనే మా నౌకరుకుమార్తె చనిపోయిందనీ, శవపేటిక తయారుచేయటానికి చెక్కలకూ, కర్మాంతరాలకూ డబ్బు కావలసివచ్చి తనను అడిగాడనీ, తాను ఇచ్చాననీ కాట్యాతో

చెప్తూఉండగా నేను విన్నాను.

'పాపం! అతను అంత పేదవాడా?-' అని అడిగాను నేను.

'అవునమ్మగారూ! అతనికి తింటానికి తిండికూడా లేదు!'- అని చెప్పాడు, మా బంట్రోతు. 'గంజినీళ్ళలోకి ఉప్పుగల్లుకూడా కరువే!-' అన్నాడు.

నా గుండె నీరయిపోయింది. ఏదో ఇతరులకు సహాయం చేసేఅవకాశం చిక్కిందికదా అని సంతోషంకూడా కలిగింది. నేనేదో అలా బయటికి షికారు వెడుతున్నట్లుగా కాట్యా ఎదుట నటనచేసి, మేడమీదికి పరుగెత్తాను. నాదగ్గరున్న డబ్బంతా తీసుకొన్నాను. (నా దగ్గరున్నది బహుస్వల్పమే) దేవుణ్ణి తలుచుకుంటూ తోటలోగుండా వెళ్ళి, ఊరివెలుపల ఉన్న సైమన్‌గుడిసెదగ్గరికి చేరుకున్నాను.

అతనిగుడిసె ఊరికి చిట్టచివర ఉంది. అంచేత నన్నెవరూ చూళ్ళేదు. డబ్బు గడపమీద పెట్టి, మెల్లగా తలుపు తట్టాను. లోపలున్నించి ఎవరో వచ్చారు. తలుపు తెరిచిన చప్పుడైంది 'ఎవరది?' అని నన్ను పిలిచారు. కాని నాకు భయంపుట్టింది. ఏదో తప్పుపనిచేసినట్లు వణుకుపుట్టింది. పలకలేదు. వెనక్కితిరిగిఅయినా చూళ్ళేదు. అదేపరుగు. నచ్చినగోనపట్టి వెళ్ళిపోయాను!

ఎక్కడికి వెళ్ళావని కాట్యా అడిగింది. ఏం జరిగిందన్నది. కాని నేనేం సమాధానం చెప్పలేదు. నాగదిలోకి వెళ్ళి గడియవేసుకున్నాను. అదోలా ఉంది నా మనస్సు. ఏమీ తోచలేదు ఏపని చెయ్యటానికీ బుద్ధిపుట్టలేదు.

అలాగే చాలాసేపు గదిలో అటు-ఇటు తిరుగుతూ ఉండి పోయాను.

ఆ డబ్బుచూచి సైమన్ ఇంట్లోవాళ్ళంతా బ్రహ్మా నందభరితులవుతారని అనుకున్నాను. స్వయంగా నా చేతులతో వారి కా డబ్బు ఇచ్చిఉన్నట్లయితే ఎంతో బాగుండే దని చింతించాను ఈ విషయం మిఖాలిచ్ కి తెలిస్తే ఏమను కుంటాడో అనికూడా భయపడ్డాను. కాని నన్నెవరూ చూళ్ళేదులెమ్మనీ, ఎవరికీ తెలియదులెమ్మనీ సమాధాన పరచుకున్నాను. నాకు చెప్పలేని సంతోషం కలిగింది. లోక మంతా సుందరస్వప్నంలా గోచరించింది. చాలు కూడా సంతోషమేనన్నభావం పుట్టుకొచ్చింది. నాలో నేనే నవ్వు కున్నాను. కాసేపు కంట తడిపెట్టుకున్నాను. ఆ క్షణంలో నా మనస్సంతా ఎక్కడలేని ప్రేమతో, జాలితో నిండి పోయింది. పదేపదే భగవంతుణ్ని తలుచుకున్నాను.

బైబిల్లోని భగవత్సందేశం చదువుకున్నాను. అంత కంతకూ అది నాకు సులభంగా అర్థమవుతూవచ్చింది. నా మనస్సును ఆకర్షిస్తూ వచ్చింది. బైబిల్లోని కథలన్నీ నాకు తేలిగ్గా అంతుపట్టాయి. సిద్ధాంతాలన్నీ ఆకళింపు అయి నాయి. పవిత్రమైన దివ్యజీవనంగడపడం చాలా తేలిక అన్నభావం ఏర్పడిపోయింది. బైబిల్ చదివి అవతలపెట్టిన తరువాత నా మనస్సు మళ్ళీ, నా జీవితంపైకి మళ్ళింది. ఒక్కమాటు అంతా పరిశీలించి చూచుకున్నాను

పరిశుద్ధంగా జీవించడం ఏమంత కష్టంకాదనిపించింది ప్రతిఒక్కరినీ ప్రేమించటం, ప్రతిఒక్కరిచేతా ప్రేమించ

బడడం చాలా తేలికగా తోచింది. ప్రతివిషయం నాకెంతో మధురంగా కనుపించింది. పాఠాలుచదువుకోకుండా నన్ను నానాతిప్పలూపెట్టే సోన్యాకూడా అప్పుడు నాకెంతో మంచిపిల్లలా, ఎంతో బుద్ధిమంతురాలులా అగుపించింది

అందరిపట్లా నేనెంతమంచిగాఉంటున్నానో, అందరూ నాపట్ల అంత సద్భావంతో ప్రవర్తిస్తున్నారు. ఇంతకుముందు నేనెవరితోనన్నా విరోధంపెట్టుకున్నానేమో, వారికిక్షమాపణ చెప్పుకుందామని జ్ఞాపకంచేసుకున్నాను. మా పొరుగునేఉన్న ఒక అమ్మాయి నాకు గుర్తొచ్చింది. ఒకఏడాదిక్రితం, పదిమందిసమక్షంలో ఆ అమ్మాయిని నేను ఎగతాళిచేశాను. ఆ పిల్లమనస్సు నొచ్చుకున్నది. అప్పటినుంచీ మా ఇంటికి రావడం మానేసింది. ఇది జ్ఞాపకంవచ్చి, వెంటనే ఆమెకు ఒకఉత్తరం వ్రాశాను. నేనుచేసింది తప్పని ఒప్పుకుంటూ క్షమాపణ వేడుకున్నాను. అందుకు ఆ పిల్ల సమాధానం కూడా వ్రాసింది నన్ను క్షమించానంటూ, తన పొరపాటు ఏమైనాఉంటేకూడా మన్నించమని వ్రాసింది. ఆ చిన్నిజాబు పదేపదే చదువుకుని ఆనందంతో పొంగిపోయాను అలాగే వృద్ధురాలైన మా దాదినికూడా క్షమించమని కోరుకున్నాను. నేనలా అడిగినప్పుడు ఆమెహృదయం ద్రవించిపోయింది పాపం! కంటతడిపెట్టిందికూడా.

'నేనంటే అందరికీ ఎందుకింత దయ? నేను వారందరికీ ఏంచేశాను కనుక?' నాలోనేను ప్రశ్నించుకునేదాన్ని. అనుకోకుండా సెర్జీ మిఖాలిచ్ జ్ఞాపకానికివచ్చేవాడు. ఆయన్నుగురించి అదేపనిగా ఆలోచిస్తూ ఉండిపోయేదాన్ని. అలా

ఉండడం తప్పనికూడా నాకు అనిపించేదికాదు. అంతేకాదు, అప్పట్లో ఆయన్నుగురించి నా తలపులే వేరుగాఉండేవి. ఆయన్ను ప్రేమిస్తున్నానని అనుకొన్న నా తొలినాటి తలపులకూ, ఇప్పటి తలపులకూ ఎక్కడా పొత్తే లేదు! నన్ను గురించి ఎలా ఆలోచించుకుంటానో ఆయన్నుగురించీ అలాగే ఆలోచించుకుంటున్నాను ఇప్పుడు. ఇంకేం? నా భావిజీవితమంతా ఆయనతో ముడిపెట్టబడిఉన్నట్లు అర్థమైంది.

ఆయన ఎక్కువనీ నేను తక్కువనీ, అప్పుడనుకునేదాన్ని. ఇప్పుడా భావం పూర్తిగా తొలగిపోయింది. ఆయనా—నేనూ సమానమే. ఒకరు ఎక్కువాలేరు, ఒకరు తక్కువాలేరు—అనిపించింది. నేనొక మహోన్నత ఆధ్యాత్మిక భావనలో ఉంటూనచ్చాను. ఆయన్ను పూర్తిగా అర్థంచేసుకోగలుగుతున్నాను. పూర్వం ఆయనలో ఏదో వింతగా కనుపించినదంతా, ఇప్పుడు విస్పష్టమవుతూవచ్చింది. ఇతరులకోసం జీవించడంలో ఎంతో సుఖం, ఆనందం ఉన్నాయి - అని ఆయన అన్నమాటలు ఇప్పుడు మొదటిసారిగా నాకు పూర్తిగా అర్థమైనాయి. ఆయన చెప్పినట్లే జీవితం దిద్దుకోసాగాను. మేమిరువురం ఒక అనంతమైన దివ్యసుఖం అనుభవిస్తామని అనుకున్నాను. ఎక్కడికో—దూరదేశాలకు వెళ్ళాలనీ, రంగురంగుల శృంగారాలు చేసుకొని కులాసాలతో విలాసాలతో సంఘజీవితం గడపాలనీ, నాగరికతాప్రపంచంలో అడుగుపెట్టి పట్నవాసాల్లో గడపాలనీ—ఇలాంటి ఆలోచనలన్నీ తొలగిపోయాయి. ఈ పల్లెసీమల్లోనే ప్రశాంతంగా, నిరాడంబరంగా బ్రతకాలనిపించింది. అందరినీ ప్రేమిస్తూ,

అందరినీ దయతో చూస్తూ, ఉదారబుద్ధితోను, త్యాగబుద్ధితోను ఇతరులకు సహాయం చేస్తూ ఇక్కడే సంసారయాత్ర సాగించడం ఉచితమని తోచింది.

అనుకున్న ప్రకారం నా పుట్టినరోజు పండుగనాడు ఉపవాసవ్రతం కొనసాగించి, దేవాలయానికి వెళ్ళి, పూజలు చేశాను. ప్రసాదం పుచ్చుకున్నాను. చెప్పరాని ఆనందంతో ఉల్లాసంతో ఇంటికి వచ్చాను. ఆసమయానికి సెర్జీ మిఖాలిచ్ కూడా వచ్చాడు. పుట్టినరోజు పండుగ జరుపుకున్నందుకు నాకు అభివందనాలు తెలిపాడు. ఇరువురం డ్రాయింగ్ రూంలోకి వెళ్ళాం. ఆ ఉదయం నే నెంత ఉల్లాసంగా ఉన్నానో చెప్పలేను. ఆయనతో ఎంత సరదాగా, ఎంత చనువుగా ఉన్నానో వర్ణించలేను. ఇంతవరకు ఎన్నడూ అలా ఉండలేదు! నాలో ఏదో కొత్త ప్రపంచం పుట్టుకొచ్చింది. ఆయనకు అందని ప్రపంచం, ఆయన ఎరుగని ప్రపంచం అది! ఆయనఎదుట నా కేమాత్రం 'జెరుకు' అనిపించలేదు. మాట్లాడేటప్పుడు తడబడలేదు. ఆయనకూడా నన్నేదో అర్థంచేసుకున్నట్లుంది. నన్నెంతో ప్రేమగా పలకరించాడు, గౌరవించాడు. నేను పియానో వాయించడానికి వెళ్ళాను. కాని ఆయన అడ్డువచ్చాడు. పియానో మూసివేసి, తాళం చెవి తన జేబులో వేసుకున్నాడు.

'నీ విప్పుడు ఎలా ఉల్లాసంగా ఉన్నావో అలాగే ఉండు, దాన్ని చెదరగొట్టకు. నీ ఆత్మ ఇప్పుడు ఒకానొక దివ్య సాగర సంగీతంలో మునిగి తేలుతోంది! - ఇహ ఈ ముష్టి పియానోలూ, పాటలూ ఎందుకు?'- అన్నా డాయన.

ఆయన ఇలా అన్నందుకు ఎంతో కృతజ్ఞురాలిని. కాని అదేసమయంలో నాకు ఆశాభంగం కలిగింది. ఎవరికీ తెలియకుండా, ఎంతో రహస్యంగా ఉంచుకోవాలనుకున్న నా మనస్సులో విషయాలు ఆయన కిలా మలాగ్గా తెలియడం నా కిష్టంలేకపోయింది.

భోజనాలుచేసేటప్పుడు ఆయన నాతో అన్నాడు. నాకు అభినందనాలు తెలపడానికి వచ్చానన్నాడు. అంతే కాదు, ఆ మరునాడే తాను మాస్కో వెడుతున్నాననీ, నాతో చెప్పి సెలవుపుచ్చుకోడానికి వచ్చాననికూడా అన్నాడు. ఇలా అంటూ కాట్యావంక చూచాడు తరువాత నావంక ఓరగాచూచాడు. నే నేమనుకుంటున్నానో, నా ముఖకవళికలు ఎలాఉన్నాయో కనిపెట్టాలనుకున్నాడు.

నేను తొణకలేదు - బెణకలేదు. మళ్ళీ ఎప్పుడొస్తారని కూడా అడగలేదు. ఆయ నిలా చెపుతాడనీ, చెపుతాడే కాని, ఎక్కడికీ వెళ్ళడనీ నాకు ముందే తెలుసు! కాని ఎలా తెలిసింది? ఏమో! ఆవిషయం అప్పటికీ - ఇప్పటికీ చెప్ప లేను. అయినా ఆరోజుమాత్రం - నా కేదో దివ్యదృష్టి ఉంది. జరిగినవీ, జరగనున్నవీ - అన్నీ తెలుసు. కాలజ్ఞానురాలులా ఉన్నాను. ఏదో స్వప్నంలోచూచినట్లు సమస్త విషయాలూ చూడగలిగాను!

భోజనాలయినవెంటనే ఆయన వెళ్ళిపోవాలను కున్నాడు. కాని అప్పటిదాకా వళ్ళువిరుచుకొని పనిచేసిన కాట్యా బడలికవల్ల వెళ్ళి నడుంవాల్చింది మరి ఆయన ఆమెతో చెప్పివెళ్ళాలి. అందుకనిఆయనఉండకతప్పిందికాదు.

హాల్లో ఎండపొడ వచ్చిపడుతోంది. మేము వసారా లోకి వెళ్ళి కూర్చున్నాం. ముందు నేనే ముచ్చట్లు ప్రారంభించాను. నా భవిష్యత్తు ఏమిటో ఆ క్షణంలోనే తేల్చుకుందా మని నిశ్చయించుకున్నాను. ఏమాత్రం తొణకకుండా, దృఢ నిశ్చయంతోనూ, ప్రశాంతంగాను మాట్లాడసాగాను. అప్పుడు అంతటినిగ్రహం నా కెలా వచ్చిందో తెలీదు ఏదైనా శక్తివచ్చి నన్ను ఆవహించిందేమో మరి! నా మనస్సులో ఉన్నది ఉన్నట్లు స్పష్టంగా చెప్పాను. తూచినట్లు మాట్లాడాను. నిజంగా ఏదో శక్తి నన్నలా పలికించింది. ఆయన నాకు ఎదురుగ్గా కూచున్నాడు. వెనకాల చేతులుపెట్టుకుని స్తంభానికి ఆనుకున్నాడు. పక్కనేఉన్న పూలతీగె పట్టుకొని ఆకులు త్రుంచివేస్తూ కూచున్నాడు. నేను మాట్లాడడం మొదలుపెట్టగానే తీగెవదిలేసి తలక్రింద చెయ్యిపెట్టుకున్నాడు. ఆయనవైఖరి చూస్తే ప్రశాంతంగావింటున్నట్లు కనుపించింది.

'మీా రెందుకు ఊరికి వెడుతున్నారు?'—ఉన్నమాట ముఖాన్నే అనేసినట్లుగా ఆయనముఖంలోకి సూటిగా చూస్తూ అడిగాను.

ఆయన వెంటనే సమాధాదం చెప్పలేదు.

'వ్యాపారసంబధమైన పనుంది!'—అన్నాడాయన ఆఖరుకు, కళ్ళు దించుకుని. నే నెంతో నిష్కల్మషంగా అడిగిన ప్రశ్నకు ఆయన అబద్ధపుసమాధానం చెప్పాడు. ఆడలేక ఆడిన అబద్ధ మది! నాకు కనుపిస్తూనేఉంది.

'ఒక్కమాట చెతాను, వినండి - ఈరోజు నా కెంత ముఖ్యమైందో మీకు తెలుసు. నేను మిమ్మల్ని ఇలా అడు

గుతున్నానూ అంటే ఊరికే అడగడం లేదు (నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. ఆ విషయం మీకూ తెలుసు.) మీరు ఊరికి ఎందుకు వెళుతున్నట్లో తెలుసుకోవాలనే అడుగుతు న్నాను.' అన్నాను.

'నిజం చెపుతున్నాను - ఎందుకు వెళుతున్నానో చెప్పడం నాకు సాధ్యం కావడం లేదు క్రిందటివారమంతా నిన్ను గురించీ, నన్ను గురించీ ఎంతో ఆలోచించాను. చివ రకు నే నిక్కడనుంచి వెళ్ళిపోవడమే మంచిదన్న నిర్ణయానికి వచ్చాను ఎందుకో నీవు అర్థంచేసుకోగలననుకుంటాను - నీకు నామీద ప్రేమఉన్నట్లయితే, ఇహ ఈవిషయం నన్ను అడగవద్దు' - అన్నా డాయన. ఇలా అని నుదుటిమీది చెమట తుడుచుకున్నాడు. కళ్ళుమూసుకున్నాడు. 'ఇది నాకు చాలా కష్టంగాఉంది!... కాని నీవు అర్థంచేసుకోగలవను కుంటాను'- అన్నాడు మళ్ళీ.

నా హృదయం తీవ్రంగా కొట్టుకోసాగింది. 'నా కేమీ అర్థంకాలేదు. నేను అసలు అర్థంచేసుకోలేను. అదే మిటో మీరే చెప్పాలి ఈరోజే - ఇప్పుడే - అదేమిటో నాకు చెప్పండి, మీకు పుణ్యంఉంటుంది. మీరు చెప్పిం దంతా ప్రశాంతంగా వింటాను, చెప్పండి!'- అన్నాను.

ఆయన సర్దుకుని కూచున్నాడు. ఒకమారు నావంక పరీక్షగా చూచాడు. మల్లీ పూలతీగె చేత్తోపట్టుకున్నాడు

'సరే, చెపుతాను'—అంటూ ప్రారంభించాడు. మాట తడబడకుండా ఉండాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు- 'ఇది చెప్పడానికి సాధ్యమయ్యేవిషయం కాదు—చెప్పడం

శుద్ధ తెలివితక్కువకూడా. అయినా నీకు చెప్పడానికి ప్రయత్నిస్తాను.'—అంటూ చెప్పసాగాడు ఏదో బాధపడుతున్నట్లుగా కనుబొమలు ముడిపెట్టుకొన్నాడు.

'సరే, చెప్పండి'—అన్నాను నేను.

'ఒకఊళ్ళో ఒకతను ఉన్నాడనుకో—అతని పేరు—ఫలానా అనుకో!—అతను వృద్ధుడు; జీవితంపై విసుగెత్తినవాడు. అలాగే ఆఊళ్ళో ఒకఅమ్మాయి ఉంది. ఆ అమ్మాయిపేరు—ఫలానా అనుకో. ఆ పిల్ల యౌవనంలోఉంది. ఉల్లాసంగా ఉంది. అంతవరకూ ఆ అమ్మాయి బయటిప్రపంచం ఎరుగదు. జీవితమంటే ఏమిటో ఇంకా చూడలేదు. అనేకమయిన కుటుంబసంబంధ బాంధవ్యాలవల్ల ఆ పిల్లను అతను కుమార్తెలాగా ప్రేమిస్తూవచ్చాడు. ఆ ప్రేమ మరోవిధంగా మారుతుందని అతను ఎన్నడూ అనుకోలేదు.'—

ఇలా చెప్పి ఆగాడు. కాని నే నేమీ మధ్యలో అడ్డు ప్రశ్న వేయలేదు.

'కాని ఆ అమ్మాయి ఇంకా పసితనంలోనేఉన్నదన్న విషయం, జీవితమంటే ఇంకా ఒక ఆటవస్తువుగా చూస్తున్నదన్నవిషయం, ఆ పిల్లపై తనకుగలప్రేమ ఇట్టే మరో రకంగా మారుతుందన్నవిషయం- అది ఆ అమ్మాయికి ఒక వినోదక్రీడలా ఉంటుందన్నవిషయం, అతను పూర్తిగా మరిచిపోయాడు'- ఆయన నావంక చూడకుండా ఇలా చెప్పసాగాడు. అకస్మాత్తుగా ఆయనధోరణి మారింది. దృఢనిశ్చయంతో గబగబా చెప్పుకపోతున్నాడు. 'అతను చేసినతప్పు అదే! ఆ తప్పు తెలియగానే అతనికి తెలివివచ్చింది. ఆ

పిల్లతో తనకుగల పూర్వపుస్నేహం ఎక్కడ చెడిపోతుందో నని భయకంపితుడైనాడు. అది చెడిపోకముందే అక్కడి నుంచి వెళ్ళిపోవడం మంచిదని నిశ్చయించుకున్నాడు.'

ఇలా చెప్పి ఆయన, చేత్తో కళ్ళునులుముకున్నాడు తరువాత కళ్ళు గట్టిగామూసుకున్నాడు. ఆపిల్లను మరోరకంగా ప్రేమించడానికి ఆయనకెందుకంత భయం?'- అని నేను గట్టిగాఅడిగాను. నాలో చెలరేగుతున్న తుఫాను అణచుకున్నాను. తొణకకుండానే అడిగాను. కాని నేనేదో తమాషాగా అడుగుతున్నాననే ఆయన అనుకున్నట్లున్నాడు మనస్సు నొచ్చుకున్నట్లుగా సమాధానంచెప్పాడు.

'నీవు చిన్నపిల్లవు. నేనా పెద్దవాణ్ణి. నీకు ఆటంటే సరదా. మరి నాకు అలాకాదు. నాకు కావలసింది వేరే— నీకు సరదాపుట్టించే ఆటలు నాతోఆడితే లాభంలేదు తమాషాలు నాకు పనికిరావు నేను కచ్చితమైనమనిషిని. ఈ విషయం నీవు ముందే తెలుసుకొంటే మంచిది. తరువాత విచారించవలసివస్తుంది'— అని అతను ఆ అమ్మాయితో అన్నాట్ట... ...సరే, ఇహ ఈ అర్థంలేనిమాటలకేంగాని,— నే నెందుకు వెళ్ళిపోతున్నానో ఇప్పుడైనా నీ కర్థంఅయిందను కుంటాను. దయచేసి ఇంక ఈ విషయాన్ని గురించి మనం మాట్లాడవద్దు, సరేనా?'—అన్నాడు.

''ఊహుఁ, అట్లా వీల్లేదు. ఈవిషయం ఇంకా మనం మాట్లాడాల్సిఉంది! ఇంతకూ ఆయన ఆ అమ్మాయిని ప్రేమించాడా లేదా? చెప్పండి?''- అని అడిగాను. నా కంఠం రుద్ధమైంది కళ్ళవెంట నీళ్ళువచ్చాయి.

కాని ఆయన జవాబుచెప్పలేదు 'మరి ఆయన ఆ అమ్మాయిని ప్రేమించనట్లయితే - ఎందు కలా నటించాడు! ఒక పసిపిల్లతో ఆడుకున్నట్టుగా ఆ పిల్లతో ఎందు కలా ఆట లాడాడు!'- అని మళ్ళీ అడిగాను.

'అవునవును. అతను చేసింది తప్పే' అని ఆయన గభాలున సమాధానం చెప్పాడు- 'కాని అయిందేదో అయి పోయింది ఆఖరుకు అతనూ - ఆమే స్నేహితులుగానే విడి పోయారు! సరేనా?'- అన్నాడు.

మీరు చెప్పింది చాలా దారుణంగాఉంది! ఈకథకు ఇహ వేరేవిధమైన ముగింపు లేదా?'- అని అడిగాను నేను. కాని ఇలా అన్నానో లేదో - వెంటనే నాకు ఎక్కడలేని భయమూ, కంపరమూ పుట్టుకొచ్చాయి.

'అవును - వేరేరకమైన ముగింపు ఉంది' అన్నాడాయన, నావంక సూటిగా చూస్తూ. ఆయనముఖంలో ఎక్కడలేని ఆందోళన దృగ్గోచరమైంది - 'ఈ కథ ముగించడానికి వేరేరకమైన మార్గాలు రెండుఉన్నాయి. చెపుతాను విను. కాని మధ్యలో అడ్డుప్రశ్న వేయకుండా విను - నీకు పుణ్యముంటుంది '- అంటూ ఆయన లేచి నిలుచున్నాడు. నావంక చూచి బాధాకరంగానూ, విచారపూరితంగానూ చిరునవ్వునవ్వాడు. 'అతను ఆ అమ్మాయిని పిచ్చిగా ప్రేమించి, ఆవిషయం ఆమెతో చెప్పేడట!... కాని ఆ పిల్ల నవ్వి ఊరుకున్నదట! ఇది ఆమెకు కేవలం ఒక వినోదంగా ఉన్నకారణాన అలా చేసిందట. కాని అతనికిమాత్రం ఇదొక జీవన్మరణసమస్యగా ఉందట!' అని కొందరంటారు.' అన్నాడు.

నాకు కంఠం గంకలిగింది. ఆయనకు అడ్డుచెప్పడానికి ప్రయత్నించాను. నా విషయంలో ఇలా మాట్లాడడానికి ఆయనకు హక్కు లేదని అందామనుకున్నాను. కాని ఆయన నన్ను మాట్లాడనివ్వలేదు. నా చేతికి తన చెయ్యి అడ్డం పెట్టి మళ్ళీ ఇలా చెప్పడం మొదలుపెట్టాడు—

'ఉండు, నన్ను చెప్పనీ—మరికొందరు ఇంకో మార్గం చెప్తారు—ఆ అమ్మాయికి అతనిమీద జాలివేసిందట! అయ్యో, పాపం! అనిపించిందట—అనిపించి ప్రపంచమంటే ఏమిటో ఎరుగని ఆ పిల్ల, తాను నిజంగా అతన్ని ప్రేమించ గలనని అనుకొని అతన్ని పెండ్లాడడానికి ఒప్పుకున్నదట! అతను వెర్రివ్యామోహంలోపడిపోయి అది నిజమని నమ్మాట్ట! తనకు కొత్తజీవితం మొదలవుతుందని మురిసిపోయాట్ట! కాని కొన్నాళ్ళకు ఆ అమ్మాయి అతను తన్ను మోసగించి నట్లూ, తను అతన్ని మోసగించినట్లూ తెలుసుకున్నదట! అదీ విషయం. ఇంతటితో కథ అయిపోయింది... ...సరే. ఇహ ఈవిషయం ఇంతటితో ముగిద్దాం.'—ఇలా చెప్పడం పూర్తిచేసి మాట్లాడకుండా నాముందు అటూఇటూ పచారు చెయ్యడం మొదలుపెట్టాడు.

ఈవిషయం ఇంతటితో ఆపివేద్దామని ఆయన ఏదో అన్నాడు కాని ,ఆయనమనస్సులో తుఫాను రేగుతోంది. నే నేం సమాధానంచెప్తానో అని ఆతృతతో ఎదురుచూస్తు న్నాడు. నేనూ ఏదో చెప్పాలనుకున్నాను. కాని చెప్పలేక పోయాను. ఏదో అడ్డువచ్చి నాకు ఊపిరాడకుండా చేసినట్లని పించింది. ఆయనవంక చూచాను. ఆయనముఖంలో కళ-

కాంతుల్లేవు. క్రిందిపెదవి కంపిస్తోంది. ఆయనమీద ఎక్కడ లేని జాలి పుట్టుకొచ్చింది నాకు. నా శక్తినంతా కూడగట్టుకున్నాను. నాభిస్థానందగ్గరనుంచి మాటపెగుల్చుకుని, సన్నని గద్గదస్వరంతో, క్షణక్షణం భయపడుతూ ఇలా అన్నాను.

'మీరు చెప్పిన కథకు మూడోరకమైన ముగింపు కూడా ఉంది.'- ఇలా అని ఒకక్షణం ఆగాను. కాని ఆయన మారుపలక లేదు - 'ఆ మూడోరకమైన ముగింపు ఏమిటో చెపుతాను వినండి- అసలు అతను ఆ అమ్మాయిని ప్రేమించనే లేదట! ప్రేమించినట్లు నటించి ఆమెకు తీరని, ఆరని బాధ కలిగించాట్ట! పైగా తాను చేసింది 'రైటే'నని అనుకుని ఆమెని వదిలిపెట్టి వెళ్ళాట్ట! వెళ్ళి తానొక ఘనకార్యం చేసినట్టు గర్వంగా తలఎత్తుకు తిరగడం మొదలుపెట్టాట్ట! అదీ కథ...ఎందుకండీ ఈ మాటలు? నటన, తమాషా నాది కాదు - అంతా మీదే - మిమ్మల్ని కలుసుకున్న నాటినుంచీ నేను మిమల్నే ప్రేమిస్తున్నాను. అవును, ప్రేమిస్తున్నాను '- అన్నాను.

ప్రేమిస్తున్నాను అనేమాట గట్టిగా, స్పష్టంగా రాయి గుద్దినట్లు అన్నాను. నే నన్నమాట చెవినపడి నాకే భయం పుట్టింది.

ఆయన నిలువునా నిర్ఘాంతపోయి నాముందు నిలుచున్నాడు. ఆయనపెదవులు మరింత కంపించడం మొదలు పెట్టాయి. రెండుకనులనుండీ రెండు కన్నీటిచుక్కలు వెలువడి చెక్కిళ్ళపైకి జారాయి.

'ఏమిటది? ఎందుకు కంటతడిపెడతారు ? చెప్పు!' - అని బిగ్గరగా అరిచాను. ఆ అరుపులో కోపం; ఆ కోపంలో నాకూ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఊపిరాడలేదు. చివాలున అక్కడనుంచి లేచాను.

కాని ఆయన నన్ను వెళ్ళనివ్వలేదు. ఆయన నా మోకాళ్ళపైకి తలవాల్చి వణికిపోతున్న నా రెండుచేతులూ పట్టుకొని ముద్దుపెట్టుకున్నాడు. ఆయన కన్నీటిధారలతో నా చేతులు తడిసిపోయాయి.

'భగవంతుడా! ఈవిషయం ముందే తెలిస్తే ఎంత బావుండేది !'- అన్నాడాయన.

'దేనికీ, దేనికీ?'- అని నేను పదేపదే రెట్టించాను. నా హృదయంమాత్రం ఎక్కడలేని సంతోషంతో నిండి పోయింది ఎప్పటికీ తరుగని సంతోషం అది!

ఆతరువాత ఓ అయిదునిముషాలకు మా చెల్లెలు సోన్యా మేడమీదికి పరుగెత్తింది. అక్కయ్య మిఖాలిచ్‌ని పెండ్లిచేసుకోబోతున్నది- అని అది కాట్యాతో చెపుతూ ఇల్లంతా ఎగిరిపోయేటట్లు అరవడం నాకు వినిపించింది.

# 5

మా పెండ్లి వాయిదా వెయ్యవలసిన అగత్యం ఏమీ కనుపించలేదు. ఆయనకుగానీ, నాకుగానీ, అలా జరగాలని కూడా లేదు. మాస్కో వెళ్ళి కొత్త బట్టలుకొనుక్కురావాలని కాట్యా ఆదుర్దాపడుతోంది. ఆయనతల్లిగారుకూడా అదే

ఘోరఃశిలో ఉంది. పెండ్లికిముందుగానే కొత్త బండీ ఒకటీ, ఫర్నిచరూ, ఇంకా ఇంట్లోకికావలసిన రకరకాల సామానులు, అలంకారాలూ కొనితీరాలని పట్టుపట్టింది. ఆ విషయం కొడుకుతో చెప్పింది. కాని అటు ఆయనకు ఇటు నాకూ ఇదంతా ఏమిఇష్టంలేదు. అంతగా ఈ ఖర్చులన్నీ అవసరమనితోస్తే ఆతరువాత పెట్టుకోవచ్చునన్నతలంపుతో ఉన్నాం. కొత్త బట్టలుకొనడం, చుట్టపక్కాలకు శుభలేఖలు పంపించడం, బాజాభజంత్రీలు, విందుభోజనాలు—ఇలాంటి సంప్రదాయాలేవీ లేకుండా, నా పుట్టినరోజుపండుగ వెళ్ళిన పక్షంరోజుల లోగానే మాపెళ్ళి జరగాలని మే మిరువురం పంతంపట్టాం. ఆ పంతం నెగ్గించుకున్నాంకూడా.

వాళ్ళమ్మగారు చాలా బాధపడిందని ఆయన నాతో చెప్పాడు చుట్టపక్కాలను ఎవరినీ పిలవకుండానూ, మేళ-తాళాలు లేకుండానూ, - ఏ ముద్దు - ముచ్చటా లేకుండా ఇలా పెండ్లి జేసుకోవాలనుకున్నందుకు వాళ్ళమ్మగారు ఎంతగానో నొచ్చుకున్నదట. 'మా పెళ్ళినాడు ఇలా ఉన్నామా, ఇదేంబూటకం?- నాపెళ్ళికి ముప్పయివేలు ఖర్చయి మహా వైభవంగా జరిగింది' - అన్నదట!- అప్పటికీ ఆమె ఊరుకోలేదనీ, ట్రంకుపెట్టెలు, కొత్తబట్టలు, తివాచీలు సామాన్లు ఇంకా ఏవేవో - కొని మా కొత్తసంసారానికి హంగులెన్నో చేస్తున్నదనీ ఆయన చెప్పాడు.

ఇహ మా ఇంట్లోపరిస్థితికూడా అలాగేఉంది. మా ముసలిదాది సహాయంతో కాట్యా మాకు కావలసిన ఏర్పాట్లన్నీ చేస్తున్నది. ఆవిడకు తీరుబడేలేదు. ఈ విషయంలో

ఆమెను ఏమన్నా ప్రయోజనంలేదు. వెనకటికాలపు మను
షులతీరే అంత! ఆయనా - నేనూ, మా భావిజీవితాన్ని
గురించి ముచ్చట్లాడుకుంటూఉండడం ఆవిడ చూస్తూనే
ఉంది మేమేదో అర్థంలేనిపిచ్చిమాటలుమాట్లాడుకుంటున్నా
మనీ, కాబోయేదంపతులు ఉండవలసినతీరు వేరు అనీ ఆమె
ఉద్దేశం. కుర్చీలూ, బల్లలూ, మంచిమంచి బట్టలు, పట్టుతి
వాచీలు - ఇవే సంసారసుఖానికి ఆధారభూతాలని ఆవిడ
అభిప్రాయం.

మా పెండ్లికి సంబంధించిన వార్తలు మా ఇంటినుంచి వాళ్ళింటికీ, వాళ్ళింటినుంచి మా ఇంటికీ తెంపులేకుండా రహస్యంగా చేరవేసేవారు చేరవేస్తూనేఉన్నారు. వారి ఏర్పాట్లకు వీరూ, వీరిఏర్పాట్లకు వారూ సంతోషిస్తూనే ఉన్నారు. ఇటు మా కాట్యా, అటు వాళ్ళమ్మా- బయటికి ఒకరిని చూచిఒకరు ప్రాణాలువిడుస్తున్నారు. కాని ఆమెను కానకుండా ఈమె ఈమెను కానకుండా ఆమె రహస్యంగా ఏవేవో మంత్రాంగాలు చేస్తూనేఉన్నారు.

మిఖాలిచ్ తల్లిపేరు తాత్యానా సెమినోవ్నా. ఆమెగారు పూర్వకాలపుమనిషి. ఇప్పుడామెకూ నాకూ బాగా పరిచయంఏర్పడింది. ఇంటివిషయాల్లో చాలా నిర్మొహమాటంగా నిక్కచ్చిగా ఉంటుంది. తల్లిఅంటే మిఖాలిచ్‌కి పంచప్రాణాలు. వాళ్ళఅమ్మలాంటి ఉత్తమురాలూ, దయగలమనిషి ఈ లోకంలోనే లేదని ఆయనగారిఉద్దేశం. మా కుటుంబమంటే ఎంతో ప్రేమ ఆమెగారికి, అందులోనూ నేనంటే ప్రాణాలువిడుస్తుంది. ఇన్నాళ్ళకు—ఇన్నేళ్ళకు తన

కొడుకు ఒకఇంటివాడవుతున్నాడని ఆమె ఎంతో మురిసి పోతున్నది.

కాని ఒక్క విషయం కనుపరుస్తూవచ్చింది. మా పెండ్లి నిశ్చయమైనతరువాత, తన కుమారుడు అందరికన్నా అధికుడైనట్లూ, ఆవిషయం నేను గుర్తించి తనతో బద్ధికగా సంచరించడం అవసరమన్నట్లూ—అగుపించసాగింది అది నిజమే అనుకున్నాను నేనూ.

ఆ పదిహేనురోజులలో ఆయనా నేనూ కలుసుకోని రోజంటూ లేదు. ప్రతిరోజూ ఆయనగారి రాత్రిభోజనం మాఇంటనే. భోజనాలయినతరువాత అర్ధరాత్రిదాకా కబుర్లు చెప్పేవాడు. నేనులేనిదే ఒక్క క్షణం జీవించలేననేవాడు. అది నిజమేనని నేను అనుకునేదాన్ని. అయినా ఏనాడూ ఆసాంతం ఆయన నాతో గడపలేదు. తనవ్యవహారాలేమిటో తను చూచుకుంటూండేవాడు.

పెండ్లికాకముందు మా సంబంధాలు ఎలాఉన్నాయో పెళ్లయ్యేరోజువరకూ అలాగే ఉన్నాయి. కించిత్తు అయినా మార్పులేదు. ఇదివరకు ఒకరినొకరం ఎలా పిలుచుకునేవాళ్ళమో ఇప్పుడూ అలాగే పిలుచుకుంటున్నాం. ఒక్కమాటు అయినా ఆయన నాచెయ్యి ముద్దాడలేదు. ఒంటరిగా నాతో ఉండలేదు. ఉండేఅవకాశమున్నా చూచీచూడనట్లు తప్పించుకపోయేవాడు. తను మరీ అంతప్రేమగాఉంటే ఎక్కడ ప్రమాదంవస్తుందో అని ఆయన భయపడుతున్నట్లు నాకు కనుపించేది. ఆయన మారాడో లేక నేను మారానో చెప్ప లేనుకాని,ఆయనా నేనూ సమానస్థులం అన్న భావం నాలో

నాటుకుపోయింది. ఆయన వయస్సులో పెద్దవాడని, పూర్వం ఆయనంటే నాకు భయభక్తులుండేవి. ఇప్పుడవి పోయినాయి ఆయనంటే ప్రేమ, అనురాగం ఏర్పడ్డాయి. గారాబంగా చూచుకునే ముద్దుబిడ్డడులా నా కళ్ళకు కనుపించాడాయన!

'ఆయనలో ఉన్న ఘనత ఏమీ లేదు. నాలాగే ఆయనా ఒక సాధారణమైన మనిషి, అంతే!'- అనుకునేదాన్ని తగచు నాలో. వెనకటిలాగా ఆయనలో దాపరికమేమీ లేదు. ఆయనంటే ఏమిటో పూర్తిగా నాకు అర్థమైపోయింది. ముందు జీవితాన్నిగురించి నా ఆలోచనలు ఎలాఉన్నాయో, ఆయన ఆలోచనలూ అలాగే ఉన్నాయి. ఏమీ తేడా లేదు. కాకపోతే తనఆలోచనలు మరింత స్పష్టంగా వ్యక్తంచేసేవాడాయన. అంతే!

ఈమధ్య అప్పుడప్పుడు వానముసురుపట్టింది. అందువల్ల మేం అంతగా ఇల్లువిడిచి బయటికివెళ్ళడంలేదు. ఎక్కువగా ఆయనా - నేనూ పియానోదగ్గరో, కిటికీదగ్గరో కూచుని కబుర్లుచెప్పుకునేవాళ్ళం. దీపం మిణుకుమంటూ ఉండేది. సన్ననివెలుగు వచ్చి కిటికీఅద్దాలపై పడుతుండేది. మధ్యమధ్య వానచినుకులు టపటపలాడుతూ పడేవి. ఎక్కడ చూచినా తేమ ఈదుర్గుగాలి. అయినా మాకు కిటికీదగ్గర హాయిగా ఉండేది.

ఒకనాటిరాత్రి పొద్దుపోయినతరువాత మేం కిటికీదగ్గర కూచుని కబుర్లాడుకుంటున్నాం— 'చాలారోజులబట్టీ నీ కో

విషయం చెప్పాలనుకుంటున్నాను. నీవు పియానో వాయిస్తు న్నంతసేపూ నా కిదే ఆలోచన !'—అన్నా డాయన.

'మీారు చెప్పబోయే దేమిటో నాకు తెలుసులెండి !'- అన్నాను నేను

'అయితే ఇహ చెప్పాల్సినపని లేదంటావా?' —అని అడిగా డాయన.

'కాదుకాదు. చెప్పదలుచుకున్న దేమిటో చెప్పండి?'- అన్నాను మళ్ళీ నేను.

'సరే - చెపుతాను విను; ఇదివరకు నీ కో అబ్బాయి- అమ్మాయి కథ చెప్పాను గుర్తున్నదా?'

'ఆ, లేకేం? - ఉంది! పిచ్చికథ ! కాని కథముగింపు బాగానే ఉంది'-

'అవును. అలా ముగించకపోయినట్లయితే నా సుఖాన్ని నేను చేజేతులా నాశనంచేసుకుని ఉండేవాణ్ణి. నీవే నన్ను కాపాడావు కాని ఇంతకూ చెప్పొచ్చే దేమిటంటే- అప్పుడు నీకు చెప్పినవన్నీ పచ్చిఅబద్ధాలు. లోపల ఎంతో బాధగా ఉండేది ఆవిషయమే నీకు చెప్పాలనుకున్నాను.'

'మరేం ఫరవాలేదు - చెప్పొద్దులెండి'-

'గాభరాపడకు !' - అంటూ ఆయన చిరునవ్వు నవ్వాడు - 'నేను చేసింది ఒప్పనని నీవు అనుకునేటట్లు చెయ్యాలనే నా తాపత్రయమల్లానూ - కాని నీతో మాట్లా డడం మొదలుపెట్టగానే ఏదో వాదనకు దిగేవాణ్ణి !' - అన్నాడు.

'వాదనా? దేనికీ! హేతువులూ వాదనలూ అక్క్లేదులెండి!' అన్నాను మళ్ళీ.

'అవును. చాలా కఠినంగా వాదించాను... నా బ్రతుకులో ఎన్నో ఆశాభంగాలు, అపజయాలు. ఎన్నెన్నో తప్పటడుగులు - ఈ పల్లెటూళ్ళకు వచ్చేముందే నిశ్చయించుకున్నాను ప్రేమంటే ఏమిటో నాకు తెలీదు దానికీ నాకూ చాలాదూరం. బ్రతికున్నంతకాలం బ్రహ్మచారిగానే ఉండిపోదామనీ, ప్రశాంతంగా జీవితం గడిపివేద్దామనీ నిశ్చయించుకున్నాను. అందువల్ల నీతో అరవిడిచి ఉండలేకపోయాను. నా మనస్సును అదుపులో పెట్టుకోకపోతే ఎక్కడ కాలు జారుతానో-దానివల్ల చివర కెలాంటి పరిణామాలు వస్తాయో అని అనుక్షణం భయపడుతూవచ్చాను మనస్సు పాడుచేసుకున్నాను. ఒకవైపు ఆశ - మరొకవైపు నిరాశ - ఈ ఆశ-నిరాశలమధ్య నా మనస్సు గిలగిల తన్నుకున్నది. ఒక్కొక్కప్పుడు నీవు నన్ను తమాషాపట్టిస్తున్నా వనుకునేవాణ్ణి. మరొకప్పుడు నీవు నిజంగానే నన్ను ప్రేమిస్తున్నా వనుకునేవాణ్ణి. ఏంచెయ్యాలో తోచక పిచ్చెక్కినట్లుండేది ఒక రాత్రి మనం కోటకోనేక షికారువెళ్లాం - నీకు జ్ఞాపకముందా? వెన్నెలరాత్రి. ఆరాత్రి నా మనస్సంతా వికలమైపోయింది. నే ననుకున్న సుఖమంతా నాకు అందేదేనా అనిపించింది. చెప్పొద్దూ! నిజానికి అదంతా వట్టిదనీ, కేవలం భ్రాంతిపడుతున్నాననీ నేను గ్రహించినట్లయితే నాగతి ఏమైఉండేది? కాని నిజంచెబుతున్నాను అప్పుడు కేవలం నా విషయంతప్ప మరొకవిషయం నాకు పట్టేదికాదు. ఎంచేతనంటే నేను దుర

హంకారిని!' ఇలా చెప్పి ఆయన నావంక చూచాడు.-'సరే- ఎమైనా అప్పుడు నేను చెప్పినవన్నీ పిచ్చిమాటలని అనడా నికి వీల్లేదు. నేను భయపడడానికి తగినకారణం ఉంది. నీకు తెలుసు - నీవల్ల నేను పొందేది ఎక్కువ - నావల్ల నీకు వచ్చేది చాలా తక్కువ నీ వింకా చిన్నపిల్లవు. విచ్చీ విచ్చని పువ్వులాంటి అమ్మాయివి. అప్పుడప్పుడే మొలకెత్తు తున్న తొలిప్రేమ నీది - మరి నేనో!' అన్నాడు

'అవును. చెప్పండి మీవిషయం దాచకుండా చెప్పండి?'-అని అడిగాను నేను కాని తక్షణమే నాకు భయం పుట్టింది ఇయన ఏం సమాధానంచెప్తారో అని వణికి పోయాను. 'వద్దువద్దు. మీ రా విషయాలేవీ చెప్పొద్దు'- అన్నాను మళ్ళీ

'అంటే ఇదివరకే నే నెవరినైనా ప్రేమించాననికదూ నీ ఉద్దేశం?'-అన్నా డాయన నా మనస్సులో ఉద్దేశాన్ని ఇట్టే కనిపెట్టేసి - 'ఉండు. నీ కా విషయంకూడా చెప్తాను. ఇంతకుముందు నే నెవరినీ ప్రేమించలేదు. ఇలాంటి అనుభవమే నా కెన్నడూ కలగలేదు. సరేనా? ...'ఇలా అంటుండగా అకస్మాత్తుగా ఏదో విషాదకరమైన జ్ఞాపకం ఒకటి ఆయనమనస్సులో తళుక్కుమన్నట్లు కనుపించింది.—'లేదు.' అన్నా డాయన విషాదవదనుడై-'నిన్ను ప్రేమించే అర్హత నాకు రావాలంటే నీలాంటిహృదయమే నాకూ ఉండాలి. కాబట్టి నిన్నుప్రేమిస్తున్నానని నీతో చెప్పేముందు ఈ విషయాలన్నీ నేను తలపోయవలసిన అవసరంలేదూ? నీ

కివ్వడానికి నాదగ్గ రేముందనుక? - నిజంగా ఒక్క ప్రేమ తప్ప !'-అన్నాడు విచారంగా.

'ఆ ప్రేమ చాలదంటండీ, అంతకన్నా ఏం కావాలి? అదేం స్వల్పమంటారా?'-అన్నాను నేను ఆయనకళ్ళలోకి చూస్తూ.

'స్వల్పమే నమ్మాయ్-స్వల్పమే. నీవా వయస్సులో ఉన్నదానివి, చక్కనిదానివి. ఇప్పుడు నాకు రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టడం లేదంటే నమ్ము - మితిమీరిన ఆనందంలో మునిగి తేలుతున్నాను. మన ఇరువురం దంపతులుగా ఎలా కలిసి జీవిస్తామని పరిపరివిధాల ఆలోచిస్తున్నాను. జీవితంలో నాకు నిజమైన సుఖానుభవం ఇప్పుడే చూడగలుగుతున్నాను. ఈ పల్లెటూళ్ళలో చల్లగా జీవించడం, ఎవరివల్లా ఏ సహాయం ఎరగనటువంటి అమాయకులైన పల్లెప్రజలకు చేతనైన సహాయంచేయడం, ఏదో ఇంత పారమార్థికపని చేస్తూ ఉండడం, తరువాత ఇంత విశ్రాంతి, ప్రకృతిసౌందర్యాన్ని తిలకించడం, మంచిమంచి పుస్తకాలు చదువుకోడం, సంగీతం వినడం, చుట్టుపక్కలజనాన్ని ప్రేమిస్తూఉండడం - ఇవే నా జీవితంలో సంతోషం కలిగించేవిషయాలు. వీటన్నిటికంటె ముఖ్యమైంది నీ స్నేహం. నీలాంటి స్నేహితురాలు దొరకడం - సంసారం ముందుముందు పుడితే-గిడితే పిల్లలు- ఇంతకన్నా ఈ ప్రపంచంలో మనిషిఅన్నవాడికి ఇంకా ఏం కావాలి?'-

'అవును'-అన్నాను నేను.

'నాకు వయస్సంతా గడచిపోయింది. ఇలాంటి నాకు ఇంతమాత్రం ఉంటేచాలు. మరి నీవు? నీ కలా కాదు. నీ వింకా జీవితంలో ఏమీ అనుభవించనిదానివి. కనుక మరో విధంగా సుఖంపొందాలనేకోరిక నీకు కలగవచ్చు ఆ కోరిక తీర్చుకోనూవచ్చు ఇప్పుడంటావా? నాపై ఉండే ప్రేమవల్ల ఇదే సుఖం, సంతోషం అనుకుంటున్నావు. అవునా?'-

'కాదు. నేను మొదటినుంచీ కోరినదల్లా ఇలాంటి ప్రశాంతమైన కుటుంబసౌఖ్యమే. నాకు ఏ కోరికఅయితే ఉన్నదో - అదే మీరుకూడా చెప్పారు'-

నామాట విని ఆయన చిరునవ్వునవ్వాడు.

'నీ కలా అనిపిస్తున్నది అమ్మాయ్. నీ కంత మాత్రంతో సరిపోదు! నీ వింకా వయస్సులో ఉన్నదానివి, అందగత్తెవు-' అన్నా డాయన మళ్ళీ సాలోచనగా.

కాని నాకు కోపంవచ్చింది. ఆయనకు నామీద నమ్మకంలేదు. అందుకే నేను వయసుదాన్ననీ, అందకత్తె ననీ పదేపదే అంటున్నాడు.

'అవుతే, మీరు నన్నెందుకు ప్రేమించడం?'- అని కోపంగా అడిగాను - 'నా యౌవనంకోసమా లేక నా కోసమా?'- అన్నాను.

'దేనికోసమో తెలీదుకాని, నిన్నుమాత్రం ప్రేమిస్తు న్నాను-' అని జవాబుచెప్పా డాయన, నావంక తీక్షణంగా చూస్తూ.

'ఇహ నే నేమీ మాట్లాడలేదు. ఆయనకళ్ళవంక చూచాను. అకస్మాత్తుగా నాలో ఏదో ఒక విచిత్రం వచ్చి

ప్రవేశించింది. మొదట నా చుట్టూ ఉన్నవన్నీ కనుపించకుండా పోయాయి తరువాత ఎదురుగా ఉన్న ఆయన ముఖంకూడా అగుపించకుండాపోయింది. ఆయన కళ్ళుమాత్రమే తళతళ లాడుతూ నాకు కనిపించాయి. ఆ తరువాత ఆ కళ్ళు నన్ను పూర్తిగా ఆకర్షించి ఆకట్టుకున్నవి. ఆ చూపుకు నేను తట్టుకో లేకపోయాను, ఆ వెలుగు చూడలేక నా కళ్ళు మసకలు కమ్మాయి. ఏదో చెప్పరాని ఆనందం, భయం పుట్టుకొ చ్చాయి. అప్రయత్నంగా నా కళ్లు మూతలుపడ్డాయి.

రేపు నా పెళ్ళి అనగా - ఇవాళ సాయంత్రానికి వాన తెరిపిఇచ్చింది. మబ్బు-మసక లేదు. ఫెళఫెళ ఎండకాస్తోంది. వేసవికాలంలో ప్రారంభమైన వానముసుర్లు తగ్గగానే నిర్మల మైన, చల్లని శిశిరవాయువులు వీచసాగాయి. ఆకాశం నిర్మ లంగా ఉంది. తోటలు, బాటలు కళకళలాడుతూ కనుపిస్తు న్నవి 'అమ్మయ్య! వాన తగ్గిపోయింది. రేపు మా పెళ్ళి నిర్విఘ్నంగా, హాయిగా జరిగిపోతుంది-' అని అనుకుంటూ నేను సంతోషంగా వెళ్ళి పడుకున్నాను.

పెళ్ళినాడు ప్రొద్దుపొడవకముందే లేచాను. ఇవాళే నా పెండ్లి - అనుకున్నాను. ఒకవిధమైన భయమూ, ఆశ్చ ర్యమూ నన్ను ఆవహించాయి.

తోటలోకి వెళ్ళాను. ప్రొద్దుపొడిచింది. సూర్యుడు ఎగసివస్తున్నాడు. నిమ్మచెట్ల కొమ్మలసందుల్లోనుంచి ఎండ పొడవచ్చిపడుతోంది. అంతటా తళతళలాడుతోంది. బాటపై నడుస్తుంటే రాలినఆకులు గలగల్లాడుతున్నాయి. దూరంగా కొండలపై పొగమంచు కమ్ముకొనిఉంది. పచ్చికమీదకూడా

అక్కడక్కడ పొగమంచు పడి తేమగా ఉంది ఆకాశం మాత్రం నిర్మలంగా ఉంది -ఒక్క మబ్బుతునక కూడా లేదు.

'ఇవాళేనా నా పెండ్లి?' అని నాలో నేను ప్రశ్నించుకున్నాను - 'నిజంగా ఆ సుఖసమయం, శుభసమయం రానే వచ్చిందా? నమ్మలేకపోతున్నాను. రేపు నే నిక్కడ ఉండనా? రేపీపాటికి మా అత్తవారింట్లో, ఆ ఎత్తయిన కొత్తమేడలో ఉంటానా. ఇహ నేను ఆయనరాకకోసం వేచి ఉండక్కర్లేదా? ఆయన్ను కలుసుకోడానికి ఎదురు వెళ్ళక్కర్లేదా? ఆయన్ను గురించి ఇహ కాట్యాతో పదేపదే చెప్ప పనిలేదా? ఇహ మా ఇంట్లో ఆయనతో కలిసి పియానో దగ్గర కూచోనుకదా? అర్ధరాత్రిదాకా ఆయనరాకకోసం ఎదురుచూస్తూ ఉండనుకదా?'- అని పరిపరివిధాల తలపోశాను.

తరువాత నిన్నటిదినం ఆయన మా ఇంటికి రావడం, ఇక్కడికి రావడం ఇదే ఆఖరుసారి అని చెప్పడం నాకు గుర్తొచ్చాయి. కాట్యా నన్ను పిలిచి సరిపోతాయో లేదో ఒకమాటు పెండ్లిబట్టలు కట్టుకునిచూడమని చెప్పింది. రేపేనమ్మా నీ పెండ్లి అన్నది—ఈ విషయం జ్ఞాపకంవచ్చి నన్ను నేను నమ్మలేకపోయాను. ఇది నిజమేనా?-అనుకున్నాడు.

'ఇవాళేనా నేను అత్తవారింటికి వెళ్ళేది? ఇహ మా కాట్యాను, గ్రెగరీని, పనిమనుషులను, దాసీలను - అందరినీ వదిలిపెట్టి మా అత్తగారిదగ్గర ఉంటానా? ఇహ మా దాది నాదగ్గరుండదా! రాత్రిళ్ళు నాకోసం దైవప్రార్థన చేసి- ఇహ వెళ్ళొస్తాను అమ్మగారూ అని చెప్పదా? ఇహ నేను మా

చెల్లాయి సోన్యాతో ఆడుకోనా? దానికి పాఠాలు చెప్పనా? ప్రొద్దున్న దాన్ని నిద్రలేపనా? అది కిలకిలనవ్వుతుంటూ 'అక్కా!' అని నాదగ్గరికి రాదా? నా లైబ్రరీ, నా జీవితం-అంతా ఈనాటితో మారిపోతున్నదా! కొత్తజీవితం ప్రారంభమవుతున్నదా? నా ఆశలు, ఆకాంక్షలు ఫలించనున్నవా? ఈ నూతనజీవితమే ఎల్లకాలం నాకు ఉంటుందా?'-

ఇలాంటి ఆలోచనలన్నీ మనస్సులో ముసురుకొని, ఒంటిగా ఉండలేకపోయాను. ఆయనగారు ఎప్పుడొస్తారా అని తహతహలాడిపోయాను.

ఆయన పెండలకడనే వచ్చాడు. ఆయన్ను చూచి, ఈనాటినుంచీ నేను ఆయనభార్యను - అనుకున్నాను.

భోజనాలకు ముందు, మా నాయనగారి జ్ఞాపకార్థం అర్చనచేయడానికై మేము దేవాలయానికి వెళ్ళాం. ఆలయంనుంచి తిరిగివచ్చేటప్పుడు - 'ఇప్పుడు మానాన్నగారు బ్రతికి ఉంటే ఎంత బావుండేది!' - అనుకున్నాను. ఇలాఅనుకుంటూ మా నాన్నగారి ప్రాణస్నేహితుడైన ఆయనబుజంమీద వాలి నడవసాగాను. దేవాలయం అర్చన జరిగేటప్పుడు మా నాన్నగారిరూపం నా కనులముందు పొడగట్టింది. నేను సాష్టాంగపడి నమస్కారంచేశాను. నా పెండ్లి విషయం ఆయగారికి చెప్పుకొన్నట్లూ ఆయన అంగీకరించి నన్నుఆశీర్వదించినట్లు నాకు అనిపించింది. నా మనస్సు మహదానందంతో నిండిపోయింది. పైన నీలాలనింగి, చుట్టూ పొలాలు, అన్నీ ప్రకాశమానంగా ఎంతో ప్రశాంతంగా కనుపిస్తున్నాయి. నా కెంతో హాయిగా ఉంది.

నా ప్రక్కన నడుస్తున్న ఆయనగారికికూడా నా మనస్సులోభావాలు అర్థమైనట్లున్నది. ఆయన నిండుగా, నిశ్శబ్దంగా నడుస్తున్నాడు. మధ్యమధ్య నేను ఆయనముఖంకేసి చూస్తున్నాను. నాలాగా ఆయనలోనూ ఒకవంక ఆనందం, ఒకవంక విషాదం గోచరిస్తున్నాయి.

ఉన్నట్టుండి ఆయన నావంక చూచాడు. ఏదో చెప్ప బోయాడు- 'నా మనస్సులో ఉన్నదే ఆయన చెప్పుతుంటాడా?'- అనుకున్నాను నేను. సరిగ్గా నే ననుకుంటున్నదే ఆయన చెప్పాడు.

'ఒకమాటు మీ నాన్నగారు నాతో తమాషాకు అన్నారు. 'మా అమ్మాయి నూషాను నీవు పెండ్లాడా లోయ్!'- అన్నా రాయన. ''నిజంగా ఆయనగారు ఇప్పుడు జీవించిఉంటే ఎంత బావుండేది!'' అన్నాను నేను. ఇలా అని ఆయనచేతిని నాచేత్తో గట్టిగా నొక్కాను.

'అవును. ఆయన పిల్లలలో నీఒక్కదానికే ఆయన పోలికలొచ్చాయి!'- అంటూ ఆయన నాకళ్ళలోకిచూచి చెప్పసాగాడు - 'అచ్చంగా మీనాన్నగారికళ్ళే నీవి! అందుకే చిన్నప్పుడు నీకళ్ళను నేను ముద్దుపెట్టుకునేవాణ్ణి. నిన్ను మాషా అని ముద్దుగా పిలిచేవాణ్ణి!'- అన్నారు.

'నన్ను ప్రియురాలా అని పిలవండి!'- అన్నాను నేను.

'తప్పకుండా పిలుస్తాను ప్రియురాలా! ఇప్పుడు నీవు నాదానవు!'- అన్నాడు ఆయన మళ్ళీ.

ఆయనప్రశాంతమైన, ప్రకాశవంతమైనచూపులుమళ్ళీ నామీద వాలాయి. మేము పొలాలమధ్య బాటగుండా నెమ్మ

దిగా నడుస్తున్నాం. చుట్టూ అంతా నిశ్శబ్దం. మా పదధ్వని, మా మాటలుతప్ప మరెక్కడా ఏమీ అలికిడి లేదు. ఒకవైపు దూరంగా కొండకోనఅవతల పచ్చనిఅడవి పరుచుకుని కనుపిస్తోంది. మాచుట్టూ పొలాలు. ఒకచోట నల్లరేగడభూమిలో రైతుఒకడు అరకకట్టి ప్రశాంతంగా దున్నుకుంటున్నాడు. కొండక్రింద గుత్తాలగుంపు ఒకటి చెదురుచెదురుగా మేస్తున్నాయి.

మరొకవైపు మాముందు సూటిగా శీతాకాలపు గోధుమపంటపొలం ఒకటి పొగమంచుకమ్ముకుని అగుపిస్తోంది. దానికి అవతలగా మాతోటా, మాఇల్లూ స్పష్టంగా కనుపిస్తున్నాయి ప్రతినస్తువూ శిశిరఋతువు సూర్యకాంతిలో జలకమాడుతోంది సాలెగూళ్ళు అంతటా అల్లుకునిఉన్నాయి. అవి మా తలలకూ, తలవెంట్రుకలకూ చుట్టుకుంటున్నాయి. కళ్ళకుకూడా అడ్డంవస్తున్నాయి. ఆ స్తబ్ధ నిశ్శబ్ద ప్రశాంత వాతావరణంలో ఈ విశాలవిశ్వంమధ్య మేమిరువరంతప్ప మరేదీ లేనట్లు అనిపించింది. నీలాలనింగిక్రింద తళతళలాడే ఎండలో మేమిరువురంఒంటిగా ప్రయాణంచేస్తున్నట్టుతోచింది.

నేనుకూడా ఆయన్ను ప్రియాఅని పిలవాలనుకున్నాను. కాని అంతలోనే సిగ్గుముంచుకొచ్చింది. మళ్ళీ అంతలోనే 'అంతతొందరగా నడుస్తారేం ప్రియా !'- అని తెలీకుండానే గభాలున అనేశాను. ఇలా అన్నందుకు వెంటనే సిగ్గు తెరలు తెరలుగానచ్చి కమ్ముకున్నది.

ఆయన నడక కొంచెంతగ్గించి, మరింత ఉల్లాసంగా సంతోషంగా ప్రేమగా నావంక చూచాడు.

మేం ఇంటికి వెళ్ళేసరికే – అప్పటికే ప్రక్కనే ఆయన తల్లిగారూ, పెండ్లికివచ్చిన చుట్టపక్కాలూ పోగయిఉన్నారు. ఇహ ఆక్షణం లగాయతూ దేవాలయంలో ప్రస్న ముగించుకుని మళ్ళీ మాయింటికి వెళ్ళడానికి బండ్లో ఎక్కేటంతవరకూ ఒక్కనిముషంకూడా మేం ఒంటరిగా లేం.

చర్చిలోనుంచి అంతా వెళ్ళిపోయారు. ఆయనగారి తల్లిమాత్రం దేవుడిపీఠంప్రక్కనే నిలబడిఉంది. కాట్యా కంటతడిపెడుతూ నిల్చున్నది. మా పరిచారకులలో ఇద్దరు ముగ్గురు నావంక అదోలా ఆశ్చర్యంగా చూస్తున్నారు.

నేను మావారివంక కన్నెత్తిచూడలేదు. కాని ఆయన నా సరసనే ఉన్నాడని తెలుసు. దైవప్రార్థనలు విన్నాను. పురోహితుడు మంత్రాలుచెప్పాడు. చదివాను. కాని అవేవీ నామనస్సుకు పట్టలేదు. దైవప్రార్థనకూడా చెయ్యలేకపోయాను. అక్కడ వెలుగుతోన్న దీపారాధనల వంక, విగ్రహాలవంక వెర్రిచూపులుచూస్తూ నిలుచుండి పోయాను. అంతా నాకు వింతగా, ఏదో కలలా కనుపిస్తోంది. నా ఆత్మ కలవరంతో నిండివుంది. ఏదో అసాధారణమైన విషయం నాకు సంభవిస్తున్నట్లనిపించింది. పురోహితుడు 'శిలువగుర్తు' చేతపట్టుకొని మమ్మల్లను ఆశీర్వదించాడు– 'మీకు పేర్లుపెట్టిందీ నేను, పెండ్లిచేసిందీ నేనే!'– అని సంతోషంతో అన్నాడు. తరువాత ఆయనతల్లీ, కాట్యా మమ్మల్ని ముద్దాడారు. మాకోసం గ్రెగరీ బండి సిద్ధంచేసి తీసుకొచ్చాడు. నాకు ఆశ్చర్యమూ, భయమూ పుట్టుకొచ్చాయి. 'అరె! అప్పుడే మా పెళ్ళి అయిపోయిందా? పెండ్లంటే ఇంతే

నా? అసాధారణమైన విషయం ఏమీ లేదే! నాలో మార్పే మీ లేదే!'- అనిపించింది. 'ఏదో బ్రహ్మాండం ఒరిగిపోతుం దనుకున్నాను. ఏమీ లేదే!'- అనుకున్నాను.

ఆయనా నేనూ ఒకరినొకరం ముద్దాడుకున్నాం. ఆ ముద్దులు మేం అనుకున్నట్లు లేవు. ఏదో వింతగా, కొత్తగా ఉన్నాయి.

'ఇంతేనా?'- అని మళ్ళీ నాలో నేను ప్రశ్నించు కున్నాను.

దేవాలయంలోనుంచి ఇవతలికి వచ్చాం. బండి చప్పుడు చేసుకుంటూ మాదగ్గరికి వచ్చింది. చల్లని మెల్లని గాలి వచ్చి మాముఖాలకు తాకింది. ఆయన తలమీద హేటు పెట్టుకొని, నాకు చెయ్యి అందించి బండ్లో ఎక్కించాడు. బండికిటికీలోనుంచి అర్ధచంద్రుడు అగుపించాడు.

ఆయనకూడా బండ్లో ఎక్కాడు. నాప్రక్కనే కూచు న్నాడు తలుపు మూసివేశాడు. నాగుండెల్లో ఏదో దడదడ కొట్టుకున్నది. ఆయన ఇలా చెయ్యడం నాకేదో అవమా నంగా తోచింది.

అవతలనుంచి కాట్యా - 'తలకేదైనా కప్పుకోవమ్మా శీతగాలి సోకుతుంది'- అని కేక వేసి చెప్పింది. తరువాత బండి రాళ్ళలోనుంచి చప్పుడు చేసుకుంటూ సాగిపోయింది. ఒకమూలకు ఒదిగికూచుని కిటికీలోనుంచి దూరానఉన్న పొలాలు, బాటలు, గుడ్డివెన్నెలలో చూస్తూ కూచున్నాను. ఆయనవంక చూళ్ళేదు.

'ఎన్నాళ్ళబట్టో కళ్ళు కాయలుకాచేట్లు కనిపెట్టు కునిఉన్నది ఈమాత్రందానికేనా.'- అనుకున్నాను. నాకేదో చెప్పరాని బాధకలిగింది. ఆయన్ను అనుకుని ఇలా ఒంటిగాకూచోడం అవమానకరంగా తోచింది. ఏదో చెప్పాలని ఆయనవైపు మళ్ళాను. కాని నోటమాటరాలేదు అంతకు ముందాయనమీద నాకున్న అనురాగం పోయింది. ఏదోఅవమానం, బాధ నాలో ఆక్రమించుకున్నాయి నాకు తలసంపులయినపని ఏదో జరిగిపోతున్నట్లనిపించింది!

'ఇదంతా ఇలా జరిగిపోతుందని ఒక్కక్షణంక్రితం వరకూ నే ననుకోలేదుసుమా!'-అన్నా డాయన మెల్లగా. నావంక చూస్తూ. 'అవునుకాని, నా కెందుకో భయంగా ఉంది'-అన్నాను నేను.

'నేనంటే నీకంత భయంగాఉందా ప్రియురాలా?'- అని అడిగా డాయన, నా చెయ్యిపట్టుకొని, నామీదికి ఒరుగుతూ.

నా చెయ్యి నిర్జీవంగాఉంది. గుండె ఆగిపోయిందని పించింది. - ఒళ్ళంతా చలవలుకమ్మినట్లయింది! 'అవును'- అన్నాను నేను, మెల్లగా.

కాని అంతలోనే, నాశరీరంలో అంతటా ఎక్కడలేని వేడి పుట్టుకొచ్చింది. నాడి వేగంగా కొట్టుకున్నది. నాచేత్తో ఆయనచేతిని గట్టిగా అదిమాను అప్రయత్నంగా నాచూపులు ఆయనమీదికి మళ్ళాయి. చీకట్లో మిలమిలలాడే ఆయనకనులను తదేకంగా చూచాను. 'ఇదంతా భయంకాదు. ఆయనంటే నాకున్నప్రేమ!'- అనుకున్నాను. ఆ ప్రేమ పూర్వం

కన్నా ఇప్పుడు అనేక వేలరెట్లు ఎక్కువ - ఎంతో సుస్థిర మైనస్థిరమైనది. 'నేనుఆయనదానను-నా సర్వస్వంఆయనదే' - అనిపించింది. ఆయన కిలా వశమైపోవడంలోనే నాకు ఎక్కడ లేని సుఖంఉన్నదని అనుకున్నాను.

# 6

ఆ పల్లెటూళ్ళో మాకు తెలీకుండానే రోజులు, వారాలు, - నిండా రెండునెలలు గడచిపోయాయి. కాని ఆ రెండునెలల్లోనే మాకు ఎన్నెన్నో అనుభవాలూ, ఆనందాలూ కలిగాయి. ఉద్రేకాలూ ఊహలూ పుట్టాయి. మేం పొందినసుఖం ఇంతా - అంతా కాదు. మేం బ్రతికినంత కాలం ఆ సుఖం చాలు!

పల్లెటూళ్ళలో ఒక క్రమబద్ధమైన జీవితం గడపాలని మావారూ, నేనూకూడా కలలుకన్నాం. మా కలలు కల్ల కాలేదుకాని, మేం అనుకున్నంతగా ఆదర్శాలను ఆచరణలో పెట్టలేకపోయాం. అదిమాత్రం నిజం. నేను ఆయన్ను పెండ్లాడకముందు ఎన్నెన్నో ఊహించుకున్నాను పల్లెజనులతోపాటు కష్టపడి పనిచెయ్యాలనీ, మా విధులు మేము నిర్వర్తించుకోవాలనీ, స్వార్థమనేది లేకుండా పరులకోసం జీవించాలనీ అనుకున్నాను. తీరాచూస్తే మేం కాపురంచేయడం మొదలుపెట్టినతరువాత మా జీవితం అందుకువిరుద్ధంగా కొనసాగింది. నా స్వార్థంకోసం నేను ఆయన్నూ, ఆయన స్వార్థంకోసం ఆయన నన్నూ,ఒకరినొకరం ప్రేమించుకుంటూ వచ్చాం. తెంపులేకుండా ఆరాటపడ్డాం. కారణం కనుపించని

సంతోషంలో మునిగితేలాం. మా సంతోషమే మాదికాని, ఇహ మాకు తక్కిన ప్రపంచంసంగతే పట్టలేదు !

అప్పుడప్పుడు మావారు తనగదిలో కూచుని, తలుపులు బిగించుకునేవారు. తన వ్యవహారాల్లో తను మునిగి పోయేవారు. ఒక్కొక్కప్పుడు ఎస్టేటువ్యవహారాలు చూచుకునేందుకు పట్నానికి వెళ్ళేవారు. ఇలా ఆయన నన్ను వదిలిపెట్టి రోజులతరబడి ఎలా ఉండగలుగుతున్నారా అనుకునేదాన్ని. నావిషయంకూడా అలాగేఉంది. నేనున్నా లేకున్నా ఆయన తనపనులలో ఎలా మునిగిపోయిఉంటున్నాడో నేనూ అలాగే నా పనులలో నేను ఉంటూవచ్చాను. కాసేపు చదువుకునేదాన్ని; కాసేపు సంగీతం పాడుకునేదాన్ని. మరి కొంతసేపు మా అత్తగారితో ముచ్చట్లాడేదాన్ని, కొంతసేపు ప్రక్కనున్న బళ్ళోపిల్లలకు చదువుచెప్పేదాన్ని. అవుతే ఒక్క విషయం. నేను చేసే ఈ పనులన్నీ ఆయనగారికి ఇష్టమైనవీ, ఆయనగారికి అంతో ఇంతో సంబంధమున్నవీను. అందుకనే ఇవన్నీ చేయగలిగాను. అప్పట్లో ఆయనే నా సర్వస్వం. ఆయనలేని ప్రపంచమే లేదు నాకు. నిజానికి ఇందులో ఎంతో నా స్వార్థముండన్నది. ఉన్నా అది నాకెంతో హాయినీ, ఆనందాన్నీ ఇస్తూవచ్చింది.

లోకంలోకల్లా మావారొక్కరే చక్కనివారు, బుద్ధిమంతులు, ఉత్తమ పురుషులు. మరి నాకళ్ళకు ఆయన అలా కనుపించేవాడు! ఆయన పక్కనలేంది నేనొక్కక్షణం జీవించలేను. నేనంటే మావారికీ అంతే. లోకంలోకల్లా నేనొక్కతెనే అందగత్తెననీ, మంచిపిల్లననీ ఆయన అనుకునేవాడు.

ప్రార్థన అయినతరువాత నేను పొట్టచెక్కలయ్యేటట్లు నవ్వాను.

'అదిగో, మామా! నీ ప్రక్కనుంచే నేనిప్పుడు మళ్ళీ పదేండ్లు చిన్నవాణ్ణి అయ్యాను!'- అంటూ ఆయన కుంకుమ చల్లినట్లు ముఖం చేసుకుని నా చెయ్యి ముద్దాడాడు.

పల్లెటూళ్ళలో పూర్వకాలంలో కట్టిన భవంతుల్లో ఒకభవంతి మా ఇల్లు. ఒక కుటుంబం తరతరాలుగా ఆ యింట్లో నివసిస్తూవచ్చింది. ఒకకుటుంబం తాలూకు ఎన్నెన్నో స్వచ్ఛమైన మధురస్మృతులు, జ్ఞాపకాలు, ఆ ఇంటి మూల మూలలా ముసురుకొని ఉన్నాయి. ఆ ఇంట్లో నేను అడుగు పెట్టినలగాయితూ అది మా స్వంతఇల్లులాగానే అయిపోయింది. కొత్తఇంట్లో ఉన్నట్లు నాకెంతమాత్రం అనిపించలేదు.

మాఇంట్లో ఉన్న సామానులూ, అలంకారాలూ - అన్నీ పూర్వకాలపుపద్ధతిలో తయారుచేసినవి. మా అత్తగారు తాత్యానా సెమినోవ్‌నా పూర్వకాలపుమనిషి. ఆవిడగారి అభిరుచులకుతగ్గట్టే ఉన్నాయి అవి. అందచందాలు లేకపోయినప్పటికీ, ప్రతివస్తువుబట్టి కాసమృద్ధిగా ఉంది నౌకర్లేమిటీ, బల్లలూ, కుర్చీలేమిటీ, ఆహారపదార్థాలేమిటీ - అన్నీ కావలసినదానికి నాలుగురెట్లు ఎక్కువగా ఉన్నాయి. డ్రాయింగ్‌రూంలో ఫర్నిచరుఅంతా ఒక చక్కనిపద్ధతిలో అమర్చిఉంచారు. గోడలనిండా పటాలు, రంగురంగుల వర్ణచిత్రాలు వ్రేలాడుతున్నాయి. నేలమీద చేనేతదుప్పట్లూ, చాపలు చాపల చిరిచాపలూ చక్కగా పరిచిఉన్నాయి. ఇవ

మా దివాణంలో ఒక అద్భుతమైన పాత పియానో ఉంది. అడుగున చక్రాలుగల చూడచక్కని బీరువాలు రెండు న్నాయి ఇంకా ఇత్తడివిగ్రహాలు, సామాన్లు అనేకం. మా పడకగదివిషయంలో మా అత్తగారు ప్రత్యేకమైన శ్రద్ధతీసు కున్నారు. ఏకాలానికితగ్గట్టు ఆకాలపు ఫ్యాషన్‌లో తయారు చేసిన రకరకాల ఫర్నిచరు ఆ గదిలో అమర్చిపెట్టారు. ఎన్నెన్నో అందమైన వస్తువులతోపాటు ఒక పెద్ద నిలువటద్దంకూడా ఉంది. ఆ అద్దంలో చూచుకోవడమంటే మొదట మొదట నాకెంతో సిగ్గుగాఉండేది. కాని రానురాను అల వాటయిపోయింది ఆ నిలువుటద్దమంటే నాకు పంచప్రాణాలుగా ఉండేది!

మా అత్తగారు ఇంట్లో మాట్లాడినట్లే ఉండదు. ఆమె గొంతే వినిపించదు. అయినా ఎప్పటికప్పుడు - ఇంట్లో అన్నిపనులూ వాటంతటఅవే సకాలానికి సక్రమంగా చకచకా జరిగిపోతాయి. ఇంట్లో నౌకరులు, దాసీలు చాలా మంది ఉన్నారు. వారంతా చప్పుడుకాని మెత్తని రబ్బరు చెప్పులువేసుకుని తిరుగుతారు. చెప్పులు చప్పుడైతే మా అత్తగారు ఎంతమాత్రం సహించలేదు! ఇంట్లోఉన్న నౌకర్లంతా ఎంతో ఉల్లాసంగా కనుపిస్తారు. ఎవరిముఖంలోనూ దీనత్వంఉండదు. ఎంతో గర్వంగా దర్జాగా తమపనులు తాము చేసుకపోతారు! మా అత్తగారంటే అందరికీ హడలు. ఇహ మావారన్నా, నేనన్నా అందరికీ ఎంతో ప్రేమ, భక్తి శ్రద్ధలూనూ. ఏమైనా మావల్ల పల్లెత్తుమాటపడకుండా వారు పనులుచేస్తూవచ్చారు.

ప్రతిశనివారం ఇల్లంతా బూజుదులిపి, శుభ్రంగా కడిగేవాళ్ళు. వాపలూ, దుప్పట్లూ ఉతికివేసేవాళ్ళు. ప్రతి నెలా ఒకటోతారీఖున పవిత్రజలాలు తెచ్చి ఇల్లంతా పుణ్యాహవాచనం చేసేవాళ్ళు. అంతేకాదు; మావారి పుట్టినరోజు పండుగ వచ్చినా, మా అత్తగారి పుట్టినరోజువచ్చినా ఆ వాడకట్టునంతా పిలిచి మహావైభవంగా పెట్టేవారు. ఇది మొదటినుంచీ ఆచారంగా వస్తున్నదట. ఆ శిశిరఋతువులో నా పుట్టినరోజుకూడా వచ్చిందని ఆనాడూ మహావైభవంగా విందుభోజనాలు పెట్టారు.

ఇహ మావారున్నారు - ఆయన ఇంటిగొడవే పట్టించుకోరు. ఇంట్లో ఏది ఉన్నదో ఏది లేదో - ఆయనకు తెలీదు. ఆయనగారిపనల్లా పొలాలు అజమాయిషీ చేయడం, ఎస్టేటువ్యవహారాలు చూచుకోడం - ఆ రైతులతోనూ, ఆ పంటా - పైరూ చూచుకోడంతోనూ ఆయనకు సరిపొయ్యేది. చలికాలంలోకూడా ఆయన పెందలకడనే లేచేవారు- నేను నిద్రలేచేటప్పటికే బయటికి వెళ్ళిపోయేవారు. టీతాగే సమయానికి సాధారణంగా తిరిగివచ్చేవారు. మే మిద్దరం కూచుని టీతాగేవాళ్ళం. అప్పుడాయన తనపనులు, శ్రమలు- అన్నీ మరిచిపోయి ఎంతో ఉల్లాసంగా, ఉత్సాహంగా ఉండే వారు. అదొక వెర్రిఉత్సాహం అనేదాన్ని నేను.

ప్రొద్దున్నే మీరు లేచి వెళ్ళి చేసివచ్చిందేమిటో చెప్ప మని ఆయన్ను తరచు అడుగుతుండేదాన్ని. అప్పుడాయన ఏవేవో అబద్ధాలన్నీ అల్లి - ఉన్నవీ- లేనివీ కల్పించి ఏవేవో పనులుచేసివచ్చానని చెప్పేవారు. ఆయనమాటలు విని, నేను

పొట్టచెక్కలు నవ్వుతునేదాన్ని. ఈ కల్ల - బొల్లికి బుర్రెంగుకు - ఉన్నవిషయం చెప్పండి - అని నేను మధ్యమధ్య బలవంతం చేస్తుండేదాన్ని. అప్పు డాయన గంభీరంగాముఖంపెట్టి వాస్తవంగా ఉన్నవిషయా లుమాత్రమే చెప్పేవారు. అప్పు డాయన చూపులూ, కంఠస్వరం - నా కెంతో కుతూహలం కలిగించేవి. అలాగే ఆయన్నుచూస్తే ఆమాటలువింటూ కూచుండిపోయేదాన్ని - 'సరేకాని, ఇప్పుడు నే నేమిటి చెపుతున్నాను ?'- అని ఆయన ముచ్చటచెప్తూ, మరిచిపోయినట్లు మధ్యమధ్య ఇలా ఎన్నోతడవలు అడిగేవారు. అయినా నేను సమాధానంచెప్పకుండా ఊరుకునేదాన్ని. అప్పట్లో మా స్వంతవిషయాలుతప్ప లోకంలో మరేవిషయాలు నాకు పట్టట్లుండేది. మరేవిషయాలనుగురించి మావారితో మాట్లాడాలన్నా నాకు విసుగ్గాకూడా ఉండేది. కాని ఆతరువాత రానురాను మా వారు పడుతున్న శ్రమలూ, ఆయన బాధ్యతలూ తెలుసుకోవాలన్న ఆసక్తికలిగింది. ఆయన్ను అర్థంచేసుకుంటూవచ్చాను.

మధ్యాహ్నం భోజనాలవేళదాకా మా అత్తగారు కనుపించేవారేకాదు. ప్రొద్దుటిపూట టీకూడా ఆమె ఒంటరిగా తాగేది. తరువాత ఏ పనిమనిషిచేతనో మాకు కబురుపంపించేది. రాత్రి మాకు సుఖంగా నిద్రపట్టిందీలేనిదీ అడిగిరమ్మనేది. పిచ్చిప్రేమతో ఆమె ఈ విచారణలన్నీచేస్తుంటే చూచి, అప్పుడప్పుడు నాలో నేను నవ్వుకునేదాన్ని. దాసీది మాదగ్గరికివచ్చి చేతులుకట్టుకుని నిలుచునేది - 'చిన్నమ్మగారూ ! పెద్దమ్మగారు అడిగిరమ్మన్నారు. నిన్నరాత్రి మీకు బాగా

స్త్రవపట్టించా? ఆమెగారి ప్రాణమంతా కంటిమీద కునుకే లేదట! డొక్కల్లో కలుక్కుపుట్టి ఉంటోంది, చుక్కలు ఒకటేమైన అరచడంవల్ల పొట్టంతా తినుకోలు — కన్ను మూయనేలేదట. మీతో చెప్పమన్నది ఏమిటో తెలుసా గారూ! పోతే, ఇవాళ పొద్దున చేసిన రొట్టె ఎలాఉందో కూడా అడగరమ్మన్నా రమ్మా. రోజూ తానే రొట్టె కాల్చేవాడనీ, ఇవాళ మాత్రం నికోలమ్మక్క తయారుచేశారని - రొట్టెలు చేయడం అతను ఇప్పుడిప్పుడే నేర్చుకుంటున్నాడనీ చెప్పమన్నారు - అయినా రొట్టె చెడిపోలేదటలెండి బిస్కెట్లు ఎక్కువగా తయారుచేయించారట! — మీ అభిప్రాయంవిమిటో కనుక్కోనిరమ్మన్నారమ్మా' - అని గుక్కతిప్పకుండా ఏకరువు పెట్టేది.

భోజనాలవేళదాకా ఆమె నేనూ కొంచెం మాట్లాడుకోడానికి వీలుచిక్కేది నేను చదువుకుంటూనో, పాటలుపాడుకుంటూనో గడిపేదాన్ని. మావారు రాసుకుంటూ కూచోడమో, లేక మళ్ళీ బయటకి వెళ్ళిపోవడమో చేసేవారు. భోజనాలయినతరవాత,నాలుగుగంటలప్పుడు మేం డ్రాయింగ్ రూంలోకి వెళ్ళి కూచునేవాళ్ళం. మా అత్తగారు తనగదిలోంచి ఊడిపడేవారు. ఆ వాడకట్టునఉండే గొప్పకుటుంబాలకు చెందిన ఆడవారంతా అక్కడ పోగయ్యేవారు. వారంతా తరచు మా ఇంటికి వచ్చి పోతుండేవారే. వెనకటినుంచీ వస్తున్న అలవాటుప్రకారం మావారు ఎదురువెళ్ళి మా అత్తగారిని చెయ్యిపట్టుకొని తీసుకొచ్చేవారు. కాని నేను కాపురానికివెళ్ళినతరువాత - 'నా కోడలే నన్ను చెయ్యి

పట్టును తీసుకుపోవాలి!'—అని మా అత్తగారు పంతంపట్టారు సరే, తప్పేదేముంది? నేనే వెళ్ళి ఆమెను చెయ్యిపట్టుకు తీసుక వచ్చేదాన్ని. తరువాత ఫలహారాలకు కూచునేవాళ్ళం. ఆ చిన్నసమావేశానికి మా అత్తగారే అధ్యక్షురాలు! ఈసమయంలో ఒక గమ్మత్తుకూడా జరిగేది. అలవాటుప్రకారం మావారుకూడా అత్తగారిని తీసుకురావడానికి ఎదురువచ్చేవారు. ఒకవైపునుంచి నేనూ వెళ్ళేదాన్ని. ఒకొక్కప్పుడు ఆ తొందరలో మాఇద్దరిచేతులూ కలిసేవి. అయినా నేనూ ఒకరికొకరం తారసిల్లేవాళ్ళం. నాకు చచ్చేసిగ్గువేసేది. సరే, తరువాత ఫలహారాలప్పుడు ఎన్నెన్నో కబుర్లుకొ సనాగేవి నేనూ మావారూకూడా ముచ్చట్లుచెప్పుకునేవాళ్ళం. ఇహ తల్లీ - కొడుకులమధ్య చిన్నచిన్న వాదనలుకూడా చెలరేగేవి. తల్లిచెప్పింది కొడుకు కాదనడం, కొడుకు చెప్పింది తల్లి ఒప్పుకోకపోవడం - ఇలా ఎంతో సరదాగాఉండేది. ఈవిధంగా ఫలహారాలు అయిపోయినతరువాతమా అత్తగారు హాలులోకి వెళ్ళిపోయేవారు; అక్కడొక పెద్ద పడకకుర్చీలో వాలిపోయేవారు అలా పడుకుని నశ్యం తయారుచేసుకోడమో, లేకపోతే కొత్తపుస్తకాల్లో అంటుకున్న కాగితాలు కత్తిరిస్తూఉండడమో చేసేవారు. ఇహ నేనూ, మావారూ బిగ్గరగా చదువుకునేవాళ్ళం. లేదా గదిలోకివెళ్ళి పియానో వాయిస్తూ పాటలుపాడుకునేవాళ్ళం. సాయంత్రపువేళల్లో పాటలుపాడుకోవడమే నాకెంతో సరదాగాఉండేది. రోజూ ఒక కొత్తపాట నేర్చుకునేదాన్ని. ఆయనకు ఇష్టమైనపాట వాయిస్తుంటే గదిలో అవతలకొసనఉన్న పడక కుర్చీలో

వెళ్ళి పడుకునేవారు నాకు కనుపించకుండా తనలో తానే ముసిముసినవ్వులు నవ్వుకుంటూ సంతోషించేవారు. నా సంగీతానికి తను సంతోషిస్తున్నట్లుగా నాకు తెలీకుండా ఉండాలనే ఆయన తాపత్రయమంతా. అయితే నేనేం తక్కువదాన్నా? చూడకుండా ఉన్నట్లే ఉండి హఠాత్తుగా పియానో దగ్గరనుంచి లేచి ఆయనవైపుకు పరుగెత్తేదాన్ని. ఆయన ఎంత ఉత్సాహంగా, ఉద్రేకంగా ఉన్నదీ కళ్ళారా చూచేదాన్ని తనసంతోషమంతా కప్పిపుచ్చుకోడానికి ఆయన విశ్వప్రయత్నంచేసేవారు. నానాతంటాలుపడేవారు. అన్నీ నేను కనిపెడుతూ నేఉండేదాన్ని.

మే మిలా గదిలో ఉండగా మేం ఏం చేస్తున్నామో చూడాలనుకునేది మా అత్తగారు. అలా చూడడానికివస్తే మా ఆనందానికి భంగంకలుగుతుందేమోఅని భయపడేవారు కూడా. అయినా ఒకొక్కప్పుడు ఏదో పనిఉన్నట్లు ఎకాఎకి మాగదిలోనుంచి లోనికివెళ్ళేది ఒకవేళ ఏదైనా పని ఉందేమో అనుకునేదాన్ని నేనూ. కాని ఆమెగారు అలా లోనికివెళ్ళినట్లు వెళ్ళి మళ్ళీ అంతలోనే తిరిగివచ్చేది.

ఇహ రాత్రిళ్ళు పడుకోబోయేముందు ఇంట్లో వాళ్ళమంతా మళ్ళీ డ్రాయింగ్‌రూంలో పోగయ్యేవాళ్ళం. నేనే అందరికీ టీలు అందించేదాన్ని. అంత పెద్ద టీపాత్రలోనుంచి వేసివేసి టీ కప్పులనిండా పోయడం - అక్కడున్నవారందరికీ జాగ్రత్తగా అందించడం - నిజంగా నాకు కష్టంగా నేఉండేది. అలవాటులేని పని అవడంవల్ల ఎక్కడ ఒలికిపోతాయోఅని

భయపడేదాన్ని. చేతులు వణికిపోయేవి. అయినా నిభాయించు కుని – అందరినీ పేరుపేరునా పిలిచి – 'మీకు పంచదార సరి పోయిందా ?'– మరికొంచం డికాక్షన్ కావాలా ?'– అని అడిగేదాన్ని. అదివిని మావారు – 'ఓ ! అద్భుతం ! ఇం కేం ? పెద్దదాననయిపోయావు, ఇహ ఇంటిపెత్తనమంతా నీదే !'– అని పరాచకమాడేవారు. నాకు సిగ్గుముంచుకొచ్చేది. ఇలా 'టీ'లు తాగడం అయినతరువాత మా అత్తగారు చీట్లపేక తీసుకొని ముక్కలు పంచుతూ మా అందరికీ అదృష్టం చెప్పేది. అలా కొంతసేపు కులాసాగా కాలక్షేపం చేసినపిదప ఆమెగారు మా అందరినీ ముద్దాడి, 'క్రాస్' చేసుకుంటూ మమ్మల్లను ఆశీర్వదించేది. తరువాత ఎవరిగదుల్లోకి వారు వెళ్ళిపడుకునే వాళ్ళం పడకగదిలో నేనూ మావారూ అర్ధరాత్రిదాకా ముచ్చట్లు చెప్పుకునేవాళ్ళం ఎంతో మధురమైనసమయం అది. ఎన్నటికీ మరపురాని తరుణమది. తన గతజీవితాన్ని గురించి చెప్పేవారు మావారు. మా భవిష్యత్తువిషయమై మేము ఎన్నెన్నో ఊహించుకునేవాళ్ళం. ఒక్కొక్కప్పుడు మేము వేదాంతవిషయాలు చర్చించుకునే వాళ్ళం. మేడమీద పడుకున్న మా అత్తగారికి మా మాటలు వినిపిస్తే ఇంత రాత్రిదాకా మేల్కొన్నారా అని కోపిస్తుందేమోనని మెల్లగా నింపాదిగా మాట్లాడుకునేవాళ్ళం. ఒక్కోనాడు ఒకరాత్రి వేళప్పుడు మాకు విపరీతంగా ఆకలివేసేది. చప్పుడు కాకుండా వంటింట్లోకి వెళ్ళి, మరునటిరోజుకని చేసిపెట్టిన రొట్టెలు, బిస్కట్లు తీసుకొచ్చుకుని గదిలో గుడ్డిదీపం వెలుతురున కూచుని మేమిద్దరం కడుపునిండా మెక్కేవాళ్ళం !

ఆ లంకంతలోగిట్లో నేనూ మాంవారూ ఎవరోపరాయి వాళ్ళలాగా మసలేవాళ్ళం. తరతరాలనాడు కట్టిన ఆ ఇంట్లో ప్రతిమూలా మా అత్తగారిప్రభావం ఏదో గోచరిస్తుండేది. ఆ పూర్వకాలపు వస్తువులూ, రకరకాల సామానులు చూస్తుంటే, నా కేదోలోకంలో ఉన్నట్లనిపించేది. ఏదో చెప్పలేని అభిమానం, భక్తి- శ్రద్ధలూ పుట్టుకొచ్చేవి ఎంత ప్రతిష్టగలఇల్లు ఇది! ఇక్కడ ఉండడానికి మేము తగం – అను కునేదాన్ని. నేనూ, మాంవారూకూడా ఎంతో జాగ్రత్తగా, ఒళ్లుదగ్గరపెట్టుకుని మసలేవాళ్ళం.

మా మనస్సుల్లో ఇలాంటిభావం ఏర్పడ్డంవల్ల-ఇంట్లో ఇహ ఏవిషయాన్నీ మేం పట్టించుకునేవాళ్ళంకాదు. నౌకర్లు, దాసీలూ- పనిచేసినా చెయ్యకపోయినా, నిర్లక్ష్యంగా ప్రవ ర్తిస్తున్నా, అధికప్రసంగాలుచేస్తున్నా – మేం పల్లెత్తుమాట అనేవాళ్ళంకాదు అదేమని అడిగేవాళ్ళంకాదు ఇలాఉండ డంవల్లనే మాంవారూ నేనూ మరింత సన్నిహితులమయ్యాం. మాంవారుకూడా నౌకర్లను ఒక్కమాట అనేవారుకాదు. అసలు కోపంవచ్చినట్లే ఆయన కనపడరు. ఒకవేళ చూడ కూడని విషయం చూస్తున్నా, వినకూడనివిషయం వింటున్నా ఆయన కళ్ళూ, చెవులూ రెండూ మూసుకునేవారు. మా అత్తగారికి ఖుద్దు నౌకరు డిమిట్రీ,సిడరోవ్ అనేఅతనుఉండే వాడు. అతనికి చుట్టపిచ్చి బహుజాస్తి. ప్రతిరోజూ నేనూ మాంవారూ భోజనాలయినతరువాత పడకగదిలోకి వెళ్ళి కూచోగానే, అతగాడు మాంవారిగదిలో ప్రవేశించి, డ్రాయ రులోఉన్న పొగాకు దొంగిలించుకపోయేవాడు. అప్పుడు

మావారు చప్పుడుకాకుండా, పిల్లిలాగా, మునివేళ్ళమీద నడుస్తూ కిటికీదగ్గరికి వెళ్ళి, వాడుచేసే దొంగపనంతా చూచేవారు. సైగచేసి నన్ను పిలిచేవారు- 'చూడు, చూడు! ఈ దొంగ వెధవ ఏం చేస్తున్నాడో!'- అని చూపుడు వ్రేలితో నాకు చూపేవారు. మేం కనిపెడుతున్నామన్నసంగతి తెలియక డిమిత్రీ తన దొంగపనిలో తాను మునిగిపోయి ఉండేవాడు. ఇలా తనపనికాస్తా ముగించుకొని అతను, ఎవరూ చూడలేదని సంతోషిస్తూ ఇవతలికి వచ్చేవాడు. నన్నుచూచి 'చిన్నమ్మ గారూ! మీరంటే నా కెంతో ముద్దు!'- అని వెళ్ళిపోయే వాడు దొంగవెధవ. కాని ఒక్కొక్కప్పుడు అతను చేసిన దొంగతనం చల్లగాచేసి, ఏమీఎరుగని నంగనాచిలా ముఖం పెట్టి తనత్రోవను తాను వెళ్ళిపోయేవాడు. అప్పుడు నాకు వళ్ళుమండుకొచ్చేది చెప్పొద్దూ! కాని మళ్ళీ అంతలోనే 'పిరికివెధవ! చేసినపని ధైర్యంగా చెప్పుకోలేడు!'- అనుకునే దాన్ని. 'పోనీలే, పాపం!'- అని అతనిపై జాలితలచేదాన్ని.

'ఏమండీ! ఇంట్లో నౌకర్లు ఇలా దొంగపనులుచేస్తుంటే చూచీచూడనట్లు ఊరుకుంటారేం? కాస్త అదుపాజ్ఞల్లో పెట్ట కూడదటండీ?'- అని మావారిని ఒకమాటు అడిగాను.

'నీ కేం తెలుసునే పిచ్చిపిల్లా! నే నెంత సంతోషంగా ఉంటున్నానో నీ కేం తెలుసు? ఇలాంటి సుఖసమయంలో నేను ఒకరిమీద కోపం తెచ్చుకోగలనా? నావల్లగాదు. నౌకరు పాగాకు దొంగిలించాడు, అంతేకదా. దొంగిలిస్తే దొంగిలించనీ! వాణ్ణిచూచి మనం జాలిపడాలి. అంతే!'- అని సమాధానం చెప్పేవా రాయన.

ఆయన చెప్పింది నిజమేనని నమ్మాను. కాని ఆయన్ను పూర్తిగా అర్థంచేసుకోలేకపోయాను. అయినా ఎందుకో నాకు హాయిగా, ఆనందంగా ఉంటున్నది. అవును, ఆనందంలో అనేకరకాలు.

ఇలా రెండుమాసాలు గడిచాయి. శీతాకాలం వచ్చింది. చచ్చేచలీ, ఈదురుగాలి. మంచుకురుస్తోంది. మావారు నాదగ్గరే ఉంటున్నారు. అయినా నాకు ఎందుకో ఒంటరిగా ఉంటున్నట్లనిపిస్తోంది. బ్రతుకు భారంగా తోస్తున్నది చేసిందే చేస్తున్నాం. జరిగిన విషయాలే మళ్ళీ మళ్ళీ జరిగిపోతున్నాయి. మాజీవితాల్లో మార్పులేదు. కొత్తదనమేమీ కనుపించడంలేదు రానురాను ఆయనవ్యవహారాల్లో ఆయన మునిగిపోతూవచ్చారు. అంతకంతకూ దూరమైపోతున్నారు. తనేమో తనవ్యవహారాలేమో! క్షణం తీరికలేదు. అందువల్ల మళ్ళీ నాలో వెనుకటి అభిప్రాయం మొలకెత్తింది. ఆయనలోకంలో ఆయన ఉంటున్నారు. ఆలోకంలో నన్ను అడుగుపెట్టనివ్వడంలేదు - అని బాధపడసాగాను.

తనవిషయం తను చూచుకుంటూ, నావిషయమే పట్టించుకోకపోవడంవల్ల నాకు అంతకంతకూ కోపంవస్తోంది. వెనక ఎలా ప్రేమించానో, ఇప్పుడూ ఆయన్ను అలాగే ప్రేమిస్తున్నాను. ఆ ప్రేమలో అంతటిసుఖమూ అనుభవిస్తున్నాను కాని నా ప్రేమఉన్నదే - ఇహ అంతటితో ఆగిపోయింది. కాస్తన్నా ఎక్కువకావడంలేదు. అలా స్తంభించిపోవడమే నాకు దుర్భరంగాఉంది.

ఇలా ఓమూల కూచుని ప్రశాంతంగా జీవితం గడపడం నా కిష్టం లేదు. నేను కోరింది అది కానేకాదు. జీవితం పొంగులెత్తాలి. ఎన్నెన్నో ఒడుదుడుకులూ ప్రమాదాలు ఎదురుపడాలి ఆ పొంగులో, ఆ ప్రమాదంలో ఆత్మ ఆహుతి అయిపోవాలి. అదీ నే కోరేది. అంతేకాని, ఇలా చల్లగా ఆలోచిస్తూ కూచోడం కాదు. నాలో ఏదో ప్రబలమైనశక్తి పెరిగివస్తోంది. నన్ను ఊపిరాడకుండా చేస్తోంది. నాలో ఏదో తుఫాను – విషవిషాదభరితమైన తుఫాను వీస్తోంది. అది ఆయనకు కనపడకుండా ఉండాలని ప్రయత్నిస్తూవచ్చాను. కాని తట్టుకోలేకపోతున్నాను. ఏవో భయం, బాధ – తెరలు తెరలుగా 'ఫిట్సు' వస్తున్నాయి!

నా మనోవేదన అంతా ఆయన, ముందే గ్రహించాడు. ఒకమాటు మనం పట్నానికి వెళ్ళివద్దాం – అన్నారు. కాని నేను వద్దన్నాను. ప్రస్తుతం గడుపుతున్న జీవితాన్ని మార్చవద్దనీ, ఈ సుఖాన్ని ధ్వంసంచెయ్యవద్దనీ, బతిమాలుకున్నాను. నిజానికి నేను సుఖంగానే ఉన్నాను కాని, ఈసుఖం వల్ల – నాకు ఎన్నికష్టాలనయినా ఓర్చుకునేశక్తీ, ఆత్మత్యాగంచేయగల సాహసం ఉన్నప్పటికీ, అవి బహిర్గతం చేయడానికి వీలులేకుండాపోతోంది ఇవి నిరుపయోగమైపోతున్నాయి. అదే నా బాధ నేనాయన్ను ప్రేమించాను. నా సర్వస్వం ఆయనే అనుకున్నాను. కాని ఈ మా ప్రేమను అందరూ చూడాలని నా అభిలాష. నా ప్రేమకు ఎన్ని అవరోధాలు, అడ్డంకులు వచ్చినప్పటికీ ఆయన్నే ప్రేమిస్తూ ఉండాలని నా కోరిక.

నా మనస్సు పరిపరివిధాల పరుగులుతీస్తోంది నా అంతరంగంలో ఎన్నెన్నో భావాలు ముసురుకుంటున్నాయి. వీటన్నిటికన్నా యౌవనోత్సాహంలో పొంగులెత్తే భావ పరంపరలు- అవి ఏదోరూపంలో బహిర్గతంకావాలి, తప్పదు. మరి అందుకు ఈ స్తబ్ధ నిశ్శబ్దజీవితంలో ఎంతమాత్రం ఆస్కారంలేదు.

నే నా ఒక్కవిషయమే కోరుకుంటున్నట్లు, ఆయనగారు పట్నానికి వెళదామా? - అని ఎందుకడగాలి ? ఆయ నలా అడగకుండా వున్నట్లయితే బహుశా నాతప్పు నేను గ్రహించు కుని ఉండేదాన్నేమో! నేను పడే ఈ ఆవేదనంతా అర్థంలేని దనీ, నా భావాలన్నీ వివేకరహితాలనీ, నా అభిప్రాయాలు తప్పనీ, ఏ త్యాగంచేయాలని నేను ఇంతగా ప్రాకులాడు తున్నానో- అది నాకళ్ళఎదుటే ఉన్నదనీ తెలుసుకునేదా న్నేమో! పోనీ, ఆయన అయినా ఆ విషయం తెలిసేటట్లు చెప్పకూడదూ?

ఈ అశాంతినుంచీ, విషాదంనుంచీ బయటపడాలంటే ఏ బస్తీకయినా వెళ్ళి, కొన్నాళ్ళు గడిపిరావడం మంచిదన్న ఆలోచన, పదేపదే నా మనస్సులో మెదలసాగింది. మళ్ళీ ఒకవంక నేను అకారణంగా దురభిప్రాయపడుతున్నాననీ, ఆయనప్రేమకు దూరమైపోయే ఆలోచనలుచేస్తున్నాననీ, అని పించి అందుకు విచారించాను.

కాని కాలం ఆగలేదు. కొన్నాళ్ళు గడిచాయి. విప రీతంగా మంచుకురుస్తోంది. మేం అలాగే ఆ ఇంట్లో ఉంటూ వచ్చాం. ఆయనలోగానీ, నాలోగానీ,మార్పేమీలేదు. కాని

బయటిప్రపంచంలో బోలెడంత మార్పు కలుగుతోంది. అందరిలోనూ ఏవో ఉద్వేగాలు. ఎవరిబ్రతుకు వారు బ్రతుకుతున్నారు. ఎవరికష్టసుఖాల్లో వారు మునిగితేలుతున్నారు. అంతేకాని మావిషయం ఎవరికీ పట్టలేదు అసలు మేం అనే వాళ్ళం ఉన్నట్లే ఎవరూ గమనించడంలేదు! ఇది నాకు మరీ బాధగాఉంది. పూర్వపు ఆచారాలు, అలవాట్లు—ఇలాంటి వేవో మమ్మల్నందరినీ బంధించి ఒకచోటికి చేర్చాయేకాని, అంతకుతప్పించి మాలో ఎలాంటి సన్నిహితత్వం నాకు కనపించలేదు. కాలం గడిచినకొద్దీ మాలో ఒకరిపై ఒకరికిగల ప్రేమ సన్నగిల్లిపోతోంది. ప్రొద్దుటిపూట ఉల్లాసంగా ఉండే వాళ్ళం. మధ్యాహ్నం మర్యాదలతో కాలం వెళ్ళబుచ్చే వాళ్ళం ఇహ సాయంత్రంవేళ ప్రేమానురాగాలతో ప్రొద్దుపుచ్చేవాళ్ళం. రోజూ ఇదీ వరుస! 'ఆయనగారు అన్నట్లు ఒకరికి మేలుచేయడం-మేలుచేస్తూ గౌరవ-ప్రతిష్ఠలతో బ్రతకడం - ఇదీ కావలసింది. ఇందుకు ముందున్నాయిరోజులు!- అని నాలో నేను అనుకునేదాన్ని.

కాని నాకు కావలసింది ఇదికాదు. జీవితంలో ఒకానొక సమరం - సంఘర్షణ. మనభావాలే మనజీవితాన్ని నడపాలికాని, మనజీవితం మనభావాలను నడపకూడదు. ఆయనతోకలిసి నేను అగాధపుటంచులదాకా ప్రయాణం చేస్తాను. 'ఇహ ఇక్కడఆగండి! ఇహ ఒక్కఅడుగు ముందుకు వేశానూ అంటే నేను అగాధంలో కూలిపోతాను. సర్వనాశనమైపోతాను'- అంటాను. అప్పుడాయన భయవిచలితుడై నన్ను గట్టిగా రెండుచేతులతో పట్టుకుంటాడు. నేను

ఉక్కిరిబిక్కిరి అయిపోతాను. తరవాత ఆయనఇష్టంవచ్చిన చోటికి నన్ను తీసుకొనివెళతాడు

ఇలాంటి పిచ్చిపిచ్చి ఆలోచనలతో నా మనస్సంతా చెడిపోయింది. నా ఆరోగ్యం దెబ్బతిన్నది. నరాలబలహీనత ఏర్పడింది. ఒకరోజు ఉదయానికి మామూలుకంటే మరీ బలహీనంగా ఉన్నాను ఆయనగారు ఎస్టేటుఆఫీసుకు వెళ్ళి అప్పుడే ఇంటికివచ్చారు. మనిషి చాలా చిరాకుగా, విసుగ్గా ఉన్నాడు. అలా ఎన్నడూఉండరు. ఏమిటబ్బా! యివాళ ఇలా ఉన్నారని నేను తక్షణమే గ్రహించేశాను. - 'ఎందుకండీ అలా ఉన్నారు?- ఏంజరిగిందీ?'- అని అడిగాను కాని ఆయన సరిగ్గా సమాధానం చెప్పలేదు- 'ఆఁ; అదేమంత పెద్దవిషయం కాదులే!'- అని ఊరుకున్నారు. కాని ఆ తరువాత నాకు తెలిసింది. మావారికీ మా రైతులకుమధ్య వ్యవహారం చెడ్డదట రైతులను బెదిరించి వాళ్ళదగ్గర శిస్తులు దస్తులు ఎక్కువ వసూలుచేస్తున్నారని, మావారిపై పోలీసు యిన్స్పెక్టరు కేసుపెట్టాట్ట. కాని యిది అన్యాయం. మావారలాంటిపని చేయలేరు. పోలీసుయిన్స్పెక్టర్ కు గిట్టక ఈపని చేశాడు దీనికి మావారికి కోపంవచ్చింది. ఈగొడవంతా నాతో చెప్పడం యిష్టంలేక ఊరుకున్నారు. అదీ విషయం. కాని ఈవిషయం ఆయన నాతో చెప్పకుండా దాచిపెట్టినందుకు ఆయనమీద నాకు మరింత ఆగ్రహంవచ్చింది. ఏం? యింతజరిగితే నాతో ఒక్కముక్క ఎందుకు చెప్పకూడదూ? నే నింకా పసిపిల్లననుకున్నారా ఏమిటి? నాకూ బాధ్యత ఉందని ఆయన గ్రహించుకోకూడదూ?

ఇహ నేను ఆయనతో పలకకుండా ముఖం అవతలికి తిప్పుకున్నాను. మామూలుగా టీతాగడానికి వచ్చే మేరియాను నౌకరుద్వారా పిలిపించుకున్నాను. ఆమె నేనూ టీ తాగాం. తరువాత ఆమెను హాలులోకి తీసుకెళ్ళి కూచోబెట్టు కున్నాను ఆయన వినేట్లుగా నాకుసంబంధంలేని ఏదోవిష యాన్ని ప్రస్తావిస్తూ ఆవిడతో బిగ్గఱగా మాట్లాడడం మొదలు పెట్టాను. ఆయన మధ్యమధ్య మావంక చూస్తూ హాలులో పచార్లుచేస్తున్నారు. ఆయన చూస్తున్నకొద్దీ నేను గొంతు పెద్దదిచేశాను. ఆపుకోలేనంత నవ్వుకూడావచ్చింది. నా అవకతవకలవ్యవహారమంతా చూచి, ఆయనగారికి మరీ వళ్ళు మండినట్టుంది తనగదిలోకి వెళ్ళి దభాలున తలుపుబిగించుకు న్నారు. ఆయన అలా వెళ్ళిపోగానే నా ఆవజ్జీవాలూ కుంగి పోయినాయి. మేరియాకూడా చకితురాలయింది. 'ఏమి టన్నాను ! ఏం జరిగింది?'– అని అడిగింది. నేను జవాబుచెప్ప కుండా సోఫాలో వాలిపోయాను కన్నీళ్ళపర్యంతం అయింది నాపని.

'నేనిలా గందరగోళంచేసినందుకు ఆయన ఏమను కుంటున్నారోఏమో! ఆయనమనస్సులో ఏదో చికాకుపుట్టి ఉంటుంది. అవుతే, నాతో ఎందుకుచెప్పకూడదూ? చెబితే 'ఉష్ ఇంతేనా !' అని నేను ఎగతాళి చేస్తాననుకున్నారో ఏమో! లేక ఇంత పెద్దపెద్దవిషయాలు నా కర్థంకావని ఊరు కున్నారా? కాక విషయంచెప్పకుండా నన్ను ఉడికించాలను కున్నారా?'–అని పరిపరివిధాల తలపోశాను – 'ఒకచోట కూచుని ఇలా స్తంభించిపోయిన జీవితంగడపడం నావల్లకాదు.

ప్రతిరోజూ, ప్రతిగంటా నాజీవితం ముందుకు సాగిపోతుండాలి. ఒకసెలయేరులా జలజల ప్రవహించాలి. క్షణక్షణా ఒక కొత్తదనం పుట్టుకురావాలి. కాని ఆయన కిది గిట్టదు. స్తబ్ధంగా నిశ్శబ్దంగాఒకేచోట ఉండిపోవడమే ఆయనకిష్టం. పైగా నన్ను వెనకపడేటట్లుచేయాలని ఆయనఅభిలాష. ఈ పని ఎంతచులాగ్గా చేయగలుగుతున్నారు! ఇందుకోసం నన్ను బస్తీకి తీసుకువెళ్ళక్కర్లేదే! నాలాగే నిష్కల్మషంగాఉండి జీవితం కొనసాగించకూడదూ? తానేదో మహా నిష్కపటి అయినట్లు,సత్యసంధుడయినట్లు, నాకు శీరంగనీతులుచెపుతారు తానుమాత్రం అందులో ఒక్కటీ ఆచరించరు. ఆయనతో వచ్చినచిక్కు యిదే !'- అనుకున్నాను.

నాకు ఎక్కడలేనిదుఃఖం ముంచుకొచ్చింది. ఆయన మీద పట్టరానికోపమూ వచ్చింది. నేనుచేసిన గోలకు మనస్సు ఆందోళనపడిందికూడా. వెంటనే ఆయనదగ్గరికి వెళ్ళాను. ఆయన తనగదిలో కూచుని ఏదో రాసుకుంటు న్నారు. నా అడుగుల చప్పుడు విని ఓమాటు తలఎత్తి చూచారు. మళ్ళీతనకేమీ పట్టనట్లుతనపనిలో తాను నిమగ్న లయ్యారు. యిది నాకు మరీకష్టమనిపించింది. ఆయనసమీపానికి వెళ్ళకుండా టేబిల్ప్రక్కన నిలుచున్నాను. టేబిల్ పైన ఉన్న ఒక పుస్తకం తెరిచి కాగితాలు తిరగవేస్తూ ఉండి పోయాను. ఆయన మళ్ళీ ఒకమాటు తలఎత్తి నావంక చూచారు.

'ఏమిటి మాషా! యివాళ నీకేమన్నా పిచ్చెక్కిందా ఏమిటి!'- అన్నారు.

నేను ఆయనవంక చురచుర చూచాను - 'అక్కడ మీకేమీ ఎక్కనట్లు - నన్నడుగుతున్నారే!'- అన్నాను.

ఆయన గలడాచారు. ఒక మధుర మందహాసం చేశారు. కాని అందుకు సమాధానంగా మళ్లీ నేను చిరునవ్వు నవ్వలేకపోయాను - 'ఎందుకండీ యివాళ అలా వున్నారు?- నాతో మాటమాత్రమయినా చెప్పరేం?'- అని మళ్లీ అడిగాను.

'ఏదో చిన్న గొడవవచ్చిందిలే. అదేమంత చెప్పుకోదగ్గవిషయం కాదు... ...సరే, ఇదంతా ఎందుకూ? ఇప్పుడు చెపుతాను, విను. మన రైతులిద్దరు పట్నానికి వెళ్ళారు....'

'సరే, కానీండి. ఈవిషయం ఇందాకనే టీతాగేటప్పుడు చెప్పలేదూ!'- అని ఆయన చెపుతుంటే మధ్యలో ఆపి అడిగాను.

'అప్పుడు నేను కోపంలోఉన్నాను. వళ్ళుతెలీక ఏం మాట్లాడతానో అని చెప్పలేదు'- అన్నా రాయన.

'కాని అప్పుడే ఈవిషయం తెలుసుకోవాలని అభిలాషపడ్డాను'-

'ఏం? - ఎందుకూ?'-

'ఎందుకా—నేను మీ కేవిధంగానూ సహాయం చేయలేని వ్యర్థురాలనని మీ రనుకుంటున్నారు-అందుకూ!'-

'అదేమిటి మాటా !' అంటూ ఆయన చేతిలోకలం బల్లమీద పెట్టారు - 'ఎన్నడైనా నేను ఆమాట అన్నానా! నీవులేంది ఒక్కక్షణం జీవించలేనని నా అభిప్రాయం. ప్రతివిషయంలోనూనీవునాకు సహాయపడమేకాదు. ప్రతిపనీ నాకు

నీవే చేసిపెడుతున్నావు అలాంటప్పుడు ఈఅభిప్రాయం నీ కెలా కలిగింది పూషా?'- అంటూ ఆయన నవ్వారు.

'నేను నీకోసమే జీవిస్తున్నానంటేనమ్ము. నీవు నాసమీ ఫంలో ఉండబట్టే నే నింతహాయిగా, ఆనందంగా ఉండగలు గుతున్నాను. సరేనా...?'

'అవును. నేను చిన్నపిల్లనని నాకు తెలుసు. నోరుమూ సుకొని పడిఉండాలనీ తెలుసు'—అన్నాను ఆవేశంతో. నా గొంతు బొంగురుపోయింది. ఆయన చకితుడై నావంక చూచారు. నే నెలాంటిఅవస్థలోఉన్నానోతొలిసారిగాగ్రహిం చారు. తదేకంగా చూడసాగారు - 'కాని నేను నోరునొక్కు కుని కూచోలేను. అది నాచేతకాదు. మీాకూ ఆపని చేతన య్యేది'—అన్నాను మళ్ళీ

'సరే — ఇంతకూ ఇప్పుడుచెప్పింది విన్నావుగా. కోపంలోఉన్నందునఅప్పుడుచెప్పలేదు'-అంటూగబగబచెప్ప సాగారు నేనింకా ఎక్కడ గోలచేస్తానో అని భయపడిపోయి.

'ఆవిషయాలన్నీ మీా రిప్పుడు నాకు చెప్పక్కర్లేదు.' ఆయనచెప్పేది వినాలని లోన ఉన్నప్పటికీ—ఎందుకో ఉండ బట్టలేక దురుసుగా అనేశాను.—'నేను జీవితంతో చెర్లాట లాడ దలుచుకోలేదు. జీవించతలచుకున్నాను. మీా రెలాజీవి స్తున్నారో అలాగే—అంతే.'—

నామాటలు వింటున్నకొద్దీ క్షణక్షణం ఆయన ముఖ కవళికలు మారిపోతూవచ్చాయి. ఎక్కడలేనిబాధ ఆయనలో దృగ్గోచరమయింది. ఒక్కక్షణం నిశ్శబ్దంగా ఉన్నారు.

'అవును. నీవూ నాతో సరిసమానంగా బతకాలను కుంటున్నావు – అవునా?'– అని అడిగారు–' వెధవ పోలీసులతోటీ, తాగుబోతు రైతులతోటీ గొడవలు పడేవాణ్ణి నేనుకాని నీవుకాదుగా?' అన్నారు

'కాదు. ఈ ఒక్క విషయంలో నేకాదు నేను అనేది.' అన్నాను

'నీకు పుణ్యం వుంటుంది. నన్ను అర్థంచేసుకుని మాట్లాడు మాషా. మనజీవితంలో గొడవలురావడం భరించరానివిషయం. నాకు తెలుసు. కాని,ఏంచెయ్యను?జీవితమంటే ఏమిటో నేను అనుభవించిచూచాను మాషా! అది నాకు తెలుసు. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీకే కష్టం రాకుండా చూడడమే నా ఆశయం. నా జీవితం నీ ప్రేమతో పెనవేసుకొని వుంది మాషా. దీన్ని నీవు త్రుంచెయ్యకు. నా బతుకును వేరుచెయ్యకు. నీకు పుణ్యంవుంటుంది'–

'మీరెప్పుడూ సక్రమంగానే ఉంటారు. మీతప్పేమీ ఉండదు.'– ఆయనవంక చూడకుండా బిగ్గరగా అనేశాను. ఆయనగారి కోపమంతా చల్లారిపోయింది. నాకేమో విసుగు పుట్టింది. ఏదో పశ్చాత్తాపంతో పరితపించిపోతున్నాను.

'ఏమిటి మాషా! నీవు మరీ ఇలా మాట్లాడుతున్నావు! నేను సక్రమంగా ఉంటున్నానా లేక నీవు సక్రమంగా ఉంటున్నావా అన్నదికాదు ఇప్పుడు సమస్య. ఇప్పుడు నేనుచెప్పేది వేరేవిషయం. ముందు నాకోవిషయం చెప్పు? ఇప్పుడు నేను చేసిన తప్పేమిటి? నామీద నీకెందు కింత కోపం? నీ మనస్సులో ఉన్నదంతా దాచకుండా చెప్పు మాషా. నాపై నీ

కింతకోపం రావటానికి ఏదో ప్రబలమైన కారణం ఉంటే ఉండ వచ్చు. కాని అదేమిటో నాకు తెలియాలిగా? కనుక చెప్పు మాషా'- అని అడిగారు ఆయన.

కాని నాఆత్మలో ఉన్నవిషయం నే నెలా ఆయనకు చెప్పడం? న న్నాక్షణంలో ఆయన అర్థంచేసుకున్నారు, చేసుకుంటారు. మరి నాకు అంత తెలివిలేదు. ఆయన ఎదుట నే నొక చంటిపిల్లలా అయిపోయాను. నేనుచెయ్యగలిగింది. లేదు. ఆయనకు చెప్పేసామర్థ్యం అంతకన్నా లేదు.నాపరిస్థితి మరీ అయోమయమైపోయింది. ఏం మాట్లాడుతున్నానో నాకే తెలియలేదు.

'మీామీాద నేనేమీా తప్పులుచెప్పడంలేదండీ. ఏవిష యమన్నాసరే - ఊరకనే నాకు విసుగుపుట్టిపోతోంది. అలా విసుగెత్తకుండా ఉండాలని నాకోరిక. కాని ఏం చేసేది? ... మిమ్మల్ని అడిగితే -అది అంతే అన్నారు. అవును. అక్కడ కూడా మీారు సక్రమంగానే మాట్లాడారు'- అన్నాను నేను. ఆయనవంక చూడకుండా అనదలుచుకున్నమాట అనేశాను. దాంతో ఆయన మళ్ళీ బెదిపోయారు. ఆయనముఖంలో, తీవ్రమైనబాధ, భయం గోచరించాయి.

'మాషా!'- అన్నారు మెల్లగా, కలవరంతో- 'ఇదే మీా తమాషాకాదు. నిర్ధారణచేసుకుంటే మన విధికృతం ఏమిటో ఇప్పుడే తేల్చివేసేవిషయంగా కనుపిస్తోంది ఇది. నామాటకు ఎదురుజవాబులు చెప్పకు. ప్రశాంతంగా నేచెప్పేదివిను.ఆవేళ పడకు మాషా, నీకు పుణ్యముంటుంది. ఎందుకు న న్నిలా హింసిస్తావు?'- అన్నారు.

కాని నేను ఊరుకోలేదు. ఎదురుజవాబు చెప్పనే చెప్పాను.- 'నాకు తెలుసునండీ- మీరెప్పుడూ మంచివారే. ఇంకా ఎందుకు చెప్పడం ? ఎలాగైనా మీరు మంచి వారని ఋజువుపర్చుకోడానికే ఈప్రయత్నమంతా. మీరిలాంటివారని నాకు ముందే తెలుసు.'- అన్నాను; దురుద్దేశం మనసులో పెట్టుకునే ఇలా సూటిపోటిమాట లన్నాను, చెప్పొద్దూ.

'నీవు చేసేదేమిటో నీకు తెలుస్తున్నదా మాలా!' అన్నా రాయన, మళ్ళీ కంపితస్వరంతో.

నేను గుండెపగిలినట్లు బావురుమని ఏడ్చాను. అప్పుడు నాకేదో బరువు దించినట్లయింది. ఆయన నాప్రక్కనే కూచున్నారు. ఏమీ మాట్లాడలేదు. ఆయన పై నాకు జాలి వేసింది. నేను చేసనపనికి సిగ్గుపడ్డాను. ఎందుకింత పాడుపని చేశాను - అని లోలోపల పశ్చాత్తపించాను. ఆయనవంక చూడడానికి ముఖంచెల్లలేదు. ఆయన నావంకే చూస్తున్నారనీ, కలవరంతో, బాధతో కూడిన ఆచూపులకు నేను తాళలేననీ అనుకున్నాను. వెంటనే తలఎత్తి చూచాను. ప్రసన్నము ప్రేమపూరితము అయిన ఆయనచూపు నామీదనిలచిఉంది. ఆచూపు నన్ను క్షమాభిక్ష వేడుకుంటున్నట్టున్నది. నేను వారిచెయ్యి పట్టుకున్నాను. 'నన్ను క్షమించండి! నే నేం చెప్పానో, ఏం చేశానో నాకే తెలియదు. నన్ను క్షమించరూ?'- అన్నాను నాఅంతట నేనే.

'నాకు తెలుసు మాలా, ఇందులో నీ తప్పేమీ లేదు. నీవు నిజమే చెప్పావు'- అన్నా రాయన.

'అంటే ఏమిటి మీ ఉద్దేశం?'-అని అడిగాను.

'ఏం లేదు. మనం పీటర్సుబర్గు వెళదాం. ఇప్పుడిక్కడ మనకు ముంచుకుపోయేపనులేమీ లేవు'- అన్నారు.

'మీ ఇష్టం' అన్నాను నేను.

ఆయన నన్ను దగ్గరికితీసుకుని ముద్దాడారు. 'నన్ను క్షమించు మాషా! తప్పంతా నాదే!'- అన్నారు, మెల్లగా.

ఆసాయంత్రం చాలాసేపు ఆయనా నేనూ ఆటపాటలతో గడిపాం. ఆయన గదిలో అటూఇటూ పచారుచేశారు. తనలోతానే ఏదో మాట్లాడుకున్నారు. ఆయన కది ఒకఅలవాటు. ఏమిటండీ, మీలోమీరే మాట్లాడుకుంటున్నారు?'- అని నేను తరచు అడుగుతుండేదాన్ని. ఆయన కాసేపు ఆలోచించి-ఏదో పద్యాలు పాడుకుంటున్నాను, అని చెప్పేవారు. ఒక్కొక్కప్పుడు ఇంకా ఏదో పనికిమాలిన సంగతులు, చెప్పేవారు.

ఆసాయంత్రంకూడా ఆయన తనలోతాను ఏదోగొణుక్కుంటూఉంటే, ఏమిటండీ నాకుచెప్పరూ?- అని అడిగాను అప్పు డాయన పచార్లుచెయ్యడం ఆపి - కాసేపు ఆలోచించుకున్నారు. చిరునవ్వునవ్వారు. తరువాత కవి లెర్మొంటావ్ రచించినపాటలో రెండుపంక్తులు చదివి నాకు వినిపించారు.

'అతను ఎంత అవివేకి-పెనుతుఫాను రావాలని దేవుని ప్రార్థిస్తాడు! పెనుతుఫానులోనే తనప్రశాంతిని దర్శిస్తాడు!!'

'కాదు. ఆయన మామూలుమనిషి కాదు. ఆయనకు సర్వం తెలుసు.'- అనుకున్నాను నాలోనేను- 'ఆయన్ను ప్రేమించకుండా ఎలాఉండగలను?'- అనుకున్నాను.

నేను గభాలున లేచి ఆయన చెయ్యి పుచ్చుకున్నాను. ఆయనతోపాటు గదిలో పచార్లు చెయ్యడం మొదలుపెట్టాను.

'ఇప్పుడైనా హాయిగా ఉన్నావా?'- అని అడిగా రాయన, చిరునవ్వుతో నావంక చూచి.

'ఎంతో హాయిగా ఉందండీ'- అని చెప్పాను నేను మెల్లగా.

ఆ క్షణాలలో ఏదో చెప్పరాని ఆనందం పొంగి మా ఇద్దరినీ ముంచివేసింది. ఒకరినొకరం చూచుకున్నాం. నవ్వుకున్నాం. చెట్టపట్టాలు పట్టుకుని గబగబ నడవసాగాం. మేమలా వెళుతుంటే, మా అత్తగారు, వంటమనిషీ-ఇదేమిటన్నట్లు ఇలాకపోయి చూడడం మొదలుపెట్టారు. ఆఖరుకు ఏదో కొంపమునిగిందన్నట్లు మా అత్తగారు, మా వెనకాలే పరిగెత్తుకుంటూ వచ్చారు.

మేము గదులన్నీ దాటేసి భోజనశాల దగ్గరికి వెళ్ళాం. అక్కడ ఆగాం. ఒకరినొకరం చూచుకొని పొట్టలుబ్బేటట్లు నవ్వుకున్నాం.

ఆతరువాత పదిహేనురోజులకు - అంటే క్రిస్టమస్ పండుగకు ముందుగా మేం పీటర్సుబర్గులో ఉన్నాం.

## 7

మేం ప్రయాణంచేశాం. పీటర్సుబర్గు వెళ్ళాం. అక్కడనుంచి మాస్కో వెళ్ళాం. వారంరోజులు ఉన్నాం. మా వారి చుట్టాలందరిని చూచాం. కొత్తభవనంలో బస

చేశాం. బాటలు, పేటలు, నగరదృశ్యాలు, కొత్తకొత్త మనుషులు- ఎన్నెనో చూచాం. ఇదంతా స్వప్నంలా గడిచి పోయింది. ఇవన్నీ మాకెంతో కొత్తగా ఉన్నాయి. మావారూ, నేనూకూడా ఎంతోఉల్లాసంగా, ఎంతోహాయిగా ఉన్నాం. పట్నాలలో వింతలూ, విశేషాలూ చూస్తూఉంటే నా మనోఫలకంపై చిత్రవిచిత్రభావనలు మొలకెత్తాయి. లోకంలో ప్రతిదీ జీవకళతో ఉట్టిపడుతున్నట్లు కనుపించింది. అవన్నీ చూచినతరువాత ఇంతకాలం మేం పల్లెటూళ్ళో గడిపిన జీవితం వ్యర్థమనీ, సారంలేనిదనీ అనిపించింది.

పట్నాల్లో ఉండేవారంతా మహా గర్వపోతులనీ, విడ్డూరంగా ప్రవర్తిస్తారనీ అంతకుముందు నే ననుకునేదాన్ని. కాని తీరా వెళ్ళి చూచినతరువాత ఆశ్చర్యంవేసింది. నేను వెళ్ళిన చోటల్లా వాళ్ళు నన్ను ఎంతో నిష్కపటమైనప్రేమతో, అభిమానంతో ఆదరించారు. మాకు చుట్టాలేకాదు, మాకు అపరిచితులుకూడా అలాగే ప్రవర్తించారు. నేను వారికి ఎంతో ఆప్తురాలనయినట్లూ, ఎన్నాళ్ళబట్టో నా రాకకోసం వేచిఉన్నట్లూ సంచరించారు. వాళ్ళ మర్యాద, మంచితనం నా కెంతో నచ్చాయి. వారిలో కొందరు మావారికి కావలసినవారు, స్నేహితులు ఉన్నారు. వారినిగురించి ఆయన ఎన్నడూ నాతో మాటమాత్రమైనా చెప్పలేదు. పైగా ఈ బస్తీలో ఉండేవారంతా కృత్రిమంగా ప్రవర్తిస్తా రనేవారు. కాని వారిని నేను కలుసుకున్నప్పుడు వాస్తవం నాకు తెలిసింది. వీ ళ్ళింత మంచివాళ్ళయితే - మావా రెందుకలా అన్నారా అనుకున్నాను. వాళ్ళతో చనువుగా మాట్లాడకుండా ముఖం

ప్పించుకునిపోతుంటే నాకు కష్టంకలిగింది. మావారికి గని గర్వం అనికూడా అనుకున్నాను. ఆయన అంతటితో ఊరుకోక - 'చూశావా మామా! ఈ జనాన్ని మనం చూచీ చూడనట్టు తప్పించుక తిరగాలి. లేకపోతే వీళ్ళతో వేగలేం సుమా! -' అనేవారు

మేం మా ఊరువదిలి బస్తీకివెళ్ళేముందు - 'చూడు మామా! ఈ పల్లెల్లో కాబట్టి మనం మహా దర్జాగా ఉంటు న్నాం. కాని పట్నంపోతే అలాకాదు. వాళ్ళడబ్బూ దర్జాల ముందు మనం ఎందుకూ కొరగాం. మనకున్న ఈ ఎస్టేట్లూ, పొలాలూ అక్కడివారి ఐశ్వర్యంముందు తీసికట్టు అనుకో. అందుకని మనం కాస్త జాగ్రత్తగా ఉండాలి. డబ్బు దుబారా చేసుకోకూడదు ఈస్టరు పండగకుముందే మళ్ళీ మనం మన ఊరువచ్చేయాలి. దర్జాలకుపోవద్దు. క్లబ్బులకూ, మీటింగు లకూ అతిగా పోవద్దు. చిక్కుల్లో పడతాం. నీ మంచికోసమే చెపుతున్నా సుమా!'- అన్నారాయన.

'క్లబ్బులూ, మీటింగులూ ఎందుకులెండి - మన చుట్టాలనుచూచి తరువాత నాటకాలకుమాత్రం వెడదాం. మంచిపాటలూ పద్యాలూవిని, నాట్యాలుచూచి మళ్ళీ ఈస్టర్ పండుగకుముందే మనఊరు వెళ్ళిపోదాం'- అన్నాను నేను.

కాని మేం పీటర్సుబర్గులో అడుగుపెట్టామోలేదో - అనుకున్న విషయాలన్నీ మరిచిపోయాం. నామటుకు నేను హఠాత్తుగా ఏదో కొత్తలోకంలో పడిపోయాను నామన స్సంతా పరవశమైపోయింది. ఎన్నెన్నో కొత్తకొత్తఊహాలు పుట్టుకొచ్చాయి. సంతోషాలు వచ్చి ముసురుకున్నాయి.

ఎక్కడలేని ఆసక్తి, ఆకాంక్ష మొలకెత్తాయి. అనుకున్నవన్నీ మరిచిపోయాను. నాకు తెలీకుండానే నగరంలోని విలాసాలకూ కులాసాలకూ లొంగిపోయాను.

'పట్టిది. నేను గడిపిన జీవితమంతా వట్టిది! నా జీవిత మింకా మొదలేకాలేదు. అసలుజీవితం ఇక్కడేఉంది!'- అనుకున్నాను నాలో నేను.

పల్లెటూళ్లో నన్ను ఆవహించుకున్న విసుగు, విషాదం, అశాంతి, ఆరాటం- అన్నీ ఇప్పుడు క్షణంలో మంత్రించినట్లు మటుమాయమైనాయి. మావారిపై నాకుగల ప్రేమ మెల్ల మెల్లగా మరింత అధికమయింది ఇహ ఆయనగారికి నాపై మోజు తగ్గిపోయిందా లేదా అన్న ఆలోచనే నాకురాలేదు. కాని అలాఅనుమానించడానికి ఎంతమాత్రం ఆస్కారంలేదు. నామనసులోఉన్న ప్రతివిషయాన్నీ ఆయన ఇట్టే అర్థంచేసుకోగలుగుతున్నారు. నేను ఏదంటే అది సరేనంటున్నారు. నాకోరికలు తీరుస్తున్నారు. నేనేకనుక కొంచెం శాంతం వహించిఉన్నట్లయితే - అసలు అలాంటి పిచ్చిపిచ్చి ఆలోచనలు నామనసులోకి వచ్చేవేకావు.ఆయన నన్ను మనసారా ప్రేమిస్తున్నారు. అంతేకాదు. నావంటిదాన్ని ఇల్లాలుగా పొందగలిగినందుకు గర్విస్తున్నారుకూడా. నే నెక్కడికన్నా వెళ్ళినా, కొత్తవారితో మాట్లాడినా, లేక ఎవరినైనా మా ఇంటికి భోజనానికి పిలిచినా - నా కెంతో భయంగాఉండేది. వాళ్ళందరికన్నా నేను అన్నివిధాలా తక్కువదాన్ని అని అనుకునేదాన్ని. వారికి మర్యాదలుచేయడానికి నాకు అర్హత లేదు. ముఖం చిన్నపుచ్చుకునేదాన్ని. కాని అలాంటిపనులన్నీ

అయిపోయినతరువాత వారు వచ్చి-'ఓహో! చాలా బాగా చేశావు. నీ వింత చలాకీగా ఉంటావని నే ననుకోలేదుసుమా. నీలో ఇంతసామర్థ్యం ఉందని నాకెన్నడూ తెలీదే! ఎక్కడి కెళ్ళినా ఇహ నీకు చలనంలేదు'-అని నన్ను మెచ్చుకునేవారు. అప్పుడు నేనెంతో మురిసిపోయేదాన్ని. మేం పట్నానికి వెళ్ళి నవెంటనే మావారు మాఅత్తగారికి ఒకఉత్తరం వ్రాశారు. నీవింకా ఏమన్నా వ్రాస్తావా అని నన్ను అడిగారు కాని తాను వ్రాసింది నన్ను చూడనివ్వలేదు :అయినా నే నూరుకోలేదు. బలవంతాన ఆ ఉత్తరం లాక్కొని చదివాను.

'అమ్మా! మనమామ్మాపా ఎలాంటిదో అసలు నీవు ఎరగవు. నీవేమిటి?-నేనే ఎరగను! ఇంతటిదర్జా, ఆత్మవిశ్వాసం, సామర్థ్యం, తెలివితేటలు ఇవన్నీ ఆవిడకు ఎలాఅబ్బాయో, నాకే అర్థంకావడంలేదు. ఇక్కడ కనుపించినవారందరితోనూ ఎంతో ఉల్లాసంగా, మర్యాదగా, మెలగుతూఉంది. ప్రతి ఒక్కరూ ఆవిడనుగురించి ఘనంగా చెప్పుకుంటున్నారు. ఆవిడంటే పడిచస్తున్నారంటే నమ్మ! నిజంగా నేను అదృష్టవంతుణ్ణి అమ్మా. 'ఆవిడను నేను ఇంకాఎక్కువగా ప్రేమించగలితేనా!...' అని ఆ జాబులో వాళ్ళమ్మగారికి వ్రాశారాయన.

'నిజంగా నేను అంతటిదాన్నా !-' అని నాలో నేను అనుకున్నాను. మురిసిపోయాను. నా కెంత హాయిగా ఆనందంగా ఉందో చెప్పలేను. ఆయన్ను మునుపటికంటె మరింత గాఢంగా ప్రేమిస్తున్నట్టనిపించింది నాకు.

అక్కడ పరిచయమైన కొత్తవారందరితోనూ ఎంత చాకచక్యంతో మెలిగానో - తలుచుకుంటే నాకే ఆశ్చర్యం

వేస్తుంది. పైగా మరోచిత్రం! నేనంటే మా వారు ప్రాణాలు విడుస్తారనీ నన్నువదలి ఒక్కక్షణం ఉండలేరనీ అక్కడి వారంతా గోలగా చెప్పుకోసాగారు. ఒక పెద్దమనిషి నన్ను ముఖాన్నే అనేశారు. – 'మీలాంటి అందగత్తె మా పీటర్సు బర్గు నగరంలోనే లేదండీ. ఇక్కడ సమాజంలో ఉన్న ఆడవారంతా మీచుట్టూ బలాదూరు' అన్నాడా పెద్ద మనిషి. ఇహ మావారికి చుట్టం ఒకావిడ ఉంది ఆవిడ శ్రీమంతురాలు – రాకుమారి, పేరు దీనా. అక్కడ మహిళా సమాజానికి అన్నివిషయాల్లోనూ ఆవిడే పెద్ద. ఆవిడగా రయితే నన్ను అమాంతం ఆకాశానికి ఎత్తింది. నన్ను ఎన్ని విధాల పొగిడింది! అందరితోనూ చెప్పింది. నాలాంటి ఆడ పిల్ల లేనేలేదన్నది. ఒకనాడు థియేటర్లో డాన్సుజరుగుతూ ఉంటే రాకుమారి దీనా నన్ను రమ్మని పిలిచింది. నన్ను వెంటపెట్టుకొని డాన్సుకు రమ్మని మావారితో గట్టిగా చెప్పింది అప్పుడు మావారు నావంక అదోలా చూచి చిరు నవ్వు నవ్వారు.

'ఏం వెళ్ళాలని ఉందా?–' అని అడిగారు.

అవునన్నట్లు తలఊపాను. నాకు ఎక్కడలేని సిగ్గు ముంచుకొచ్చింది.

'మరి రాకుమారి దీనా నీవువస్తేగాని డాన్సుకు వెళ్ళ నంటున్నది!–' అన్నా రాయన మళ్ళీ, కులాసాగా నవ్వుతూ.

'అవును కానీ, ఇలాంటి మహిళాసమాజాల్లో తిరగవద్దని మునుపు మీరే అన్నారుగా! ఇప్పు డామాట

కాస్తా గంగలో కలిసించా ఏమిటండీ?'- అని అడిగాను పరాచకంగా నవ్వుతూ.

'మరి నీళ్ళాలని నీకు అంతగా ఉన్నప్పుడు వెళ్ళకతప్పుతుందా? పోదాం పద!'—

'అంతకంటె మంచికాలక్షేపం ఏమున్నదండీ?'-

'అవుతే నీకు వెళ్ళితీరాలనే ఉందన్నమాట!'-అని అడిగారు ఆయన మళ్ళీ. అందుకు నే నేమీ చెప్పలేదు.

'నిజానికి సమాజాల్లో తిరిగినందువల్ల అంతనష్టమేమీ లేదుకాని - సాంఘిక దురాచారాలున్నాయే, అవి చాలా చెడ్డవి. వాటివల్ల లోకానికి తీరనిఅపకారం జరుగుతోంది. అది మనం ఒప్పుకునితీరాలి.'- అన్నారాయన, ఏదో బాధపడుతూ.

'నిజంచెప్పాలంటే, డాన్సులపై ఉన్నంతఆసక్తి దేని మీదా లేదు!'- అన్నాను నేను.

మేం ఆరోజు డాన్సుకువెళ్ళాం. అక్కడ నాకు కలిగిన ఆనందం ఇంతా - అంతా కాదు. నాట్యమందిరం దీపకాంతితో వెలిగిపోతున్నది. ఆ అలంకారాలన్నీ నాకోసమే చేసినట్టనిపించింది. నన్ను చూచేందుకు అక్కడ జనమంతా పోగయినట్టనిపించింది. అక్కడ మేకప్ చేసేవారు, దాసదాసీలు - అంతా నాకోసమే ఉన్నట్టు తోచింది. అక్కడ ప్రతిఒక్కరూ నాఆకర్షణకు లోనయినట్లు కనుపించింది. తరువాత రాకుమారిదీనా చెప్పగా విన్నాను - ఆనాడు డాన్సుకు వచ్చినవారిలో నన్నుచూడనివారూ, చూచి మెచ్చుకోనివారూ లేరట! నేను ఒకపల్లెటూరిపిల్లలా లేనన్నీ, స్వభావసిద్ధమైన నా అందచందాలు చూచి ప్రతి

ఒక్కరూ ముగ్ధులైపోయారనీ చెప్పింది ఇంకా నోటికివచ్చి నట్లల్లా పొగిడింది. అప్పుడు నా కెంతో ధైర్యంవచ్చింది. 'మళ్ళీ రెండు మూడుసార్లు డాన్సులకు వెడదామండీ, నా కెంతో హాయిగా ఉంటుంది!'-అన్నాను మా వారితో. అందుకు ఆయన 'సరే' అన్నారు.

మొదటిసారి డాన్సుకు వెళ్ళినప్పుడు, నేనుచెప్పలేనంత ఉల్లాసంగా ఉండడం - ఇహ చూడవచ్చినవారంతా నన్ను అందలంఎక్కించి పొగడుతులుపడుతూ ఉండడం-ఇవన్నీ చూచిన తరువాత మావారికి మనసుమారిపోయింది. సమాజాలలో తిరగకూడదని ఆయనగారు చెప్పిన శ్రీరంగనీతులన్నీ తుడిచి పెట్టుకొనిపోయాయి. అలా నాతో డాన్సులకు వెళ్ళడం ఆయనకూ ఎంతో ఆనందంగాఉంది.

ఇలా మేము రెండు మూడు డాన్సులకు వెళ్ళాం. ఖులాసాగా గడిపాం. కాని రానురాను మావారికి వాటిపై మోజుపోయింది విసుగుపుట్టింది. నాకుమాత్రం అలాకాక ఎంతచూచినా తనివితీరడంలేదు. అప్పుడాయనకు కోపం వచ్చినట్లుంది. నావంక చురచుర చూడడం మొదలుపెట్టారు. ఆచూపుల్లోని భావం నాకుమాత్రం అర్థంకాలేదు. అసలు నే నీలోకంతోనే లేను. ముక్కూముఖం తెలియని ఎక్కడెక్కడివారంతా వచ్చి నాపై చూపుతున్న ఆదరాభిమానాలకు పరవశమైపోతున్నాను. నాకు వళ్ళు తెలియడంలేదు. ఆ బస్తీలోని నవనాగరికులమధ్య తిరుగుతూ, ఏదో విచిత్ర లోకంలోపడి కొట్టుకపోతున్నాను. నా కెంత హాయిగా, ఆనందంగా ఉంటున్నదో చెప్పలేను. ఒక నాడు, మావారి

కంటే నేనే ఘనముఖురాలనని అనుకోసాగాను. ఆయన్ను మరింత గాఢంగా ప్రేమించాలని బుద్ధిపుడుతోంది. కాని ఆయన కెందుకో విసుగ్గా ఉంటున్నది అలా నేను నాగరిక సమాజంలో తిరుగుతూఉండడం ఆయన కెంతమాత్రం ఇష్టంగా లేనట్టుంది. అంత అయిష్టం ఎందుకో నా కర్థం కాలేదు. నేను డాన్సులకు వెళ్ళి హాలులో కూచోడమే ఆలస్యం - అందరిముఖాలు నావంక తిరిగేవి. అందరి చూపులూ నామీదే ఉండేవి. అప్పుడు నాలో నేను ఏదో గర్వపడేదాన్ని. కాని ఆయనమాత్రం ముఖం ముడుచుకునే వారు. అలా అందరూ నా నిలువూ-నిస్తారం చూస్తుంటే, ఆయన చూచి సహించలేక పోయేవారు. తలవంపు లయి నట్లు బాధపడేవారు కావాలని నన్ను తప్పించుకుని గబగబా వెళ్ళి మగవాళ్ళలో కలిసేవారు.

డాన్సుకువచ్చిన పురుషులంతా నల్లనికోట్లు ధరించే వారు. మావారుకూడా వాళ్ళలోకలిసి వెళ్ళిపోతోంటే - కొంచెం ఆగండి. మీకెందుకంతకోపం? - మనం ఇంటికి వెళ్ళేదాకా కాస్త ఓపికపట్టండి. అన్నీ మీకే తెలుస్తాయి. ఎవరికోసం నే నింత అందంగా, ఆనందంగా ఉండాలనుకుం టున్నానో - ఈ చుట్టూఉన్నవాటన్నింటిలోకీ నేను దేన్ని ఎక్కువ ప్రేమిస్తున్నానో - అంతా మీకే తెలుస్తుంది!- అని పదేపదే నాలో అనుకునేదాన్ని. అయినాఒక్కవిషయం. ఆయనకు ఏక్షణాన అంత అయిష్టంగాఉంటే - ఆక్షణాన్నే నేను ఇలా సమాజంలో జనంమధ్య తిరగడం మానేస్తాను. అలా చెయ్యగలననే ధైర్యం నాకుంది. అందుకే ఇప్పు డింత

హాయిగా తిరుగుతున్నాను. కాని ఇందులో ఒకచిక్కు, ప్రమాదం కూడా ఉన్నాయి. ఆవిషయం నాకుతెలుసు. ఇల్లాలినయిన నేను ఇలాపదిమందితో కలిసి మెలిసి తిరగడం వల్ల ఏపరపురుషునివలలోనో చిక్కుకొనిపోయానూ అంటే మావారు అసూయతో ఉడికిపోతారు, నాకుతెలుసు. కాని నాశీలాన్ని ఆయన శంకించరు. నాపై ఆయన కెంతో నమ్మకిఉంది. ఆవిషయంకూడా నేను ఎరుగుదును అంతేకాదు, ఆపట్నంలో నే నెవరెవరిమధ్య తిరుగుతున్నానో - ఆపురుషులంతా మావారికంటె అన్నివిధాలా తక్కువైనవారనే నా ఉద్దేశం. కనుక నేను ఎవరివలలోనూ చిక్కుకోను నాకు అలాంటి అపాయంరాదు. మావారూ నన్ను అపార్థంచేసుకోరు. అందాతనే అలా ధైర్యంగా తిరగగలిగాను. ఇంత మందిని ఆకర్షించగలుగుతున్నగర్వం, ఆత్మసంతృప్తి-మావారిపై నాకు మరింతప్రేమ, అనురాగం పుట్టేటట్లుచేశాయి.

ఒకనాటిరాత్రి మేం డాన్సుకువెళ్ళి తిరిగివస్తున్నాం. అప్పుడు నేను మావారిని - 'ఏమండీ! ఇందాక హాలులో - 'ఆవిడా' మీరూ అదేపనిగా ముచ్చట్లుచేసుకున్నారే! ఏమిటి విశేషం? ఏమి టా సంతోషం?'-అని అడిగాను. పీటర్సుబర్గు లోకల్లా ప్రసిద్ధురాలయిన ఒకావిడతో ఆరోజురాత్రి డాన్సు జరిగేటప్పుడు మావారు ముచ్చట్లుచేశారు. ఆవిషయమే అడిగాను. ఆవిడపేరుకూడాచెప్పాను ఎంతోనిరుత్సాహంగా, మాట్లాడకుండా ఉన్నందువల్ల ఆయన్ను కాస్త రెచ్చగొట్టాలనే అలా అడిగాను.

కాని ఆయనకు కోపంవచ్చింది - 'ఏమిటిమాషా నీ వనేది. నీనోటివెంట రావలసిన మాటేనా ఇది? నీవుగానీ నేను గానీ ఇలాంటి అల్పవిషయాలను గురించి ఆలోచించవచ్చునా మాషా? ఇలాంటి అపోహాలవల్ల మన మనస్సులు పాడుకావా? మనసంబంధాలు మళ్ళీ ఎప్పటిలాగే పవిత్రంగా కొనసాగాలని నేను ఆశిస్తున్నాను మాషా'- అన్నారు. ఆయనముఖంలో చెప్పలేనంత బాధ, ఆవేదన అగుపించాయి.

నాకు తలకొట్టేసినట్లయింది. మళ్ళీ మాట్లాడలేదు- 'మన సంబంధాలు మళ్ళీ ఎప్పటిలాగే సుస్థిరంగా ఉంటా యంటావా ? నీ వేమనుకుంటున్నావు మాషా?-' అని మళ్ళీ ఆయన అడిగారు

'మన సంబంధాలు ఇంతవరకు చెడిపోనూలేదు, ఎప్పటికీ చెడిపోవుకూడా' అన్నాను నేను.

'అలా ఉండాలనే నేనూ భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను మాషా! ఇహ మనం త్వరలో మనఊరు వెళ్ళిపోవడం మంచిది-' అన్నా రాయన.

ఈ ఒక్కతడవే ఆయన ఇంత కష్టంగా మాట్లాడారు. అంతకుముందు ఆయన ఎంతో హాయిగా, కులాసాగా ఉన్నారు. నేనూ అలాగే ఉన్నాను. ఎప్పుడైనా ఆయనకు విసుగ్గాఉంటే, ఆ పల్లెవాళ్ళతో నాకెంత విసుగుపుట్టిందీ- అని నాలో నేను సమాధానపరుచుకునేదాన్ని. 'ఒకవేళ మా మనసుల్లో పొరపులుపుట్టినా, మళ్ళీ మా ఊరు వెళ్ళి మా అత్తగారి సముఖంలో ఉన్నామంటే అన్నీ మామూలుగా చక్కబడిపోతాయి' అనుకుని తృప్తిపడేదాన్ని.

శీతాకాలం వెళ్ళిపోయింది. ఏప్రిల్ తేనెం ఈస్టరు పండుగ వెళ్ళేటంతవరకూ మేం పీటర్సుబర్గులోనే వుండిపోయాం. ఆ తరువాత ఒక వారంరోజులకు ప్రయాణసన్నాహాలు చేసుకోడం మొదలుపెట్టాం. మా సామానులన్నీ సర్దుకున్నాం. మా తోటలో నాటాలని రకరకాల పూలమొక్కలు కొన్నారు మావారు. మా ఊళ్లో తమ స్నేహితులకోసం ఎన్నెన్నో వస్తువులూ, బహుమతులూ కొన్నారు. ఆరోజు ఆయన ఎంతో ఉల్లాసంగా వున్నారు. సరిగ్గా ఆ సమయానికి దీనా రాకుమారి ఎక్కడినుంచో ఊడిపడింది. మమ్మల్ని ఆ వచ్చే శనివారందాకా ఆగమనిఅడిగింది. రోబిక్ రాకుమారుడు ఆనగరంలో నాకు పెద్దఎత్తున సన్మానంచేయటానికి ఏర్పాట్లు చేస్తున్నాట్ట! ఎలాగైనా సరే, నన్ను సన్మానానికి ఒప్పించాలని విశ్వప్రయత్నం చేస్తున్నాట్ట. అంతేకాదు- పీటర్సుబర్గు నగరం చూడడానికి వచ్చిన విదేశ రాకుమారుడు ఒకాయన ఏదో విందుభోజనాల సమయంలో నన్ను చూచాడనీ, నా అందచందాలకు అచ్చెరువందాడనీ, నాలాంటి అందకత్తె రష్యాదేశంలోనే లేదన్నాడనీ, నా సన్మానసభకు విచ్చేసి నాతో పరిచయంచేసుకోడానికి ఆరాటపడుతున్నాడనీ దీనా రాకుమారి చెప్పింది. అసలా సమావేశానికి దేశంలో ఉన్న ప్రముఖులంతా రానున్నారట! అటువంటి మహదవకాశాన్ని పోగొట్టుకోరాదని ఆవిడ గట్టిగాఅన్నది. అప్పుడు మావారు గదిలో అవతలవైపున ఎవరితోనో మాట్లాడుతున్నారు.

'ఏవమ్మా మేరీ! ఎలాగైనా నీవు ప్రయాణం ఆపు

కోవాలి, సన్మానసభకు రావాలి. ఏమంటావు మరి?'- అని మళ్ళీ అడిగింది నన్ను, రాకుమారి దీనా.

'ఎలాగండీ మరి? మేం ఎల్లుండే ప్రయాణం పెట్టుకొన్నాం. అన్నీ సర్దుకుంటున్నాం'- అని అటూ ఇటూ కాకుండా సమాధానం చెప్పాను. మావారేమంటారో అని ఆయనవంక చూచాను. ఆయన నావంకచూచి వెంటనే ముఖం ప్రక్కకు తిప్పుకున్నారు.

'అవుతే మీవారితో చెప్పి ప్రయాణం ఆపుచేయించాలన్నమాట! కాని మేరీ! నీకోమాట చెపుతాను విను. మనం ఈ సమావేశానికి హాజరయినామూ అంటే - అందరిదృష్టి మనమీదనే ఉంటుంది. మనల్నిచూచి అంతా తలలువాల్చుకుంటారంటే నమ్ము.'-అన్నది, మళ్ళీ రాకుమారి.

'కాని మా 'ప్రోగ్రాం' అంతా తల్లక్రిందు లవుతుందండీ - ఏం చెయ్యమంటారు మరి? సామానులన్నీ సర్ది మూటలుకట్టిస్తున్నారు మావారు!'- అన్నాను.

'అవుతే ఆవిడే ఇవాళసాయంత్రం వెళ్ళి ఆరాకుమారుడికి కృతజ్ఞతలు తెలుపుకునివస్తే బావుంటుందేమో!'- అని మావారు అవతలవైపునుంచి అన్నారు. ఆయన కంఠం సింహగర్జనలా వినిపించింది. ఆయ నంతగట్టిగా మాట్లాడడం నే నెన్నడూ వినలేదు.

'ఓహో! మీవారికి తగని అసూయగా ఉన్నట్టుందే! ఇదిచూడడం నా కిదే మొదటిసారిసుమా!'- అని అందుకున్నది రాకుమారి దీనా - 'ఏమయ్యా, సెర్జ్ మిఖాలిచ్! ఒక్క రాకుమారుడికోసం మీ ఆవిడను ఉండమని నేను

బలవంతించెయ్యడంలేదయ్యా. మా అందరికోసమే ఇంత గట్టిగా అడుగుతున్నాను. పైగా రోరిక్ రాకుమారి, మేరీ అక్కడికిరావాలని ఎంతగా ఆరాటపడుతున్నదో చెప్పలేను.' అన్నది.

'అదంతా ఆవిడఇష్టం. ఎలాతోస్తే అలాచేస్తుంది!'- అని తన కేమీపట్టనట్లు అనేసి, అవతలికి వెళ్ళిపోయారు.

ఆయన చాలా ఉద్రిక్తుడై ఉన్నట్లు నాకు కనిపించింది. మనస్సెంతో బాధపడింది. అందుకని మాబంధువైన రాకుమారి దీనాకు నేను ఏమాటా తేల్చిచెప్పలేదు. ఆవిడ వెళ్ళిపోయింది. తరువాత నేను మావారిదగ్గరికి వెళ్ళాను. ఆయన వరండాలో అటూఇటూ పచార్లుచేస్తున్నారు దీర్ఘాలోచనలో మునిగిఉన్నారు. నేనువచ్చిందికూడా చూడలేదు.

'ఆయనగారు వాళ్ళఊరు - ఇల్లూ, అక్కడ పొలాలు, రైతులూ, దాసదాసీలు - వీటన్నింటిని గురించి కలలుకంటున్నారనుకున్నాను నాలోనేను. అవును. అక్కడ మా అత్తవారింట్లో ఎంత హాయిగాఉంటుంది. మాయింటికి అనేకమంది వస్తూపోతూఉండడం, మేం కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ 'టీ' తాగడం, చల్లని సాయంత్రం వేళ పాటలు పాడుకోడం, అర్ధరాత్రిదాకా మా ముచ్చట్లూ, వంటింట్లో దొంగతనంగా ఫలహారాలుతినడం - ఇవన్నీ ఒక్కమాటుగా నాకూ జ్ఞాపకంవచ్చాయి. అంత సుఖంగాఉండే మావారి మనస్సును అనవసరంగా కలతపెట్టాను. ఛీ,ఛీ! బస్తీలకు రావడమెందుకూ? ఇక్కడ ఆడంబరంగా తిరిగే ఈ శ్రీమంతులతో

పొత్తు ఎందుకూ? ఈ విందులూ, వినోదాలూ, డాన్సులూ, నాటకాలూ, సభలూ, సన్మానాలూ – ఇవన్నీ దేనికి వచ్చినట్లు? మమ్మల్ని వీళ్ళంతా పొగడటం ఏమిటి? వీటిమూలంగా మావారిమనస్సుకు ఎంత బాధకలిగించాను. ఛీ, ఛీ! ఎంత దారుణం! మావారి తియ్యటిమాట, ప్రసన్నమైనచూపు నాకు కావాలికాని, తక్కినవాటితో నాకేంపని? వాటిముందు ఈ రాకుమారులు, రాకుమార్తెలు, ఈ పొగడ్తలు, సన్మానాలు ఎంత?–

నేను ఈ సన్మానసభకు వెళ్ళను, మనం మనఊరు వెళ్ళిపోదాం – అని మావారితో చెప్పాలని నోటిదాకా వచ్చింది, కాని అంతలోనే హఠాత్తుగా ఆయన నావంక చూచారు. వెంటనే ముఖంచిట్లించుకున్నారు. అప్పటిదాకా ప్రశాంతంగాఉన్న ఆయనముఖం – నేనుకనుపించగానే వికృతంగా మారిపోయింది. చూపుల్లో ఎన్నెన్నో ప్రశ్నార్థకాలు గోచరించాయి ఆయన ఒక మామూలుమనిషిలా నాకు కనుపించదలుచుకోలేదనుకున్నాను. కదలని – మెదలని ఒకశిలావిగ్రహంలా ఉన్నారాయన.

చివరకు– 'ఏమిటి మాషా! ఏమిటివిషయం?'– అని అయిష్టంగా అడిగారు.

నేను సమాధానం చెప్పలేను. నే నాయన్ను ఎంతగానో ప్రేమిస్తున్నాను. అలాంటప్పుడు మనస్సులో మాట చెప్పకుండా ఆయన నాపట్ల అంతవైముఖ్యం చూపడం దేనికి? ఆయన వైఖరికి నాకు వళ్ళుమండింది!

'అవుతే నీవు శనివారందాకా ఇక్కడేఉండి- సన్మాన సభకు వెళ్ళాలనుకుంటున్నావా?'- అని మళ్ళీ అడిగారు.

'నాకు ఉండాలనేఉంది. కాని ఏంలాభం! మీకు ఇష్టంలేదుగా. పైగా మాటా-ముల్లే కట్టేరాయె!'-అన్నాను.

'కడితే ఏంపోయింది - విప్పేయడం ఎంతసేపు. నీ కోసం మంగళవారందాకా ఆగుతాను. కనుక వెళ్ళదలుచు కుంటే శనివారం సన్మానసభకు వెళ్ళిరా-' అన్నారాయన. అంత నిరుత్సాహంగా, అంతఅయిష్టంగా ఆయన ఎన్నడూ మాట్లాడడం నే నెరుగను- 'అవును. నీకోసం ప్రయాణం మానుకొనిఉంటాను కాని ఒక్కవిషయం: నేనుమాత్రం ఆ సభకురాను.'- అన్నారు. మళ్ళీ అటూఇటూ పచార్లు చేయ సాగారు.

'ఏమండీ! మీ వ్యవహారం నా కర్థంకావడంలేదు. ప్రతిఒక్కరికి ఆత్మనిగ్రహం అనేది ఉండాలనీ, ఎ పరిస్థితుల లోనూ దాన్ని పోగొట్టుకోకూడదనీ-అనేకతడవలు మీరేగా అన్నారు! (నే నెప్పుడూ చలించనని అనేకమార్లు నాతో అన్నారాయన) మరెందుకూ ఇప్పు డిలా మాట్లాడుతున్నారు? మీకోసం నేను సర్వసౌఖ్యాలూ త్యజించడానికి సిద్ధంగా ఉన్నాను కాని మీ రేదో ద్వంద్వార్థంగా మాట్లాడు తున్నారు. నే నేదో మిమ్మల్ని కాదని వెళుతున్నట్టూ- మీ కిష్టంలేనిపని బలవంతంగా చేయిస్తున్నట్టూ చెపుతున్నారు'- అన్నాను

'అవుతే- నీవు నాకోసం సర్వంత్యజిస్తావన్నమాట! సరే, మంచిది. నేనూ నీకోసం సర్వ... త్యాగంచేయగలను.

తెలిసిందా? ఈవిషయంలో మనఇరువురికే పోటీ! కుటుంబ సౌఖ్యానికి ఇదే మూలాధారం!'-

ఆయ నింతనిర్లక్ష్యంగా మాట్లాడడం నే నెన్నడూవిన లేదు. నన్ను లెక్క-చెయ్యకుండా మాట్లాడేశారు. నేను అవ మానంతో కుంచించుకపోయాను; నే నేం భయపడ లేదు. తొణకలేదు. కాని ఆయనకాఠిన్యం నా మనస్సునుకూడా రాయిలా చేసింది. ఇదివరకు ఆయన నాతో ఎంతో ఆప్యా యంగా మాట్లాడేవారు. ఎక్క-డ పొరపాటువస్తుందోనని నేను జాగ్రత్తగా మాట్లాడేదాన్ని. మరి ఇప్పుడింత కఠినంగా మాట్లాడుతున్నారే - నే నేం మహాపరాధంచేశాను ? నా సర్వస్వం ఆయనకోసం ధారవోయడానికి సిద్ధంగాఉన్నానే. ఒక్క- క్షణంక్రితంవరకూ ఆయన్ను ఎంతగానో ప్రేమించానే! ఇప్పు డింతలోనే మామనసులు మారిపోయాయి, దేనికి?-

'మీరు వెనకటి మనుషులుకారు. పూర్తిగా మారి పోయారు!' అంటూ నిశ్వసించాను - 'ఇంతకూ నేను చేసిన అపరాధం ఏమిటి? ఈ సభవిషయం- ఈ ప్రయాణం ఆపుకొనేవిషయం కానేకాదు. దీనివెనకాల ఏదో కథవుంది! నాపై మీకింత అపనమ్మకం కలగడానికి కారణం ఏమిటి చెప్పండి? దాచకుండా చెప్పండి?'- అని అడిగాను. ఇలా అడిగి నాలోనేను ఒక్క-మారు ఆలోచించుకున్నాను. నేను చేసినతప్పులేమీ లేవని దృఢంచేసుకున్నాను. ఆయన్ను సమీపించాను చూస్తూ నిలుచున్నాను; ఆయన ఎప్పటి లాగే నన్ను దగ్గరికితీసుకుంటారనీ, కౌగిట్లోకితీసుకుని ఓదారుస్తా రనీ అనుకున్నాను. కాని ఆయన అలాచెయ్యలేదు. నన్ను

తప్పుకుని దూరంగా వెళ్ళి నిలుచున్నారు. నావంక చూచి- 'ఏం? నీ కింకా తెలియటేదా?'- అని అడిగారు- 'అవును. నాకేం తెలియడంలేదు' అన్నాను.

'అవుతే చెప్తాను విను. నాకెంతో బాధగాఉంది. ఇలాంటి బాధ అనుభవించడం నాజీవితంలో ఇదే మొదటి సారి!'- కంపితస్వరంతో ఇలాఅని ఒక్కక్షణం ఆగారు.- 'ఇంతకూ మీరనేది ఏమిటి?'- అనిఅడిగాను నేను. నాకళ్ళలో నీళ్ళుతిరిగాయి

'ఇక్కడున్న రాకుమారుడొకడు నీవు అందాలరాణి వని మోజుపడడం, నీవేమో అతగాడి స్నేహంకోసం ఆరాట పడడం- ఇంతకన్నా నీచకార్యం ఇంకేమున్నది? ఆ మోజు లోపడి నీభర్తను మరిచిపోయావు. నీ సర్వస్వాన్నీ వదిలిపెట్టు కున్నావు నిన్నే నీవు మరిచిపోయావు నీవొక స్త్రీవన్న మాట- ఒక ఇల్లాలివన్నమాట విస్మరించావు నీభర్త ఏమను కుంటాడో- ఎలా బాధపడతాడో అనికూడా నీవు ఆలోచించ లేదు. పైగా సరాసరి నీభర్తదగ్గరకే వచ్చి 'ఏమండీ నేను ప్రేమిస్తున్నాను. మీకోసం నేను సర్వంత్యాగంచేస్తున్నానూ, ఘనతవహించిన రాకుమారుడిదగ్గరికి వెళ్ళడం నాకు మహా గౌరవం!'- అని సిగ్గులేకుండా చెప్తున్నావు అంతేనా?'-

ఆయన నోటవెలువడే ప్రతిఅక్షరం - ఎంతో అస హ్యంగా మొరటుగా, కర్ణకఠోరంగా ఉంది. వా రలా మాట్లాడతారని నేను కలలోకూడా అనుకోలేదు. వింటున్న కొద్దీ నాకు మతిపోవడం మొదలుపెట్టింది. వళ్ళంతా తేళ్ళు, జెర్రులు పాకినట్లుయింది భయంపుట్టింది అదేసమయంలో

నాలో ఏదో అహంకారం తలఎత్తింది దెబ్బతిన్న త్రాచులా అయిపోయాను. పగతీర్చుకోవాలనుకున్నాను.

-'ఊఁ, అనండి- ఇంకా అనండి!' మీరిలా అనేవారని నాకెప్పుడో తెలుసు! అప్పుతారేం!'- అన్నాను రెచ్చిపోయి.

'నీ విలాంటిదానవని నాకూ ఎప్పుడో తెలుసు రోజుకు రోజు నీవు తప్పుత్రోవలుపట్టి పాపానికి ఒడిగట్టడం నేను చూస్తూనే ఉన్నాను. ఈనీచమైన సమాజానికీ- సమాజంలో ఉండే తుచ్ఛమైన భోగాలకూ, రాగాలకూ దాసురాలవయి పోయావు. నీ స్నేహితురాలు దీనా నన్ను అంతమాటన్న దే- నాకు అసూయఅట- హు! ఎవరిపైన నాకు అసూయ? నీకూ నాకూ సంబంధంలేని ఒకమనిషిపైనా? ఛీ! నా మనసు ఎంత నొచ్చుకున్నదో నీకేం తెలుసు? నీవు నన్నుఅర్థంచేసుకోలేదు. అసలు అర్థంచేసుకోవాలనేలేదు నీకు. పైగా నాకోసం సర్వం త్యాగంచేస్తానని మాట్లాడతావా? ఏమిటి నీవుచేసేత్యాగం ! ఆమాట అనడానికి నీకు సిగ్గులేదూ? లజ్జలేదూ? అభిమానం లేదూ?'- అని అరుస్తూ నోటికివచ్చినట్లల్లా తిట్టారు.

'ఓహో! మగడు అధికారం చెలాయించడం ఇప్పుడు కళ్ళారా చూస్తున్నాను'- అనుకున్నాను నాలోనేను. 'ఏ తప్పూ చెయ్యకపోయినా ఆడదాన్ని దండించడం, అవమా నించడం మగలైన మగవారికి అలవాటే! కాని ఇలాంటి వాటికి నేను లొంగేదాన్నికాను!'-

'లేదు నేను మీకోసం ఎలాంటిత్యాగమూ చెయ్యను. శనివారంనాడు సభకు వెడతాను, ఏమైనాసరే - సరేనా?'-

అన్నాను, ఆయనతో - నా నాసికారంధ్రాలు చలించాయి. ముఖమంతా ఎర్రబడింది.

'సరే - నీవు సంతోషంగా ఉండడమే నాకు కావలసింది. కాని మనసంబంధాలు ఇంతటితో అంతమైనట్లే!... ఇహ నీవు నన్ను వేధించకుండా ఉంటే చాలు. అసలు నిన్ననడం దేనికి?-నాదే తెలివితక్కువ. నిన్ను... ...'-కోపంతో రెచ్చిపోయారాయన. పెదవులు కంపించాయి. ముఖం కొట్టవచ్చినట్టయింది. ఆయనవాలకంచూస్తే నాకు భయంపుట్టింది. చాలావిషయాలు ఆయనతో చెప్పాలనుకున్నాను ఆయన అన్న అనరానిమాటలకుతగినసమాధానాలివ్వాలనుకున్నాను. కాని నోరు తెరవబోతే- ఏడుపువస్తున్నది. ఇహ అక్కడ ఒక్క క్షణం నిలవలేకపోయాను. నోరెత్తకుండా వరండాలోనుంచి అవతలకి వెళ్ళిపోయాను. తరువాత వరండాలో ఆయన పచారు చేస్తున్నట్లుగా అడుగుల చప్పుడు వినిపించలేదు ఆయనేంచేస్తున్నారోఅని నాకు భయంపుట్టింది నాజీవితసౌఖ్యం దేనిమీద ఆధారపడిఉందో అదికాస్తా పుటుక్కున తెగిపోయిందనిపించింది. మళ్ళీ ఆయనదగ్గరికి వెళ్ళాలనుకున్నాను - 'కాని వారికోపం చల్లారిందా? నన్ను అర్థంచేసుకునేస్థితిలో ఉన్నారా? నన్ను క్షమిస్తారా? నేను తప్పు చెయ్యలేదని గ్రహిస్తారా? ఏమో! ఆయన్ను ఇంతగా ప్రేమిస్తూఉంటే నన్నెందుకు ఇలా అనవసరంగా అనమానించడం!- దేనికి?'- అని నాలో నేను అనుకున్నాను.

నేను ఆయనదగ్గరికి వెళ్ళలేదు నాగదిలోకి వెళ్ళి అక్కడ ఒంటిగా కూచున్నాను. మా ఇద్దరిమధ్య జరిగిన

సంభాషణ అంతా తలపోసుకున్నాను. ఆయన అన్న ప్రతి మాటా మననంచేసుకున్నాను ఆదృశ్యమంతా ఒక్కమాటు జ్ఞప్తికి తెచ్చుకున్నాను. నాలో నేను కుళ్ళికుళ్ళిఏడ్చాను!

రాత్రి టీతాగడానికి వెళ్ళినప్పుడు అక్కడ మావారు తనస్నేహితుడొకాయనతో మాట్లాడుతున్నారు. ఆనాడు మా ఇరువురిమధ్యా ఒక అంతులేని అగాధంఏర్పడిందని నాకు తెలుసు మేం ఊరికి ఎప్పుడు వెడుతున్నామని మావారి స్నేహితుడు అడిగాడు.

నేను జవాబుచెప్పేలోపుగానే మావారు చెప్పేశారు- 'వచ్చేమంగళవారం వెడుతున్నాం. ఈమధ్యలో సన్మాన సభకువెళ్ళి అక్కడ కోరిక్ రాకుమారిని కలుసుకుంటాం... నీవూ వెళ్ళాలనుకుంటున్నావు కదూ?'- అని నావంకతిరిగి అడిగారు.

నాకు భయంపుట్టింది. ఆయనవంక బెదురుచూపులు చూచాను. ఆయన నావైపు తదేకంగా చూస్తున్నారు. ఆ చూపులో క్రోధం, వ్యంగ్యం గోచరిస్తున్నాయి.

'అవును' అని ఆఖరుకు సమాధానం చెప్పాను.

తరువాత రాత్రి మేం ఒంటరిగాఉన్నప్పుడు ఆయన నాదగ్గరికివచ్చారు. నా చెయ్యిపట్టుకుని-'నే నన్నమాటలన్నీ మరిచిపో'- అన్నారు నేను వారిచెయ్యిపుచ్చుకున్నాను. నా పెదవులపై చిన్నచిరునవ్వు తొణికింది. కళ్ళలో నీళ్ళు తిరి గాయి. కాని అంతలో ఆయన ఏదోతప్పుచేసినట్టు భయపడి నాచెయ్యివదిలించుకున్నారు. నాకు కొంచెం ఎడంగాఉన్న పడకకుర్చీలో కూచున్నారు.

'ఇప్పటికైనా ఆయన సక్రమంగా ఆలోచించగలరా!' అనుకున్నాను. సభకు నాతోరమ్మనిఅడుగుదామనుకున్నాను.

'మనం కొంచెం ఆలస్యంగా బయలుదేరివస్తున్నామని మా అమ్మగారికి ఉత్తరంరాస్తాను. లేకపోతే ఆమె గాభరా పడుతుంది.' అన్నారు.

'అవుతే ఎప్పుడు వెళ్ళాలనుకుంటున్నారు?'— అని అడిగాను.

'మంగళవారంనాడు, సభ అయిపోయినతరువాత' అని చెప్పారాయన.

కేవలం నాకోసం మీరిలాచెయ్యవద్దు'- అన్నాను ఆయనకళ్ళలోకిచూస్తూ. కాని ఆయనచూపులు శూన్యంగా ఉన్నాయి. వాటిలో ఎలాంటిఅర్థమూ నాకుస్ఫురించలేదు. ఆయనకూ నాకూ మధ్య ఏదో తెర అడ్డువచ్చినట్టు-ఆచూపులు నన్ను చూడలేకపోయాయి. అకస్మాత్తుగా ఆయనముఖంలో వృద్ధాప్యపులక్షణాలు, అయిష్టత నాకు అగుపించాయి.

ఎలాగయితేనేం, మేం సమ్మానసభకూ, విందుకూ వెళ్ళాం. మళ్ళీ మేం సఖ్యతగానేఉన్నాం.కానివెనకటిలాలేం.

సభలో రోరిక్ రాకుమారుడు నాదగ్గరికి వచ్చేటప్పటికి నేను ఆడవాళ్ళమధ్య కూచునిఉన్నాను. ఆయన రాగానే మాట్లాడడానికి లేచి నిలుచోవలసివచ్చింది. అప్పుడు నాకు తెలియకుండానే మావారు రెక్కచూస్తున్నారా అని చూచాను. హాలులో అవతలకొసనుంచి ఆయన నన్ను కనిపెడుతూనే ఉన్నారు. నన్నుచూచి వెంటనే ముఖం ప్రక్కకు త్రిప్పు కున్నారు. నాకు చచ్చేబాధకలిగింది. కలవరంపుట్టింది. సిగ్గు,

లజ్జ వచ్చి నిలువెల్లా ముంచివేశాయి. ముఖమంతా ఎర్రగా కందిపోయింది. అయినా అలాగే నిలుచుని రాకుమారుడు చెప్పేది వినకతప్పలేదు.

రాకుమారుడు నాతో ఎక్కువసేపు మాట్లాడలేదు. ఆయన నాదగ్గర కూర్చోడానికే అవకాశం లేకపోయింది. పైగా నేను బిడియపడుతున్నాననికూడా ఆయన గ్రహించినట్లున్నాడు. డాన్సునుగురించీ, వేసవిలో మేం ఎక్కడగడిపేదీ - మొదలయిన విషయాలేవో ఆయన మాట్లాడాడు. వెళ్ళేటప్పుడాయన మావారితో పరిచయంచేసుకోవాలని ఉందనిఅన్నాడు. తరువాత ఆయనా మావారూ హాలుఅవతలవైపు నిలుచుని మాట్లాడుకుంటూఉండడం చూచాను. రాకుమారుడు నన్నుగురించే ఏదో మావారితో చెప్పివుంటాడు. ఎందువల్లనంటే మట్లాడుతూ మధ్యలో నావంకచూచి చిరునవ్వు నవ్వాడు.

హఠాత్తుగా మావారిముఖం జేవురించింది. రాకుమారుడితో కరస్పర్శకావించి గభాలున అక్కడనుంచి వెళ్ళిపోయాను. నాకు చచ్చేబాధకలిగింది. రాకుమారుడు ఏదో నన్నుగురించి మావారితో చెప్పడం, అందుకు మావారి వైఖరీ - ఇదంతా నాకు ఎంతో ఆందోళన కలిగించింది. రాకుమారుడితో మాట్లాడేటప్పుడు నేనలా బిడియపడి బిగుసుకునిపోవడం అక్కడున్నవారంతా చూచేఉంటారు. సందేహంలేదు. మావారి ప్రవర్తనకూడా అందరూ గమనించేఉంటారు. ఇహ వారంతా మమ్మల్నిగురించి ఏమనుకుంటారో - ఎన్నెన్ని పెడర్థాలుతీసి చెప్పుకుంటారో ఆభగవంతుడికే తెలి

యాలి కొంపతీసి నేనూ - మావారూ తగువులాడుకున్న విష యంకూడా అందరికీ తెలిసిపోయిందా ఏమిటి?

మా బంధువు దీనారాకుమారి బండ్లో నన్ను ఇంటి దాకా తీసుకువచ్చి వదిలిపెట్టింది. త్రోవపొడుగునా మా వారినిగురించే మాట్లాడుకున్నాం. నాకూ వారికీ మధ్య జరి గినగ్రంథమంతా దాచకుండా నేను ఆవిడతో చెప్పాను. ఆలు మగలమధ్య ఇలాంటి స్వల్పమైనతగువులు అప్పుడప్పుడు వస్తూ ఉండడం సహజమేననీ, వీటిని అంతగా పట్టించుకోవలసిన అవ సరంలేదనీ చెప్పి ఆమె నన్ను ఓదార్చింది. కాని మావా రిప్పుడు పూర్తిగా మారిపోయారనీ, ఆయనప్రవర్తన ఏమీ బాగాలేదనీ, అనవసరంగా అసూయ, అనుమానం ఆయనకు పుట్టుకొచ్చాయనీ దీనారాకుమారే అన్నది. అది నిజమే నన్నాను నేనూ.

కాని ఆ తరువాత మావారూ నేనూ ఒంటిగా ఉన్నప్పుడు - నాకలా అనిపించలేదు. ఆయనలాంటివారని తీర్మానించుకోడం మహాపరాధంలా తోచింది. అంతేకాదు. నాకూ మావారికీమధ్య ఏర్పడిన అగాధం అంతకంతకూ పెద్ద దవుతున్నట్లు కనుపించింది.

# 8

అప్పటినుంచీ మా జీతమే పూర్తిగామారిపోయింది. మాసంబంధాలూ మారిపోయాయి. మేమిరువురం ఒకచోట ఉంటే వెనకటిలాగా సుఖం, శాంతీ లేనేలేవు పరాయివాళ్ళ

వరైనా ఉన్నప్పుడు పైకి బాగానే మాట్లాడుకునేవాళ్ళం. ఒక్కళ్ళం ఉంటేమాత్రం ఎడముఖం, పెడముఖమే! విందులనుగురించిగానీ, దాన్నులనుగురించిగానీ, మా పల్లెటూరిజీవితాన్ని గురించిగానీ ప్రస్తావనవచ్చిందీఅంటే ఏదో ప్రళయం పుట్టుకొచ్చిందన్నమాటే! ఆయన్ను తప్పించుకుని నేనూ నన్నుతప్పించుకుని ఆయనా తిరుగుతూవచ్చాం. మా ఇరువురిమధ్యా మనస్పర్థవచ్చి ఎక్కడ అగాధంఏర్పడిందో - దాన్ని కనుక్కొని పూడ్చుకోడానికి మారుగా, దానిజోలికి పోతే అందులో పడిపోతామేమో అన్నభయంతో ఆయనగానీ, నేనుగానీ దానిజోలికేపోలేదు! ఆయన దురహంకారంతో సంచరిస్తున్నారని నేను తెలుసుకున్నాను వీలయినంతవరకు రెచ్చగొట్టకుండా ఉండడానికి ప్రయత్నిస్తూవచ్చాను. జాగ్రత్తగా ఉంటూవచ్చాను. పల్లెటూళ్ళంటే నాకు సరిపడవనీ, పట్నవాసంలోని నవనాగరిక సమాజంఅంటే నేను పడిచస్తున్నాననీ ఆయన అభిప్రాయపడుతున్నారు. అయినా ఈ విషయాలనుగురించి ఆయన నన్ను అడగలేదు. నేను ఆయన్ను అడగలేదు. ఎన్నడూ ముఖాముఖి చర్చించుకుని తేల్చుకోనూలేదు. ఆయనదితప్పని నేననుకుంటున్నాను. నాదేతప్పని ఆయన అనుకుంటున్నారు - అంతే!

ప్రపంచంలోకల్లా వారే మంచివారులాగా నాకళ్ళకు కనుపించడంలేదు. నేనే మంచిదానిలాగా వారికళ్ళకు కనుపడడంలేదు. లోకంలో మంచివారితో ఆయన ఆయన్నూ నన్ను నేనూ పోల్చుకుంటున్నాం. ఒకరికి తెలియకుండా ఒకరం మాత్రం విమర్శించుకుంటున్నాం.

పీటర్సుబర్గులో ఉండగానే నాకు జబ్బుచేసింది. మా ఊరు వెళ్ళడానికి మారుగా వేసవికాలంలో ఉండడానికి అనువుగాఉండేటట్లు నగరానికి చేరువగా ఒకఇల్లుతీసుకున్నాం. మాఅత్తగారిని చూచిరావడానికి మావారుఒక్కరే మాఊరు వెళ్ళారు. ఆయన బయలుదేరేటప్పటికి నా వళ్ళు తేళిగ్గానే ఉంది అయినా నన్ను వెంటతీసుకెళ్ళడానికి వారికి ఇష్టం లేకపోయింది. అక్కడికివెళ్ళినా నావల్ల సుఖంఉండదని వారనుకున్నారు. 'నీకుమళ్ళీ జబ్బుచేస్తుంది, నీవిప్పుడు రావద్దులే!' అని వంకపెట్టి వెళ్ళిపోయారు.

పట్నంలో నేనొక్కదాన్నే ఉన్నాను. ఏమీ తోచేది కాదు. తరువాత వారు మళ్ళీతిరిగివచ్చారు. కావి అప్పుడైనా నాకు హాయి చిక్కలేదు. వారు లేనప్పు డెలాఉందో ఉన్నప్పుడూ అలాగేఉంది. పూర్వం ఆయనకనుపిస్తేచాలు నాకు ప్రాణాలు లేచివచ్చేవి. ఆయనచూపు, మాట్లాడే ప్రతిమాటా నాకెంతో ఆనందాన్ని చేకూర్చేవి. ఆయనలాంటిమనిషి లోకంలోనే లేరనుకునేదాన్ని. నన్నుచూచి ఆయనా అలాగే మురిసిపోయేవారు. ప్రతి చిన్నవిషయానికీ ఒకరినొకరం చూచుకొని నవ్వుకునేవాళ్ళం. ఇప్పుడవన్నీ ఏమైనాయో ఏమో! అన్నీ పోయాయి. మా సుఖాలు, ఆనందాలు అన్నీ మాసిపోయాయి. ఇప్పుడు ఎవరిపని వారిది. ఎవరిఆసక్తివారిది. ఎవరి అభిరుచి వారిది. ఒకరికొకరికి సంబంధంలేదు. ఒకరి ఆనందంలో ఒకరు పాలుపంచుకోడంలేదు. అంతేకాదు, ఇప్పుడు ఎవరిత్రోవ వారిదై, ఎవరిలోకంలో వాళ్ళం ఉంటున్నట్లు అనిపించసాగింది. ఆ అభిప్రాయం రానురాను బలపడి

పోయింది. అలా ఒకపేడాది గడిచేసరికి - ఆయనకళ్ళకు నేనూ, నాకళ్ళకు ఆయనా ఎవరో పరాయివాళ్ళలాగా కనుపించసాగాం. పసిపిల్లవాడిలాగా ఆయన చేసే చిలిపిచేష్టలూ, అకులాసాలూఅన్నీపోయాయి. గుచ్చినట్లు అర్థవంతంగాచూచే ఆయనచూపులు-నన్ను ఆనందంలోముంచితేల్చే ఆచూపులు, ఇహ నాకు లేవు. ఆయనా నేనూ కలిసి ప్రార్థనలుచేసుకోడం లేదు. పికార్లుచేయడంలేదు. నన్ను ఒంటిగావదిలేసి, ఆయన ఇష్టంవచ్చినట్లు ఆయన అక్కడికి ఇక్కడికి ప్రయాణాలుచేస్తున్నారు. నేను ఒంటరిగాఉన్నానని ఆయనకు భయమూలేదు, విచారమూలేదు. అలాగే నేనూ ఆయనతో పనిలేకుండా స్వేచ్ఛగా సభలకూ, సమావేశాలకూ వెడుతూవచ్చాను. అవుతే, మేం తగువులాడుకోలేదు. ఆయనకు కావలసినవన్నీ నేను చూస్తూనేఉన్నాను. అలాగే నాకోరికలూ ఆయన తీరుస్తున్నారు. బయటికి చూడడానికి ఒకరినొకరం ప్రేమించుకుంటూనేఉన్నాం. ఎప్పుడైనా సకృతుగా-పరాయివాళ్ళెవరూ లేకుండా మేమిరువురమే ఉండడం తటస్థిస్తే - అప్పుడైనా నా కేమాత్రం సంతోషంగానీ, హాయిగానీ కలిగేదికాదు. ఆయన ఉన్నా నేను ఒంటిగా ఉన్నట్టనిపించింది! ఆయన పరాయివాడు కాదనీ, మావారనీ నాకు తెలుసు. పైగా మంచివారనీ తెలుసు. అయినా వారినుంచి నేను ఆశిస్తున్నదేమీ లేదు. ఒక్కముక్కలో చెప్పాలంటే, ఆయన నాభర్త-అంతే! అంతకుమినహా ఆయనకూ నాకూ మరేవిధమైన సంబంధంఉన్నదనిగానీ, ఉంటుందనిగానీ, నాకు అనిపించడం లేదు. మొదటిసారి ఆయన నన్ను ఒంటరిగావిడిచిపెట్టి

మావూరికి వెళ్ళినప్పుడు నేను చాలా బాధపడ్డాను ఒక్క దాన్ని ఉండలేకపోయాను ఆయన ఊరినుంచి తిరిగిరాగానే పరుగెత్తుకుంటూ వెళ్ళి ఆయనకౌగిట్లో వాలిపోయాను. కాని అదేమిటో - మళ్ళీ ఆతరువాత కొద్దిసేపట్లోనే ఆ ఆనంద మంతా పోయింది. మళ్ళీ మామూలుమనిషి నయ్యాను. ఉత్సాహంలేదు. ఆయనతో నేను చెప్పవలసినే విషయమూ లేదు. ఇలాంటి చిత్రవిచిత్రమైన మనస్తత్వాలతో మా దాంపత్యజీవితం కొనసాగింది. ఒక్కొక్కప్పుడు నాహృదయం లో ఏదో బాధబయలు దేరేది. ఆయన్నుచూస్తే అలాంటిబాధే ఆయనకూ ఉన్నట్లు నాకు అనిపించేది! మా అనురాగానికి ఒక హద్దుఉన్నట్లూ, ఆ హద్దుదాటిపోయే ఆకాంక్షగానీ, శక్తి గానీ నాకు లేనట్లూ తోచేది. ఒక్కొక్కప్పుడు నాలోనాకు విచారంవేసేది కాని ఆ విచారానికి కారణంఏమిటో ఆలో చించడానికి నే నెన్నడూ ప్రయత్నించలేదు. లీలామాత్రంగా ఉన్న ఈ విచారాన్ని మరిచిపోవడానికి ప్రయత్నిస్తూ వచ్చాను. అందుకోసం నాకు అందుబాటులోఉన్న రకరకాల మార్గాలలో దూకుతూవచ్చాను. సామాజికజీవితం తొట్ట తొలుతనే నన్ను విపరీతంగా ఆకర్షించి ఆకట్టుకున్నది నామన స్సును పూర్తిగా వశంచేసుకున్నది. నేను దానిప్రభావానికి పూర్తిగా లొంగిపోయాను. నవనాగరికతతోకూడిన జీవితా నికి అలవాటుపడిపోయాను. ప్రొద్దున్న లేచిందిమొదలు రాత్రి పడుకునేదాకా - నాకు ఒకటేపని—పదిమందితోనూ కలిసి తిరుగుతూ, కాలక్షేపంచేయడం బయటికి వెళ్ళినప్పుడు నా కేమీ తోచేదికాదు. కాని నా జీవితం మారిపోయిందని

మాత్రమే నాకు తెలుసుకాని - ఎందుకు మారిపోయిందని నే నెన్నడూ ఆలోచించలేదు. నా ప్రవర్తననుగురించి ఆత్మ విమర్శన చేసుకోనూలేదు.

అలా మూడేండ్లు గడిచాయి. మా సంబధాలు అలాగే ఉన్నాయి - మార్పులేదు అటు మంచికిగానీ, ఇటు చెడుకు గానీ ఎటూ మారకుండా మా జీవితం స్తంభించిపోయినట్లు కనుపించసాగింది. కాని నా పెండ్లిఅయిన ఆ మూడేండ్లలో రెండు ముఖ్యమైన సంఘటనలు జరిగాయి. అయినా అవి కూడా నాజీవితంలో ఎలాంటిమార్పునూ తీసుకరాలేదు. ఆ సంఘటనలు ఏమిటంటే - ఒకటి : నాకు తొలిచూలు బిడ్డ పుట్టడం, రెండు : మా అత్తగారు చనిపోవడం. నాకు నెల తప్పగానే-నేను తల్లినికాబోతున్నానని నాకెంతో ఉత్సాహం పుట్టుకొచ్చింది. నాజీవితంలో కొత్తఅధ్యాయం మొదలు కానున్నదని ఆనందంతో పొంగిపోయాను కాని, రెండునెలలు గడిచేసరికి ఆ ఉత్సాహమంతా పోయింది. ఇది ప్రతిస్త్రీకీ మామూలేలే - అన్న భావం ఏర్పడిపోయింది. పైగా మా పెద్దబ్బాయి పుట్టగానే మావారు మళ్ళీ వెనకటిమనిషి అయిపోయారు! శాంతంగా, బుద్ధిమంతుల్లా ఇంటిపట్టుననే ఉంటూవచ్చారు. తనకొడుకును ప్రాణప్రదంగా చూచు కుంటూ పొంగిపోసాగారు. నేను తరచు ముస్తాబుచేసుకొని నాటకాలకూ, డాన్సులకూ వెళ్ళివచ్చేదాన్ని. అలా వెళ్ళి వచ్చి ముస్తాబువిడువకుండా, పిల్లవాడికి 'శిలువగుర్తు' తాకించాలని పడకగదిలోకి వెళ్ళేదాన్ని. అప్పుడు మావారు పిల్ల వాడిప్రక్క-నే ఉండేవారు. నేను గదిలో అడుగుపెట్టగానే

నావంక కోపంగా, చురచుర చూచేవారు. ఆయన చేష్టలకు నాకూ వళ్ళుమండిపోయేది. వెంటనే నేను నా పిల్లవాణ్ణి శ్రద్ధగాచూచుకోడంలేదే - అని లోలోపల విచారపడే దాన్ని. నేను అందరితల్లులలాంటి తల్లినికానా? - అనుకునే దాన్ని 'నా బిడ్డంటే నాకు ప్రేమలేకపోలేదు. కాని అస్త మానం వాడితోటే గడుపుతూ ఉండలేనుకదా! కాస్త ఉంటే గంపంత చేయడం - అలాంటి బులబూచికాలు నాకు చేత కావు!'-అనుకునేదాన్ని.

ఇహ మా అత్తగారు పోవడం మావారికి ఎంతో దుఃఖంకలిగించింది. మా అమ్మ లేకుండా నేను మాఊరికి ఎలా వెళ్ళగలను? ఆ ఇంట్లో ఎలా ఉండగలను?'-అని వారు ఎంతగానో వాపోయారు. మా అత్తగారుపోవడం నాకు బాధగానేఉంది. ఆవిషయం మావారితో చెప్పాను వారిని ఓదార్చానుకూడా. కాని ఆమెగారు లేకపోవడంవల్ల - ఇప్పుడు మాఊళ్ళోమరింతసుఖంగా ఉండవచ్చుననుకున్నాను. అసలు ఆ మూడేండ్లలో ఎక్కువకాలం మేం బస్తీలోనే ఉంటూవచ్చాం. ఒకఏడు వేసవికాలంలోమాత్రం మాఊరు వెళ్ళి రెండుమాసాలు ఉండివచ్చాం. అంతే. ఇహ మూడో ఏడు వేసవిలో మేం విదేశాలకు వెళ్ళాం. బేడెన్‌లో చల్లగా సముద్రస్నానాలుచేస్తూ గడిపాం.

అప్పటికి నాకు ఇరవై ఒక్కసంవత్సరాలు. నాకు తెలిసినంతవరకూ మా ఆర్థికపరిస్థితి బాగానేఉంది. కుటుంబ జీవితంలో నేను కావలసినవన్నీ అనుభవించాననే చెప్పాలి. అందరూ నేనంటే ప్రేమగాఉండేవాళ్ళు. నా ఆరోగ్యం

కూడా బాగా నేడుంది. నేను బేడెన్‌లో ఉండగా ఎంతో చక్కగా సింగారించుకునేదాన్ని. నాలాంటి అందకత్తె ఆ చుట్టుపక్కల ఎవరూ లేరని నన్నుచూచినవారంతా అనుకునేవారు. ఆ ప్రదేశంకూడా నాకెంతో నచ్చింది. నేనెంతో ఉల్లాసంగా, హాయిగా ఉన్నాను. ఆ వేసవికాలం అంతా ఎంతో కులాసాగా గడిపాను. నాకు ఏకొఱతా లేదు. ఎలాంటి భయమూ లేదు, చీకూ - చింతా లేదు. ఆ వేసవిలో మేం బేడెన్‌లో ఉన్నప్పుడు రకరకాలమనుష్యులతో మాకు సంబంధంఏర్పడింది వారిలో రాయబారిగాఉంటున్న క్రోపాట్కిన్ రాకుమారుడు మాపట్ల ఎంతో ఆదరాభిమానాలు చూపారు.

ఇంకా ఒక యువకుడు, ఒక వృద్ధుడు, ఒక ఆంగ్లేయుడు, ఒక ఫ్రెంచిదేశస్థుడు - వీరంతా మాకు కలిసేవారు. నిజానికి వీరంతా మంచివారే - ఎవరినీ తీసిపారెయ్యడానికి వీలులేదు. ఏమైనా వీరందరూ నాజీవితంలో ఒక కొత్త ఆనందాన్ని వెదజల్లుతూవచ్చారు.

వీరిలో ఒక ఇటలీదేశస్థుడున్నాడు. అతనుమార్క్వెస్ ప్రభువు. అందరికంటె అతను నాపట్ల ఎక్కువ శ్రద్ధాసక్తులు కనపరుస్తూవచ్చాడు. నా అందచందాలనుగురించి విపరీతంగా పొగడుతున్నాడు. నన్ను ఆకాశానికి ఎత్తివేస్తున్నాడు. అవకాశంఉంటే చాలు - నన్నొక్కక్షణం విడిచిఉండడు. అతని ఆశలూఆకాంక్షలూ అన్నీ నామీదే. ప్రతివిషయంలోనూ నన్ను తనకు జోడుగా ఎన్నుకుంటున్నాడు. షికారుకు వెళ్ళినా, నాటకాలకూ, నృత్యాలకూ వెళ్ళినా, గుర్రపు

స్వారీచేసినా అన్నిట్లోనూ, నావెంట ఉండేవాడు. నన్ను మెచ్చుకోనిక్షణం లేదు. ఎందుకో అతని కంత మోజు! అంతేకాదు. మేం ఉండే ఇంటిదగ్గర అతను తరుచు తచ్చాడుతూఉండడం నేను కిటికీలోనుంచి చూస్తూవచ్చాను. అతనివి పెద్దకళ్ళు. అందంగా ఉంటాయి. నాకేసి అదేపనిగా చూస్తూఉంటే, నాకు చచ్చేసిగ్గువేసేది. ముఖం చాటుచేసుకునేదాన్ని! అతను చిన్నవాడు. చక్కనివాడు. ఎంతో హుషారుగాఉంటాడు. వింతగా కనుపిస్తాడు. ఎప్పుడూ చిరునవ్వులు ఒలకబోస్తుంటాడు. ఆ నవ్వులు మనల్ని ఇట్టే ఆకర్షిస్తాయి. అతనిముఖంలో మావారిపోలిక లున్నాయి! అదే ఫాలభాగం, అదే నవ్వు. కాని మావారిలో లేని ఆకర్షణ అతనిలో విశేషంగాఉంది. ఏమైనా ఒకటిమాత్రం నిజం. మావారికంటె అతను అందగాడు. మావారిపోలికలు అతనిలోఉండడం చూచి, మొదట నేను ఆశ్చర్యపోయాను. అతనిపెదవుల్లోనూ, చూపుల్లోనూ ఒకరకమైన మోటుతనం, పశువాంఛ గోచరిస్తున్నాయి. మావారిముఖంలోని ప్రసన్నత అతనిలో లేదు. అయినా అతను నన్ను ఆకర్షించాడు. నాపైన అతను ఎక్కడలేని అపేక్ష చూపడమే అందుకు కారణం. నన్ను ప్రేమించి - దాంతో తపించిపోతున్నట్లుగా కనుపించాడు. అతనిబాధ చూస్తే అప్పుడప్పుడు నాకు జాలి పుట్టుకొచ్చేది. అతన్ని ఈత్రోవనుంచి తప్పించి, కేవలం స్నేహమార్గాన మళ్ళిద్దామని ప్రయత్నించాను. కాని అతను ఇది గ్రహించాడు. లోపల కామోద్రేకంతో ఉడికిపోసాగాడు. నన్ను మోహంలోముంచివేయడానికి ప్రయత్నిస్తూవచ్చాడు.

దాంతో నాకు మనశ్శాంతి లేకుండాపోయింది. ఏఘోరాన పాపానికి ఒడిగడతానో అన్న పరిస్థితి ఏర్పడుతూవచ్చింది. అతనంటేనే నాకు భయంపుట్టింది. వద్దనుకుంటున్నా అతనే మనస్సులో మెదలసాగాడు. మావారికీ అతనికీ బాగా పరిచయముంది. మావారు తక్కిన వారందరికంటె అతన్ని ఎక్కువ గౌరవించేవారు. అతనే నా భర్త అయినట్లుగా ప్రవర్తించేవారు! అప్పుడప్పుడు అతనంటే అలక్ష్యం, అసూయకూడా కనపరుస్తుండేవారు.

వేసవికాలం ఆఖరున నాకు మళ్ళీ జబ్బుచేసింది. ఒక పదిహేనురోజులపాటు నే నెక్కడికీ వెళ్ళలేదు. పద- చరణం బయటపెట్టలేదు. తరువాత జబ్బు తగ్గిపోయింది. ఒకనాటి సాయంకాలం కాస్త సంగీతంవిందామని అలా బయటికి వెళ్ళాను. ఆరోజు అందాలరాణి అని ప్రసిద్ధికెక్కిన లేడీ స్మట్సు - అనే ఆమె అక్కడికి వచ్చింది. అదీ విశేషం. ఆవిడ ఎప్పుడువస్తుందా అని చాలమంది ఎంతోకాలంబట్టి కనిపెట్టుకునిఉన్నారు. ఆమె నేను సుస్తీగా ఉన్నసమయంలో వచ్చింది. నేను సమాజానికి వెళ్ళడంలేదు. చివరకు ఆనాడు నేను వెళ్ళేసరికి అనేకమంది వచ్చి నాచుట్టూ మూగారు. ఇంకా ఎక్కువమంది లేడీ స్మట్సుచుట్టూ చేరారు. ఆవిడ అందచందాలనుగురించీ, గుణగణాలనుగురించీ నా చుట్టూ ఉన్నవారంతా గొప్పగా చెప్పసాగారు. నే నావిడను పరీక్షగా చూచాను. ఆవిడ చాలా అందగత్తె. అందులో సందేహంలేదు. కాని ఆవిడ చాలా దురహంకారిలా నాకు కనుపించింది. అమితమైనగర్వం ప్రదర్శించింది. ఇవన్నీ చూచే

సరికి నాకు అసహ్యంపుట్టుకొచ్చింది. చెప్పొద్దూ! అప్పటి వరకూ సమాజమన్నా, సమాజకార్యక్రమాలన్నా నా కెంతో అభిమానంఉండేది. కాని ఈవిషయం కళ్ళారా చూచినతరువాత ఆనాటితో నా అభిమానమంతా గంగలో కలిసింది. ఆ మరుసటిరోజు, అక్కడికి దాపులోఉన్న ఒకపాడు పడ్డకోటను చూడడానికి అంతా ఎక్స్‌కర్షన్(వినోదయాత్ర)కు బయలుదేరారు, దానికి లేడీ స్మట్సు ఆధ్వర్యంవహించింది. నన్నుకూడా రమ్మనిపిలిచింది. నేను రానని చెప్పాను. కాని తక్కినవారంతాకూడా ఆవిడవెంట వెళ్ళారు. నాకుచాలా కష్ట మనిపించింది. ఆ చోటంటే నాకు తగని అసహ్యం పుట్టు కొచ్చింది. నాలో వచ్చినమార్పుకు నేనే ఆశ్చర్యపోయాను. అక్కడుండేవారంతాకూడా, నాకు శుద్ధ అవివేకుల్లా కనుపించారు.అక్కడ ప్రతివిషయంపైనా నాకు విసుగుపుట్టింది. ఎందుకొచ్చానా- అని దుఃఖంవచ్చింది. వీలయినంతత్వరలో మళ్ళీ మా దేశం - రష్యా వెళ్ళిపోవాలనిపించింది. నా అంతరంగంలో ఏదో దుష్టమైనభావం ప్రవేశించింది. కాని అదేమిటో నేను తెలుసుకోలేకపోయాను నాకు వంట్లో బాగుండలేదని చెప్పి, సభలకూ, సమావేశాలకూ వెళ్ళడం మానేశాను. ఎప్పుడన్నా ప్రొద్దుటమాత్రం మంచినీళ్ళు తెచ్చుకోడానికి వెళ్ళేదాన్ని. అప్పుడు మేరీ అనేఆవిడ నాతోవస్తుండేది. ఆవిడ రష్యన్ స్త్రీ. నాకు బాగా పరిచయస్థురాలు. అప్పుడప్పుడు ఆవిడతోకలిసి అలా పొదలవైపు కాస్త తిరిగిరావడానికి వెడుతుండేదాన్ని. ఇప్పుడు మావారు అక్కడ లేరు. ఏదోపనిమీద 'హీడెల్‌బర్గ్' వెళ్ళారు. కొద్దిరోజులదాకా

రాలేను. వారు వచ్చేసరికి నా ఆరోగ్యంకోసం సముద్ర స్నానాలుచెయ్యడం పూర్తిఅవుతుంది. తరువాత ఆయనా నేను రష్యా వెళ్ళిపోతాం.

ఒకమాటు లేడీస్మైట్సు - ఒక వినోదయాత్ర ఏర్పాటు చేసి - అందుకు మా సమాజంలోనివారందరినీ ఆహ్వానించింది కాని నేనూ, మేరీ భోజనాలుచేసి కోటచూడడానికి బయలుదేరాం. మేం బండిమీద వెళ్ళాం. త్రోవలో చుట్టూ సుందరమైనదృశ్యాలు. బాటకిరుప్రక్కలా పెద్దపెద్ద అడవిబాదంచెట్లూ, అవతల దూరంగా చిన్నచిన్న పొదలు- ఎంతో మనోహరంగా కనుపిస్తున్నాయి. సాయంసంధ్య వేళ సూర్యుని బంగారుకిరణాలు వచ్చి పుడమిపై పరుచుకున్నాయి. ప్రకృతిఅంతా ఎంతో శోభగా ఉంది. నేనూ మేరీ - ఒకిటేమైన ధోరణిగా మాట్లాడుకుంటున్నాం. మేరీని నేను ఎంతోకాలంబట్టీ ఎరుగుదును. కాని ఇప్పుడెందుకో మొదటిసారిగా మేరీ- నాకళ్ళకు చాలా అందకత్తెలా, తెలివైనదిలా కనుపించింది! ఆవిడతో స్నేహంచేయవచ్చుననీ, ఎన్నెన్నో రహస్యాలు మాట్లాడుకోవచ్చుననీ అనిపించింది. మా సంసారాలనుగురించీ, మా పిల్లలనుగురించీ, బేడెన్‌లో జీవితాన్నిగురించీ - ఆవిడా నేనూ ఒకరికొకరం చెప్పుకున్నాం. తరువాత మా రష్యాదేశాన్ని గురించీ, అక్కడ పల్లెటూళ్ళలోఉండే హాయినిగురించీ మాట్లాడుకున్నాం. మా మనస్సుల్లో ఒకమాటు ఆనందం, ఒకమాటు విషాదం - ఆవరించేవి. ఇలా కబుర్లు చెప్పుకుంటూ కోటకు చేరుకున్నాం. కోటలో చల్లగా, నీడగా ఉంది. శిథిల

మైన కోటకొమ్మున అస్తమిస్తున్న సూర్యుని బంగారుకాంతి వచ్చిపడి తళతళలాడుతోంది.

మేం కోటగుమ్మంలో కూచున్నాం. తల్లికడుపులోకి వెడుతున్న సూర్యుణ్నీ, చుట్టూ ఉన్న బేడెన్ సుందరప్రకృతినీ తిలకిస్తూ కూచున్నాం. మా కెక్కడనుంచో మాటలు విని పించాయి! అంతకంతకూ అవి పెద్దవయినాయి. ఎవరాఅని నాకు కుతూహలం కలిగింది ఒకచెవి అటుంచి శ్రద్ధగా విన సాగాను. ఆ గొంతులు నాకు పరిచితమైనవే. రెండుగొం తులు - ఒకటి ఇటాలియన్ యువకుడు మార్కోన్‌ది - రెండోది ఫ్రెంచిదేశస్థుడిదీ. వారు నన్నుగురించీ, లేడీ స్మిత్సునుగురించీ మాట్లాడుకుంటున్నారు. మా ఇరువురి అందచందాలనుగురించి ఫ్రెంచిదేశస్థుడు చెపుతున్నాడు. మా సౌందర్యంలోని తేడాలను వర్ణిస్తున్నాడు. నాకు ఆశ్చ ర్యంవేసింది. గుండెలు దడదడకొట్టుకున్నాయి. వారుచెప్పు కునే ప్రతిమాటా వినాలనిపించింది. వింటున్నాను. నేను ఒకబిడ్డ తల్లిననీ, లేడీ స్మిట్సు కేవలం పందొమ్మిదేండ్ల పిల్ల అనీ అతను చెపుతున్నాడు. నాకంటే లేడీస్మిట్సు ఎంతయో అందకత్తె అనీ, రూపురేఖల్లో ఆవిడనుమించిన వారెవరూ లేరనీ అతను అంటున్నాడు - 'అబ్బాయ్! నీ స్నేహితురా లున్నదే, ఆవిడలో ప్రత్యేకంగా చెప్పుకోదగ్గదేమీ లేదు. మామూలుగా రష్యన్ రాకుమార్తెలంతా ఎలాఉన్నారో ఈవిడా అలాగేఉంది. ఇలాంటిపిల్లలను ఇక్కడ మేం ఇటీవల తరుచుగా చూస్తున్నాం' అని చెపుతున్నాడు, స్నేహితు డితో - చివరకు - నేను లేడీ స్మిట్సుతో పోటీపడకుండా

తప్పించుకోవడంలో తెలివిగలపని చేశాననీ, లేకపోతే నేను అభాసుపాలయ్యేవాడిన్ననీ అంటున్నాడు - 'ఆవిడంటే నాకు జాలివేస్తోందోయ్! ఆవిడ నీతోత్రృప్తిపడి కాలక్షేపంచెయ్యడం మంచిది!'- అన్నాడా ఫ్రెంచిదేశస్థుడు. ఇలాఅని వికృతంగా నవ్వాడు.

'ఆవిడ ఇక్కడనుంచి వెళ్ళిపోయినా నేను వదిలిపెట్టబోను. ఆవిడవెంటపడతానంటే నమ్ము!'- అంటున్నాడు, మార్క్విస్, ఉద్రేకంతో.

'కాని, ఆవిడభర్త ఆవిడ నింకా ప్రేమిస్తున్నట్లే ఉన్నాడోయ్!'-అన్నాడు మళ్ళీ ఫ్రెంచివాడు.

'ఏమైనా కానీ - ఆవిడను చూడంది ఒక్కక్షణం ఉండలేను. ప్రేమలేకపోతే అసలు జీవితమేమిటి? నేను ప్రేమజీవిని - స్త్రీలను ప్రేమించి, కామించి - భోగాలలో తేలిపోవడమే నా జీవితాశయం. ప్రేమకలాపాల్లో మధ్య నాకు ఎప్పుడూ విఘాతంకలగదంటే నమ్ము. నేను దానిఅంతుచూస్తే కాని నిద్రపోను.' అన్నాడు మళ్ళీ. ఇటాలియన్ మార్క్విస్, 'భళే,భళే! నీవు వీరుడవోయ్! నీ కోరిక సఫలమగుగాక!'- అంటూ ఆశీర్వదించాడు ఫ్రెంచివాడు.

తరువాత నాకు వినిపించలేదు. వారు అక్కడనుంచి మేం ఉన్నవైపుకు వస్తున్నారు. వాళ్ళపదధ్వని నాకు వినిపించింది. కాసేపటికల్లా అవతలప్రక్కనుంచి మేం కూచున్న చోటికి వచ్చారువారు. మమ్మల్నిచూచి నిర్ఘాంతపోయారు. నాకూ సిగ్గుతో ముఖమంతా కందిపోయింది. మార్క్విస్ ఎకాఎకి నన్నుసమీపించి తనచెయ్యి నాకు అందించాడు.

నేను నిరాకరించలేదు. అతనిచెయ్యిపట్టుకుని అతనివెంట వెళ్ళాను. మేం ముందు పోతున్నాం. మేరీయున్నూ, ఆ ఫ్రెంచిదేశస్థుడున్నూ కాస్త వెనకాల వస్తున్నారు. బండి అల్లంతదూరాన ఉంది.

నన్నుగురించి ఆ ఫ్రెంచివాడన్నమాటలు నిజమేనని పించింది. నా అందచందాలనుగురించి నే నేమనుకుంటు న్నానో - అతనూ అదే అనుకుంటున్నాడు. కాకపోతే, నేను మనస్సులో అనుకున్నాను - అతను మాటలతో పైకి చెప్పాడు. అంతే తేడా! కాని మార్క్విస్ నావిషయంలో అంత నిర్భయంగా, సాహసంతో మాట్లాడినందుకు నాకు ఆశ్చర్యం వేసింది. నామనసు చలించింది. కాని అత నలా నా చెయ్యిపట్టుకుని వెంటరావడం నాకు కష్టమనిపించింది. అతనివంక చూడలేదు. అతనుచెప్పేది వినలేదు. అతనికి సమాధానం చెప్పలేదు. చెయ్యివదిలించుకొని వెనకాల వస్తున్న మేరీదగ్గరికి పరుగెత్తాలనుకున్నాను.

మార్క్విస్ నాతో ఏదేదో చెపుతున్నాడు. తలవని తలంపుగా ఇక్కడ కలుసుకున్నామనీ, తన కెంతో సంతో షంగాఉందనీ అంటున్నాడు. ఇంకా ఏవేవో చెప్పాడు. అవేవీ నేను వినిపించుకోడంలేదు. ఆక్షణంలో మావారూ, నా కొడుకూ, మా ఇల్లూ, మా రష్యాదేశం - ఇవన్నీ మనసులోకి వచ్చాయి. నా కొకవిధమైన బాధకలిగింది. ఏదో అవమానం పొందినట్టనిపించింది. నేను ఒక్కపరుగులో మేంఉన్నబసకు వెళ్ళాలనిపించింది. అక్కడ గదిలో తలు పులు బిగించుకుని కూచోవాలనిపించింది. జరిగినవన్నీ తలపో

సుకోవాలనిపించింది. కాని మేరీ - నా వెనకాల మెల్లగా వస్తున్నది. బండి ఇంకా నాకు దూరంలో ఉంది. మార్క్వెస్ మరీ అడుగులో అడుగువేసుకుంటూ నడుస్తున్నాడు. ఎలా గయినా ఆలస్యంచేసి - నన్ను వెనకబడేటట్లు చెయ్యాలనే అలా చేస్తున్నాడు. 'ఇలాంటి పిచ్చివ్యవహారాలు నాదగ్గర సాగవు!'- అనుకున్నాను, నాలో. వడిగానడవడానికి ప్రయ త్నించాను. కాని అతను పట్టుదలతో - కావాలనే నన్ను ఆపివేశాడు. నాచెయ్యి గట్టిగా నొక్కాడు. వెనకాలవస్తున్న మేరీ, ఫ్రెంచివాడు - మరీ కుంటినడక నడుస్తున్నారు. వారికీ మాకూ పొదలు అడ్డువచ్చాయి. ఇహ వారు మాకు కని పించడంలేదు. మే మిరువురం ఒంటిగా మిగిలిపోయాం. నాకు వళ్ళువణుకుపుట్టింది. చచ్చేభయంవేసింది.

'నన్ను క్షమించండి!'- అంటూ అతనిచెయ్యి విడి పించుకోడానికి ప్రయత్నించాను. కాని నా లేసుకొంగు అతని కోటుగుండీకి తగుల్కొన్నది. అతను ముందుకువంగి దాన్ని తప్పించబోయాడు. అతని వ్రేళ్ళు నాచేతికి తాకాయి. నా కేదో 'షాక్' కొట్టినట్టయింది. విచిత్రమైన కొత్తఅనుభవం కలిగింది. నా నరాల్లో విద్యుత్తు ప్రవహించినట్టనిపించింది. ఆపాదమస్తకం కంపించిపోతున్నాను. అతనివంక తీక్షణంగా చూచాను. కాని నాచూపు నిలవలేదు. కళ్ళు అరమూతలు పడ్డాయి! అతనిముఖంనిండా చిరుచెమటపోసింది. అతని నేత్రాలు జ్వలిస్తున్నాయి. మోహపరవశుడై నాముఖంలో ముఖంపెట్టి చూచాడు. నావంక - నా వక్షోజాలవంక పరీ క్షగా చూచాడు. రెండుచేతులతో నన్ను గట్టిగా పట్టుకు

న్నాను. అతనిపెదవులు విప్పారాయి. మెల్లగా ఏదో చెప్పాడు - 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీవే నా సర్వస్వం, నీవే నా ప్రపంచం !' అన్నాడు. అతనిపెదవులు నా పెదవుల్ని సమీపించాయి. అతనిచేతులు నన్ను విడిపించుకో నివ్వకుండా గట్టిగాపట్టుకున్నాయి. నా శరీరమంతా నిప్పుల్లో పెట్టినట్టుంది - భగ్గున మండిపోతున్నది ! నా నరనరాల్లోనూ నిప్పు ఏటులు ప్రవహించాయి ! నాకనులకు మైకంకమ్మింది. గజగజ వణికాను. దూరంగా ఉండు - అని చెప్పబోయాను. కాని గొంతు పెగిలిరాలేదు. అంతలోనే నా చెక్కిలిముద్దాడాడు అతను. నేను ఏమైపోతున్నానో నాకు తెలీదు. నా వళ్ళంతా గడ్డకట్టుకుపోయింది. ఆగి, అతనివంక చూచాను. నాకు మాట్లాడేశక్తిలేదు. కదల్లేను - మెదల్లేను అలాగే నిర్జీవినై నిలుచుండిపోయాను - దేనికో తెలీదు ! ఇదంతా ఒక్కక్షణంలో జరిగిపోయింది కాని ఆక్షణం తలుచుకుంటే గుండె గుభిల్లుమంటుంది. అప్పుడు నే నతన్ని బాగా పరిశీలించి చూడగలిగాను. విశాలమైనముఖం, కోటేరు వేసినట్టున్న ముక్కు, తీర్చిదిద్దినట్టున్న కనుబొమలు - నెత్తిమీద గడ్డిటోపీ - అచ్చం మావారికిమల్లేనే కనుపించాడు. అతని మీసాలు పొడుగ్గా- మెలితిరిగి ఉన్నాయి. నున్నటి చెక్కిళ్ళు, ఎండతాకి ఎర్రగా కందిన మెడ,- అతనెవరో పరాయిమగవాడు. అతనంటే భయం అసహ్యం రెండూ కలిగాయి. కాని, ఆతరుణంలో ఆ పరాయిపురుషుడిప్రభావానికి నేను ఎంతగా లొంగిపోయాను! అతను నాలో ఎంతగా కామోద్రేకాన్ని కలిగించాడు ! అబ్బ ! అతన్ని మళ్ళీ గట్టిగా ముద్దు

పెట్టుకోవాలని బుద్ధిపుట్టింది నాకు. అతనిచేతులు ఎంత తెల్లగా, ఎంత మృదువుగా ఉన్నాయి! నాఅంతట నేనే వెళ్ళి అతనికౌగిట్లో ఒదిగిపోవాలనిపించింది. తుచ్ఛభోగం - అనే అఖాతంలో దూకాలనిపించింది! అవును - నాకట్టెదుటనే నోరు తెరుచుకుని ఉన్నది ఆ అఖాతం... ...

అబ్బ! ఎంత కష్టంగాఉంది నాకు! ఇంతకంటె దుర్భరమైన కష్టంవచ్చి పిడుగులా నా తలపై పడి ఎందుకు బ్రద్దలు కాకూడదూ? అనుకున్నాను నాలో నేను. అతను తనచెయ్యి నా నడుంచుట్టూవేసి నన్ను దగ్గరికిలాక్కున్నాడు. నాముఖం మీాదికి వంగాడు - 'కానీ - నీఇష్టంవచ్చినట్లే కానీ - ఇంతకంటె వేయిరెట్లు ఎక్కువ పాపంలో, పరాభవంలో నన్ను పడిపోనీ!'- అనుకున్నాను నాలో నేను.

'నేను నిన్ను ప్రాణప్రదంగా ప్రేమిస్తున్నాను!'- అని గుసగుసలాడాడు అతను - అచ్చం మావారిలాగానే!

మావారూ, నా కుమారుడూ జ్ఞాపకంవచ్చారు. ఒకప్పుడు నే నెంతగానో ప్రేమించిన ఈ ఇరువురూ ఇప్పుడు నాజీవితంనుండి వేరయిపోయినట్లు తోచింది. సరిగ్గా ఆసమయంలో - అవతలవైపునుంచి మేరీ నన్ను బిగ్గరగా కేక వేసింది. నేను ఉలిక్కిపడ్డాను. అప్పుడు నాకు స్పృహ వచ్చింది. అతన్ని విదిలించి వేసి - అటువైపు చూడకుండా మేరీదగ్గరికి పరుగెత్తాను.

మేం బండ్లో ఎక్కాం. అప్పుడు అతనివంక చూశాను. అప్పు డతను టోపీతీసి - పశ్చాత్తకంగా నావంకచూచి నవ్వాడు. అతనంటే నాకు అసహ్యంగాఉన్నదని అతనికి

అర్థంకాలేదు. 'మనం ఇలాగే రోజూ రహస్యంగా ఎక్కడైనా కలుసుకుంటూ ఉందామా?'- అని నన్ను అడుగుతున్నట్లుగా అగుపించాడు.

ఇహ నాకు సుఖంలేదు. శాంతిలేదు. మునుపు అంధకారంలో గడిపాను. ఇప్పుడు పాపంలోపడి ఈదులాడుతున్నాను. ఇహముందు ఆశలేదు. అంతే! మేరీ నాతో ఏదేదో మాట్లాడుతోంది. కాని అవేవీ నాకు వినిపించడంలేదు. నా ప్రవర్తనచూచి ఆవిడకూ అసహ్యంపుట్టింది కాని అది పైకి కనుపించకుండా ఏవో కల్ల - బొల్లికబుర్లు చెపుతోంది నాపై జాలికలిగినట్లు మాట్లాడుతోంది - అంతే అనిపించింది నాకు. ఆవిడ ప్రతిమాటా, ప్రతిచూపూ అదే భావాన్ని వ్యక్త్యంచేస్తున్నాయి. ఛీఛీ! పరపురుషుడు నన్ను ముద్దాడాడు. అది తలుచుకుంటే నాశరీరం దహించుకపోతోంది ఇంతకంటె నీచం, పరాభవం మరేం కావాలి? పాడుబ్రతుకు. మావారు జ్ఞాపకంవస్తే మరీ భరించలేకుండా ఉన్నాను

గదిలో ఒక్కదాన్ని కూచుని నా పరిస్థితినిగురించి ఆలోచించసాగాను. ఒక్కదాన్ని ఉండలేకపోయాను. పనిమనిషి టీ తీసుకొచ్చినా ముట్టుకోలేదు. ఏదో జ్వరం వచ్చినట్టుంది. నావళ్ళు నాకు తెలియలేదు. గబగబా లేచి మూటాముల్లే సర్దాను. సాయంత్రం రైల్లో మావారున్న చోటికి వెళ్ళడానికి ప్రయాణంఅయ్యాను.

ఎవరూలేనిపెట్టెలో నేనూ, మా దాసీ ఎక్కి కూచున్నాం. రైలు కదిలింది కిటికీల్లోనుంచి చల్లనిగాలివచ్చితాకు

తోంది. నామనస్సు కొంచెం చల్లబడింది. జరిగినదాన్ని జరగబోయేదాన్ని గురించి స్థిమితంగా ఆలోచించుకోడం మొదలుపెట్టాను నాకు పెండ్లయినలగాయతూ గడిపినజీవితం తరువాత బస్తీకి వచ్చినప్పటినుంచీజరిగినజీవితం ఒకకొత్త వెలుగులో నా కనులముందు పొడగట్టాయి. మా పెండ్లయినకొత్తలో మేం పల్లెటూళ్లోఉండడం, అప్పుడు మేం కన్న కలలూ, వేసుకున్న పథకాలూ - తొలిసారిగా ఎంతో మనోహరంగా మనసులో మెదిలాయి. 'ఇంతకాలంబట్టీ మావారు నావల్ల సుఖపడుతున్నారా?'- అన్న ప్రశ్న మొదటిసారిగా వచ్చింది. నే నాయనకు అపచారంచేశానని పించింది. - 'అవుతే' ఆయన నన్నెందుకు ఆపకూడదూ? నా ప్రవర్తనను ఎందుకు సరిదిద్దకూడదూ? ఎందు కీమోసం! ఈ నటన? ఎందుకు తన మనసులోనిమాట చెప్పరూ! నన్నెందుకు అవమానించడం! తన అనురాగంతో నన్నెందుకు ఆకర్షించరు!- అసలు, వారు నన్ను ప్రేమించడమే లేదా-'- ఇలా ఎన్నెన్నో ప్రశ్నలు వేసుకున్నాను. ఆయనతప్పు ఉన్నా లేకున్నా - పరపురుషుడు నన్ను ముద్దాడినవిషయం మాత్రం నా కింకా జ్ఞాపకంఉంది. హోటెల్ బస్సు దగ్గరికివస్తున్నకొద్దీ మావారు నాకళ్ళలో మెదలసాగారు. ఆయన్ను కలుసుకోడం ఎలాగని అంతకంతకూ భయంపుడుతోంది.- 'జరిగినదంతా వారితో చెపుతాను. ఏడుస్తాను. నన్ను క్షమించమని వేడుకుంటాను'- అనుకున్నాను. కాని 'జరిగినదంతా,' అంటే ఏమేమిచెప్పాలో నాకు తోచడంలేదు. పైగా ఆయన క్షమిస్తారనికూడా నమ్మకంలేదు.

రైలుదిగాను. మావారున్నచోటికి వెళ్ళాను. ప్రసన్న మైన ఆయనముఖం చూచేసరికి నా కంతా పోయింది. చెప్ప వలసింది ఏమీ లేదనిపించింది. క్షమాపణకోరుకోవలసింది ఏమీలేదని తోచింది. నా దుఃఖాన్నీ, బాధనూ లోలోపలే దిగమింగుకున్నాను.

'ఇదేమిటీ! ఇట్లా వచ్చేశావు! రేపు నేనే రావాలను కుంటున్నానే!'- అని అడిగారు ఆయన నన్ను చూచీచూడ డంతోనే - నా ముఖకవళికలు పరిశీలించిచూడగానే వారి కేదో గాభరాకలిగింది - 'ఏమిటి విషయం ? ఏం జరిగిందే మిటి ?- 'ప్రమాదంఏమీ లేదుకదా ?'- అని వెంటవెంటనే అడిగారు

'ఏమీలేదు -' అన్నాను నేను ముక్తసరిగా - 'నేను రావడమే మంచిదయింది. మనం రేపే రష్యా వెళ్ళిపోదాం పదండి -' అన్నాను దుఃఖం ఆపుకుంటూ. ఆయన నాకేసి పరీక్షగా చూచారు. కొంచెంఆగి - 'అసలు ఏంజరిగిందో చెప్పు ?'- అని మళ్ళీ అడిగారు. నాముఖం జేవురించింది. తల వాల్చుకున్నాను. ఆయనకు కోపంవచ్చింది. ఏదైనా అనుమానిస్తారేమోఅని ఇహ ఊరుకోకుండా- 'ఏమీలేదండీ. ఒక్కదాన్ని అక్కడ ఉండలేకపోయాను అస్తమానం మీరే జ్ఞాపకంవస్తున్నారు. ఇహ మనఊరికి పోదాం పదండి'- అన్నాను. నా కళ్ళలో నీళ్ళుతిరిగాయి.

'ఏమిటది, పిచ్చిపిల్లా! మనదగ్గర డబ్బుఅయిపోయిం దని ఊరికివెడదామంటున్నావు కదూ ? కాని అక్కడున్నంత కాలం మనం ఒక భ్రాంతిలోఉంటాం! సరే - ముందు కొం

చెం చే తాగు. బడలికతీరుతుంది'- అన్నా రాయన; ఇలా అని నౌకరును పిలిచారు.

ఆయనమనసులోని భావాలు ఏవేవో నేను ఊహించుకున్నాను. నాకు భరించరానిదుఃఖం పొర్లుకొచ్చింది అప్పుడు. వారు నన్ను అర్థంచేసుకోలేరు - అనుకున్నాను. పిల్లవాడిదగ్గరికి వెడతానని చెప్పి అక్కడనుంచి వెళ్ళిపోయాను. గదిలో కూచుని నాలో నేను కుమిలికుమిలి ఏడ్చాను... ...

# 9

ఎంతకాలంబట్టో ఎవరూలేకుండా వదిలిపెట్టివచ్చిన నికొలొసాన్కాయ్‌లోని మా ఇంట్లోకి ఇప్పుడు మళ్ళీ కళ - కాంతులు వచ్చాయి. కాని మా సంసారజీవితంలోమాత్రం సుఖంరాలేదు. మా అత్తగారు చనిపోయారు. లంకంత లోగిట్లో మే మిద్దరం మిగిలాం. ఇద్దరమే ఉన్నాంకదా, సుఖంగాఉన్నామా అంటే - అదీలేదు. పైగా ముళ్ళమీద ఉన్నట్లున్నది. ఆ చలికాలం మరీ అధ్వాన్నంగా గడిచిపోయింది. నాకు మళ్ళీ జబ్బుచేసింది. ఆ జబ్బు - మా రెండోపిల్లవాడు పుట్టిందాకా కోలుకోలేదు. మా భార్యాభర్తలమధ్య సంబంధాలు వెనకటిలాగే ఉన్నాయి. బస్తీలోఉన్నట్లుగానే ఏదో ఆవాహన - విసర్జనా లేకుండా కాలక్షేపంచేస్తున్నాం. కాని ఆ పల్లెటూళ్ళో - ప్రతిరాయి, ప్రతిగోడ - ప్రతివస్తువు - పూర్వం మావారు ఎట్లావుండేవారో పిలిచి జ్ఞాపకంచేసి, నేనేదో పోగొట్టుకున్నానని చెపు

తున్నాయి ఏదో క్షమించరాని అపరాధంవచ్చి మా ఇరువు రినీ వేరుచేసినట్లు కనిపిస్తుంది దేనికో ఆయన నన్ను శిక్షిస్తు న్నట్లూ, పైగా ఆవిషయం తనకేమీ తెలియనట్లు నటిస్తు న్నట్లూ అనిపిస్తోంది. క్షమించమని అడగడం నిష్ప్రయోజనం. అయినా ఏముందక్కడ - క్షమించమని అడగడానికి? ఆయన మునుపటిలా మనస్ఫూర్తిగా నాతో మాట్లాడడంలేదు. తన సర్వస్వం నాకు అర్పించడంలేదు. తన అంతరంగంవిప్పి చెప్పడంలేదు ఆవిధంగానన్ను శిక్షిస్తున్నారు పోనీమరెవరిపైనా మక్కువగొన్నారా? అంటే అదీలేదు కాబట్టి ఆయనకు హృదయమనేదే లేదనుకోవచ్చు.

ఒక్కొక్కప్పుడు తను కేవలం నన్ను హింసిస్తున్న ట్లుగా నటిస్తున్నారనుకునేదాన్ని. నిజానికి వెనకటిగుణాలు ఆయనలో ఉన్నాయనుకునేదాన్ని. వాటిని బయటికిలాగడం కోసం ప్రయత్నించేదాన్ని. కాని ప్రతితడవా ఆయన తప్పించు కుంటూనేవచ్చారు. నన్ను ఏదో అనుమానిస్తున్నట్లుగా దూరంగా తొలిగిపోతూవచ్చారు. ఆయన మాట, చూపు - నా కన్నీ తెలుసు. నీవేమీ చెప్పక్కర్లేదు. నీ తత్త్వం నే నెరుగుదును. నీవు చెప్పేది ఒకటి - చేసేది ఒకటి !'- అంటు న్నట్లుగా ఉండేది. మొదట మొదట ఆయన నిష్కల్మషంగా మాట్లాడతారంటే నా కేదో భయంగాఉండేది. కాని తరు వాత తరువాత ఆయ నలా నిష్కల్మషంగాఉండే అవసరం లేదనిపించింది. నన్ను మీరు అనుమానించవద్దు. నేను మిమ్మల్నే ప్రేమిస్తున్నాను - అని చెప్పలేకపోయేదాన్ని. నాతోకలిసి దైవప్రార్థనలుచెయ్యండి - అనిగానీ, నేను పాట

పాడతాను వినండి - అనిగానీ అడగలేకపోయేదాన్ని ఏవో కొన్ని కట్టుబాట్లకులోబడి మా సంబంధాలు కొనసాగుతున్నట్లు కనుపిస్తూవచ్చింది. ఎవరికివారు అయిపోయి, వేరు వేరులోకాల్లో జీవిస్తూవచ్చాం. నాతో ఎలాంటి అవసరం లేకుండా ఆయనవ్యవహారాలు ఆయన చక్కబెట్టుకుంటున్నారు. ఆయనతో ప్రమేయంలేకుండా నా పనులు నేను చేసుకపోతున్నాను. పోతే మా పిల్లలిద్దరూ ఇంకా పసివాళ్ళు. మా అవస్థ అర్థంచేసుకుని మమ్మల్ని కలిపేస్థితిలో లేరు.

అంతలో వసంతఋతువు వచ్చింది. మా చెల్లెలు సోన్యా, కాట్యా - వేసవిలో గడపటానికి మళ్ళీ మాఊరు వచ్చారు. నికోలస్కాయ్‌లోని మా ఇల్లు పడగొట్టి బాగు చేయిస్తున్నందువల్ల - మేంకూడా పొక్రొవ్‌స్కాయ్‌కి వెళ్ళాం. నేను పుట్టి పెరిగిన ఇల్లది. మేడమీద గది, డ్రాయింగ్‌రూంలో పాత టేబుళ్ళు, పియానో - అన్నీ అలాగే ఉన్నాయి. చిన్నతనంలో నేనక్కడే ఎన్నెన్నో కలలు కన్నాను. ఇప్పుడవన్నీ మాసిపోయాయి. నేను ఆడుకున్న తోట - తిరిగినస్థలాలు - అన్నీ అదోలా కనుపిస్తున్నాయి. నాగదిలో రెండు చిన్న మంచాలున్నాయి. అందులో ఒకటి. నాది. దానిమీద మా పెద్దబ్బాయి కొకోషా కాళ్ళూ చేతులూ పారచాచుకొని నిద్రపోతున్నాడు. వాడు ఎంతో బొద్దుగా, ముద్దుగా ఉన్నాడు. దానిప్రక్కనే ఉయ్యాల తొట్టి. అందులోనుంచి మా చంటివాడు వాన్యా తొంగి తొంగి చూస్తున్నాడు! పొత్తిగుడ్డలన్నీ కాళ్ళకు చుట్టివేసుకున్నాడు.

పిల్లలిద్దరికి శిలువగుర్తు కళ్ళకద్ది పడుకోబెడదామని నే నా గదిలోకి వెళ్ళాను. అక్కడ ప్రతిగోడ, ప్రతిమూల, ప్రతి తెరగుడ్డ - కాలగర్భంలో కరిగిపోయిన నా బాల్యస్వప్నా లన్నింటినీ ఒక్కమాటుగా గుర్తుకుతెచ్చాయి. నా చిన్న తనంలో నేనాగదిలో ఎంతహాయిగా గడిపాను! ఎన్నెన్ని పిచ్చి చేష్టలు చేశాను! ఎన్నెన్ని ఆటలాడాను. పాటలుపాడాను! ఇప్పు డవన్నీ ఏవీ! ఎక్కడికి పోయాయి? ఆ మధురస్వప్నాలు మళ్ళీ ఎన్నటికైనా తిరిగివస్తాయా! ఆనాడు కల్లగా కను పించిన కలలన్నీ తరువాత నిజమయ్యాయి. ఆనాడు నిజంగా తోచినవన్నీ అటు పిమ్మట కల్లలయినాయి. నా బ్రతుకంతా చట్టుబండలయింది. అంతా నికృష్టంగా, నిస్తేజంగా, నిర్వీర్యంగా నిరాశగా, మారిపోయింది. కాని తక్కినవన్నీ అలాగేఉన్నాయి. గదిలోకూచుని కిటికీలోనుంచి అవతలికి చూస్తే, మా తోటా దొడ్డీ యథాతథంగా ఉన్నాయి. పచ్చికబయళ్ళు, మైదా నాలు, చెట్లు, పొలాలు, బాటలు - దూరంగా కొండకనుమ చెరువు, నైటింగేల్సు పాడే పాటలు, మాయింటికి ఎదురుగా పొడిచివచ్చే చందమామ - వెన్నెల, అన్నీ ఉన్నాయి. కాని ఈ సుందరదృశ్యాలన్నీ నాకు వెనకటిమాదిరిగా కాక ఎంతో మారిపోయినట్లు - భయంకరంగా అగుపిస్తున్నాయి నా కెంతో సన్నిహితంగా ప్రేమాస్పదంగాఉండే ప్రతి వస్తువూ ఇప్పుడు కళావిహీనంగా కనుపిస్తున్నది వెనకటి లాగానే నేనూ మా కాట్యా చావిట్లోకూచుని మావారిని గురించి మాట్లాడుకుంటున్నాం. కాట్యా ఎంతో వృద్ధు రాలయిపోయింది. ముఖం ముడతలుపడింది. ఇప్పు డామె

కళ్ళలో పూర్వపు కళ - కాంతులు లేవు వృద్ధాప్యంవల్ల మనిషి క్రుంగిపోయి - ఏదో దిగులూ - విచారం ఆవరించుకున్నట్లు కనిపిస్తున్నది. పాపం; ఆ మెనుచూస్తే జాలిపుట్టుకొస్తున్నది. ఇప్పుడామే నేనూ వెనకటిలాగా మావారిని గురించి కులాసాకబుర్లు చెప్పుకోడంలేదు. ఎంతసేపు ఆయన్ను విమర్శించడంతోనే మాకు సరిపోతోంది. మేం అనుకున్నవన్నీ ఆచరణలో ఎందుకుపెట్టలేకపోయామన్న ఆలోచనే లేదు మాకు. పోనీ మేం ఏమనుకున్నామో, అవి ఎందుకు విఫలమయ్యాయో - మొదలైనవిషయాలు లోకానికి చెప్పవలసిన అవసరంకూడా కనుపించలేదు మాకు. ఇప్పుడు కాట్యా, నేనూ ఏవేవో గుసగుసలాడుకుంటున్నాం. మేం ఇంత అశాంతిగా, అసౌఖ్యంగాఉండడానికి కారణం ఏమిటని వెయ్యితడవలు ప్రశ్నించుకున్నాం. ఇంతమార్పు ఎలావచ్చిందని పదేపదే అనుకున్నారు. మావారిలో మార్పేమీ. లేదు కాకపోతే ముఖంమీద రేఖలు మరికొంచెం స్పష్టంగా కనుపిస్తున్నాయి. కనుబొమలు తెల్లబడ్డాయి. అంతే. నాలో కూడా పెద్ద మార్పేమీలేదు. కాని ఇప్పుడు ప్రేమఅనేది ఏకోశానా నాలోలేదు అసలు ఆ ఇచ్ఛ లేదు. ఏపనిచెయ్యడానికీ ఉత్సాహంలేదు. నాలో ఓర్పుఅనేది పూర్తిగా నశించింది. ప్రతి చిన్నవిషయానికీ కోపం, చిరాకు పుట్టుకొస్తున్నాయి. పూర్వం ఒకప్పుడు, ఒకరిని సుఖపెట్టడమే జీవిత పరమావధిగా కనుపించింది నాకు. కాని ఇప్పుడది శుద్ధ తెలివితక్కువ అనిపిస్తోంది. ఒకరికోసం - మనం జీవించడమేమిటి ?- నామీద నాకే శ్రద్ధలేనప్పుడు మరిఒకరిమీద

ఎలాఉంటుంది ? వెఱ్ఱి ?- అందుకే మావారిపై పూర్వం నాకున్న ప్రేమ - అనురాగం, - అన్నీ మటుమాయమై పోయాయి.

పీటర్సుబర్గు వెళ్ళినప్పటినుంచీ నా సంగీతానికి ఉద్వాసం చెప్పాను. నా పియానో బూజుపట్టిపోయింది. దాన్ని చూస్తుంటే ఇప్పుడు మళ్ళీ వాయించాలని బుద్ధిపుడుతోంది. ఒకనాడు నాకు వంట్లో బాగా లేదు. ఇంట్లోనే ఉండిపోయాను. నికోలస్కాయ్‌లో మాఇల్లు పడగొట్టి కొత్తది కట్టిస్తున్నాం కదూ! అందుకని చూచివద్దామని మావారు కాట్యానూ, సోన్యాను వెంటబెట్టుకుని అక్కడికి వెళ్ళారు. ఇహ ఇంట్లో నే నొక్కదాన్నే వా రెప్పుడొస్తారా అని చూస్తూ చావిట్లో పియానోవాయించుకుంటూ కూచున్నాను. 'సెలరాజా!' అనే పాటపాడుతున్నాను. చుట్టుప్రక్కల ఎవరూ లేరు. అంతా ప్రశాంతంగాఉంది. తోటవైపు వాకిళ్ళు తెరిచిఉన్నాయి. పాటలో మొదటి నాలుగుచరణాలూ పాడి ఆపాను. నాకు తెలియకుండానే అలవాటుచొప్పున, మావా రెప్పుడూ కూర్చుండే మూలవైపు చూచాను. కానిఆయన లేరు.ఆయన కూచునే కుర్చీమాత్రం ఉంది కిటికీలోనుంచి చూచాను. పొదలు, పూలమొక్కలు కనుపిస్తున్నాయి. సాయంసంధ్యా రాగంలో అన్నీ తళతళ మెరుస్తూ ప్రకాశిస్తున్నాయి. పియానోపైన మోచేతులు మోపాను. చెంపలక్రింద చేతులుపెట్టుకుని దీర్ఘాలోచనలో మునిగిపోయాను. గడిచినరోజులన్నీ జ్ఞాపకంచేసుకున్నాను. గడవనున్న కాలాన్నిగురించి ఆలోచించుకున్నాను. ఉహుఁ, ఎక్కడా ఆశలేదు. అంతా

శూన్యం! 'నా బ్రతుకు వృథాయేనా?'- అనుకున్నాను. భయంపుట్టింది. ఆ ఆలోచన మరిచిపోవాలనిపించింది. వెంటనే మళ్ళీ పియానో వాయించడం మొదలుపెట్టాను 'ఈశ్వరా! నే నేమైనా తప్పుచేస్తే క్షమించు! నా ఆత్మకు మళ్ళీ ఆనందాన్ని కలిగించు. లేదా నేను ఏం చెయ్యాలో - ఎలా జీవించాలో బోధించు ప్రభూ!'- అని లోలోపల భగవంతుణ్ణి ప్రార్థించుకున్నాను ఎవరో మెట్లెక్కి నడిచివస్తున్న చప్పుడు వినవచ్చింది. ఆ పదధ్వని నాకు పరిచితమైందే! వరండాదాకా వచ్చి చప్పుడు ఆగిపోయింది. నేను తలఎత్త లేదు. పాట వాయిస్తున్నాను. అంతలో నా బుజంమీాద ఎవరో చెయ్యివేశారు. 'చాలా తెలివైనపిల్లవే! ఆపాటే వాయిస్తున్నావూ!'-అన్నారాయన. నే నేం మాట్లాడలేదు-'నీ వింకా టీ తాగలేదా?'- అని మళ్ళీ అడిగారు. ఆయనవంక చూడకుండా - లేదన్నట్లు తలఊపాను. 'దారిలో వెధవది, గుఱ్ఱంఒకటి మాటవినలేదు. అందువల్ల కాట్యా, సోన్యా రహదారిన నడిచివస్తున్నారు.' అన్నా రాయన.

'సరేలెండి - వాళ్ళువచ్చిందాకా ఆగుదాం'— అన్నాను నేను. ఇలాఅని నడవలోనికి వెళ్ళాను. ఆయనా నాతో వస్తారనుకున్నాను. కాని ఆయన పిల్లలెక్కడున్నారని అడిగి - వాళ్ళదగ్గరికి వెళ్ళారు. ఆయన రావడం, ప్రేమతో మాట్లాడడం - వీటివల్ల మళ్ళీ నాలో ఏదో ఆశ మొలకెత్తింది 'నాకు కొంత ఏముందికనుక? వా రెంతో మంచివారు. అలాంటిపెనిమిటి దొరకడం దుర్లభం.నా మంచి ఏదో నాకే తెలీక తికమకపడుతున్నాను.'- అనుకున్నాను లోలోపల.

బాల్కనీలోకి వెళ్ళి అక్కడ బెంచీమీద కూచున్నాను. నా పెండ్లిఅయ్యేముందు ఆయనా - నేనూ అక్కడే కూచుని కబుర్లుచెప్పుకునేవాళ్ళం అప్పటికి పొద్దుకూకింది. చీకటిపడుతోంది. మబ్బుకూడా పట్టింది. వేసవికాలపు వానజల్లు వచ్చేసూచన కనుపిస్తోంది తూరుపున మబ్బులు కమ్ముకుని వస్తున్నాయి. గాలి బిగిసింది. ఆకుకూడా అల్లలాడడంలేదు. తోటలో పూలవాసన గుప్పునకొడుతోంది. వాన ముంచుకునివస్తున్నట్లుగా కప్పలు అరుస్తున్నాయి పక్షులకలకలారావం సందులేకుండా వినవస్తోంది. అవి తపతప రెక్కలుకొట్టుకుంటూ ఈచెట్టునుంచి ఆచెట్టుకూ; ఆపొదనుంచి ఈపొదకూ పరుగులుతీస్తున్నాయి. కిటికీచెంతనున్న పొదలో ఒకకోయిల గూడుకట్టుకున్నది. నేను వెళ్ళి చూచేసరికి అది రివ్వున అవతలికి ఎగిరిపోయింది. నేను దేనికోసమో వేచిఉన్నట్లుగా అది వానకోసం కాచుకునిఉన్నట్లుంది! బయట ఎక్కడా గాలిలేదు. గాలిఅంతా వెళ్ళి పూలల్లో దాక్కున్నట్లుగా పరిమళం గుప్పునవచ్చి నాసికారంధ్రాలను బ్రద్దలుకొడుతోంది. ఉఱుములు ప్రారంభమయినాయి మబ్బులు ఒకవైపుకు పరుగులుతీస్తున్నాయి. మావారు నాదగ్గరకొచ్చారు నాప్రక్కనే కూచున్నారు. 'వానవచ్చేటట్టుంది, వాళ్ళు తడుస్తారేమో !' అన్నారు.

'అవును, అలాగేఉంది.'- అన్నాను నేను ఇరువురం చాలాసేపు మాట్లాడకుండా కూచున్నాం. మళ్ళీ అంతా నిశ్శబ్దం. ఎక్కడా ఏమాత్రం అలికిడిలేదు. అకస్మాత్తుగా చూరుమీద ఇంతలావు వానచినుకు పడింది. తరువాత

మెల్లగా చల్లనిగాలి వచ్చి తాకింది. వానజల్లు పెద్దదయింది ఇప్పుడు కప్పల అరపులు లేవు. పక్షుల కలకలధ్వనులు వినిపించడం లేదు. వానహోరు తప్ప మరేసవ్వడీ లేదు. పాపం! ఆ వానకు ఒక పిట్టవచ్చి కిచకిచలాడుతూ చూరులో దూరింది. మావారు లేచి ఎక్కడికో వెళ్ళబోతున్నారు.

'ఎక్కడికండీ బయలుదేరారు?'- అని అడిగాను.- 'ఇక్కడ టెంట్లో చల్లగా హాయిగా ఉంది!'- అన్నాను.

'వాళ్ళు వానకు తడుస్తారేమో! ఒక మనిషి చేతికి గొడుగున్నూ, వానబూట్లున్నూ ఇచ్చి పంపించాలి'-అన్నారు ఆయన.

'ఏం అక్కర్లేదులెండి - ఈ వాన ఎంతసేపుంటుంది- ఇప్పుడు వెలిసిపోదూ'-

ఆయన సరేనని నాదగ్గరే ఉండిపోయారు. మేం వసారాముందున్న పిట్టగోడ ఎక్కి కూచున్నాం. తల బయటికి పెట్టాను. వానజల్లుకు కాసేపట్లో, నా తల, మెడదాకా తడిసి ముద్దయిపోయింది. అప్పటికి మబ్బులు కొంచెంకొంచెం తేలిపోసాగాయి. మధ్యమధ్య సన్నని జల్లు పడుతూనే ఉంది. కప్పలు మళ్ళీ బొరియలలోనుండి తలలు వెళ్ళబట్టి - బెకబెకలాడడం ప్రారంభించాయి. మళ్ళీ పిట్టలు, పక్షులు కలకల ధ్వనులు చేయసాగాయి. ఒక పొదనుంచి ఒకపొదకు - అటూ ఇటూ ఎగురుతున్నాయి. మబ్బులుపోవడంవల్ల ఇప్పుడు కొంచెం వెలుతురుగానే ఉంది.

'ఎంత హాయిగా ఉంది!' - అన్నారాయన, చేత్తో మెల్లగా నా తడితల తుడుస్తూ. ఆయన అంతప్రేమతో నన్ను

లాలించేసరికి నాకు కళ్ళనీళ్ళపర్యంతంఅయింది. 'మనిషికి ఇంతకన్నా ఆనందం ఏంకావాలి? ఇప్పుడు నాకెంతో తృప్తిగా, హాయిగా, ఆనందంగా ఉంది - నా కేకొఱతా లేదు' - అన్నారు మళ్ళీ.

ఏకొఱతా ఎందుకులేదూ? మీరిలా మాట్లాడ కూడదుసుమా. ఎంత సుఖంఉన్నా ఇంకా ఏదో లేదనే అనే వారు మీరు ఇదివరకు. మరి ఇప్పుడూ?-ఒకప్రక్క నాఆత్మ క్షోభిస్తూఉంటే, మీరుమాత్రం కూచుని హాయిగా,తృప్తిగా ఉందంటున్నారు. హుఁ! అనుకున్నాను లోలోపల. - 'అవు నండీ, నాకూ ఎంతో హాయిగాఉంది! - కాని ఒకప్రక్క విచారంకూడా బాధిస్తోంది. నాచుట్టూఉన్న పతివస్తువూ ఇంత మనోహరంగా ఉండడమే నా విచారానికి కారణం. నా అంతరంగంలో ఎన్నెన్నో తుఫానులులేచి, నన్ను అల్ల కల్లోలంచేస్తూఉంటే - ఇక్కడ చుట్టూ అంతా ఎంతో అందంగా ప్రశాంతంగాఉంది. ఎంతచిత్రం! ఇంతటి మనో హరమైన ప్రకృతిసౌందర్యాన్ని తిలకిస్తూ - గడిచినసంఘట నను తలుచుకొని విచారించచివా రుంటూరా?'-అన్నాను అప్పటిదాకా నా తలనిమురుతూఉన్న మావారు, తన చెయ్యి తీసి కాసేపు మెదలకుండా కూచున్నారు.

'అవును. నేనూ గతాన్ని తలచుకుని విచారించాను. ముఖ్యంగా వసంతకాలంలో' అన్నా రాయన సాలోచనగా- 'ఒకొక్కప్పుడు రాత్రిళ్ళకురాత్రిళ్ళు అలాగే దేనికోసమో నిరీక్షిస్తూ, ఆలోచిస్తూ కూచుండిపోయేవాణ్ణి. ఎంత చక్కని ఎంత చల్లనిరాత్రులవి!... కాని అప్పుడు నేను ప్రతిదీ దర్శిం

చకలిగాను ఇప్పుడు ఏదీ నాకు దృగ్గోచరం కావడం లేదు. ఇప్పుడు నేను ప్రతివిషయంలోనూ తృప్తి పడుతున్నాను. ప్రతిదీ అద్భుతంగా ఉందనుకుంటున్నాను.' - అన్నారు. ఆయనమాటలు వింటోంటే నాకెంతో బాధగా ఉంది. అయినా ఆయన నిజం చెప్పుతున్నారని గ్రహించాను.

'అవుతే మీరు దేన్నీ ఆశించడం లేదా?'-అని మళ్ళీ అడిగాను.

'లేదు' అన్నా రాయన.—'సరే కాని - ఎందు కలా వానలో తల తడుపుకుంటావు? వానలో తడవడానికి నీ వేదో చెట్టూ - చేమా అనుకున్నావేమిటి? మనిషివి! కాని నీవు ఆ వానలో తడిసే పచ్చిగడ్డివో - పర్ణానివో అయిపోవాలను కుంటున్నావు కదూ? నేను వాటినిచూచి ఎంతో ఆనందిస్తున్నాను. లోకంలో ప్రతివస్తువూ నాకెంతో మనోహరంగా కనుపిస్తున్నది. ప్రతిదీ యౌవనంతో తొణికిసలాడుతున్నట్లు తోస్తున్నది!'- అన్నారు. పసిపిల్లవాడిలా నా జుట్టంతా రేపుతూ

'అవుతే గతించినదానికి మీను చింతించడం లేదన్న మాట?'- అని మళ్ళీ అడిగాను. అంతకంతకూ నా గుండె బరువెక్కుతోంది.

ఆయన ఒక్కక్షణం ఆలోచించారు. 'లేదు. ఏ మాత్రం చింతించడం లేదు'- అని నిక్కచ్చిగా సమాధానం చెప్పేశారు.

'అబద్ధం, వట్టి అబద్ధం!'-అన్నాను నేను, ఆయనకు దగ్గరగా జరిగి. ఆయనముఖంలోకి సూటిగా చూచాను -

'నిజంచెప్పండి. జరిగినదాన్నిగురించి చింతించడమేలేదూ!'- అని రెట్టించాను.

'లేదు. జరిగినదానికి ఎంతో కృతజ్ఞుణ్ణి. కాని ఆ కాలం మళ్ళీ రావాలని నేను కోరడంలేదు'-అన్నారు

'ఏం? ఎందుకనీ?'-

ఆయన ముఖం ప్రక్కకుతిప్పుకున్నారు. తోటవైపు చూడసాగారు - 'పిచ్చిదానా! రావాలనుకుంటేమాత్రం గడిచినకాలం తిరిగివస్తుందా? నాకు రెక్కలుకట్టుకుని ఎగిరి పోవాలని ఉందనుకో - పోగలనా?'-అన్నారు.

'పోనీ గడిచినకాలంకంటే ఇంకా సుఖంగానయినా జీవించాలనుకోడంలేదా? మిమ్మల్ని మీరు నిందించుకోడం కానీ, నన్ను నిందించడంకానీ చెయ్యరా?'-

'ఎన్నటికీ చెయ్యను. అది మనమంచికోసమే'-

'అవుతే, ఒక్కమాట చెప్పండి'- అన్నాను ఆయన బుజంమీద తట్టి - 'ఇటు వినండీ - మీ కోరికవమిటో నాకు ఎన్నడూ చెప్పారుకారేం? చెపితే, మీఇష్టప్రకారమే నేను నడుచుకునేదాన్నిగా. నా కెందుకంత స్వతంత్రం ఇచ్చారు చెప్పండి!- దాన్ని నేను సరిగ్గా ఉపయోగించుకో లేకపోయాను. నే నందుకుపనికిరాను. ఇప్పుడు నాకు బుద్ధులు చెప్పడం మానేశారు- ఎందుకనీ? మీ కిష్టమైనట్లయితే నన్ను మరోమార్గంలో నడిపించకపోయారా? అప్పు డిలాంటి దేదీ జరిగిఉండేదికాదుగా!'- అన్నాను. ఎంతో నిరుత్సాహంగా, దిగులుగా. ఇలా అని నిశ్వసించాను.

'ఇప్పు డేం జరిగిందంటావు?!'-ఆయన నావంక తిరిగి, ఆశ్చర్యంగా అడిగారు- 'నా కేమీ తప్పు కనుపించడం లేదే అంతా బాగానే ఉంది'- అన్నారు, చిరునవ్వునవ్వుతూ.

'ఆయనకు అసలు అర్థమే కావ్రేదా? లేక అర్థంచేసుకో వాలని లేదా?'- అనుకున్నాను నాలో నేను. మళ్ళీ నాక ళ్ళలో నీళ్ళుతిరిగాయి. 'ఇప్పుడైనా చెప్పండి? ఏతప్పూ చెయ్యకపోతే నన్ను ఇలా అన్యాయంగా హింసించడం దేనికి? నేనంటే మీ కింత అయిష్టన, ఆక్రోశం దేనికి!- అని అకస్మాత్తుగా అడిగేశాను.

'ఏమిటి మేరీ, ఏమిటి నీ వనేది'- నే చెప్పేది అర్థం కాక అడిగా రాయన.

'ఉండండి. నన్ను చెప్పనివ్వండి... మీమీద నా కెంతో నమ్మకం ఉంది. గౌరవం ఉంది. గాఢమైన ప్రేమ ఉంది. కాని ఇవన్నీ మీరే చేతులారా పాడుచేసుకున్నారు. జరిగిందంతా తలుచుకుంటే అసలు మీరు నన్ను ప్రేమిం చారా అనిపిస్తున్న దిప్పుడు.... ఆగండి,మధ్యలో నామాటకు అడ్డురాకండి. ఇంతకాలంగా నే పడుతున్న బాధంతా ఒక్క-మాటు వెళ్ళబోసుకోనివ్వండి. నాకు జీవితమంటే ఏమిటో తెలియదనే అనుకోండి. అంతమాత్రంచేత నా బతుకు నన్ను బతకమని వదిలేస్తారటండీ? అనుభవంవల్ల ఆవిడకే తెలు స్తుంది లెమ్మని ఊరుకుంటారా? ఏడాదిబట్టీ నే నెంత యమ యాతనపడుతున్నానో మీ కేం తెలుసు? నన్ను దూరంగా ఉంచారు. నావిషయం పట్టించుకోడం లేదు. పైగా నేను కోరేదేమిటో మీ కేమీ అర్థంకానట్లు నటిస్తున్నారు. ఇది

నా తప్పా? నే నేదో మహాపరాధం చేసినట్లు లోలోపల కుమిలిపోతూ ఉంటే, మీరేమో నంగనాచిలా ఏమీఎరగ నట్లు - తప్పుకొని తిరుగుతున్నారు. మీదగ్గరికి రాకుండా చేస్తున్నారు. మిమ్మల్ని ఏమిఅనడానికీ వీఁులేకుండా చేస్తు న్నారు. ఇదేనా మీ ధోరణి! అవును. మన బ్రతుకులను చట్టుబండలు చేసిన ఆ బస్తీజీవితానికే నన్ను మీరు బలి చెయ్యాలనుకుంటున్నారు!'-

'అని నే చెప్పాడన్నా అన్నానా?'- అని ఆయన ఆశ్చ ర్యంతోనూ, ఉద్రేకతతోనూ అడిగారు.

'ఎన్నడో ఏమిటి? నిన్నకూడా అన్నారు. రోజూ అంటూనేఉన్నారు. ఈ పల్లెకొంపలలో ఉండడం కష్టంగా ఉందనీ, శీతాకాలం రాగానే మళ్ళీ పీటర్సుబర్గు వెడదామనీ మీరు అనడంలేదూ? ఆ పట్టణంపేరెత్తితేనే నాకుఅసహ్యం. నాకు సహాయంచెయ్యడం పోయి - పైపెచ్చు నిష్కల్మ షంగా మనసులోమాట చెప్పడమే మానేశారు. మీ నోటి నుంచి ఒక్క మంచిమాటరావడం నేను వినలేదు! నే నిలా భ్రష్టురాలనై పాతాళంలో కూలిపోతే మీరు హాయిగా చూచి ఆనందిద్దామనుకుంటున్నారు. అంతేనా?'

'చాలు, చాలు. ఇహ ఊరుకో'- అన్నా రాయన గట్టిగా - 'నీవు చెప్పేదేదీ నిజంకాదు. నన్నుగురించి తప్పా డభిప్రాయం ఏర్పరుచుకున్నావు. అసలు నీవు నన్ను...'- అని ఏదో చెప్పబోయి ఆగారు.

'ప్రేమించడమేలేదు. అదేనా మీరనేది! అనండి. మీ నోటికొచ్చినట్లల్లా అనండి!'- అని బిగ్గరగా అరిచాను.

నా కనులవెంట ధారాపాతంగా నీళ్ళు కారుతున్నాయి. చేరువలో సుఖం కష్టమని చూస్తున్నాను 'నన్ను ఆయన అర్థం చేసుకున్నది ఇంతేనన్నమాట!'– అనుకున్నాను, నాలో నేను. పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకోడానికి ప్రయత్నించాను– 'మనసంబంధాలు ఇంతటితో తెగిపోయినాయి. ఇదే ఆఖరు!' అని అంతరాంతరంగంలో ఎవరో అంటున్నట్లు వినిపించింది. ఆయన నా దగ్గరికైనా రాలేదు. నన్ను ఓదార్చలేదు. నేనన్న మాటలకు ఆయనకు కష్టం కలిగింది ఆయననోరు విడచ కట్టుకొనిపోయింది— 'నీవు నన్నెందుకు నిందిస్తున్నావో నా కర్థంకావడంలేదు. అంటే నేను వెనకటిలాగా నిన్ను ప్రేమించడంలేదనేనా నీ వనేది?'— అని అడిగారు.

'ప్రేమ!' అనుకున్నాను, నాలో నేను. నా కనులవెంట తెంపులేకుండా అశ్రుధారలు కురుస్తున్నాయి.

'అవుతే చెపుతాను విను. ఇందుకు కాలాన్నే మనం నిందించవలసివుంటుంది కాలం ఒక్కలా ఉండదు ప్రేమా ఒక్కతీరుగా ఉండదు. బ్రతుకులో ఒక్కొక్క సమయాన ఒక్కొక్కతీరుగా ఉంటుంది ప్రేమ! ...' అన్నారు. తరువాత కొంచెంసేపు ఆయన మాట్లాడలేదు— 'నీకు నిజంచెప్పనా. ఉన్నమాట చెపుతాను విను—నిన్ను నేను తొలిసారిగా చూచినప్పుడు రాత్రిళ్ళు నిద్రపట్టేది కాదు. నిన్ను గురించే ఆలోచిస్తుండేవాణ్ణి. నా అంతట నేనే ఒక ప్రేమను కల్పించుకున్నాను. ఆ ప్రేమ అంతకంతకూ వృద్ధిపొందింది. మనం పీటర్సుబర్గులో ఉన్నప్పుడూ, విదేశాలలో ఉన్నప్పుడూ ఆ ప్రేమ ఛిన్నాభిన్నమైపోయింది. నన్ను ఎంతగానో వేధిస్తూ

బాధిస్తూవచ్చిన ఆ ప్రేమను నేనే తుడిచివేసుకున్నాను. అప్పుతే పూర్తిగాకాదు. కొంతవరకుమాత్రమే! దాంతో నాకు కాస్త మనస్థిమితం ఏర్పడింది అయినా ఇప్పటికీనిన్ను ప్రేమిస్తూనేఉన్నాను. కాని అది మరోవిధమైన ప్రేమ!' అని చెప్పారు.

'దాన్ని ప్రేమఅని ఎందుకంటారు? హింసఅనండి, బావుంటుంది! సమాజంఅనేది చెడ్డదని మీరు అనుకున్నప్పుడూ, దానిమూలంగానే నన్ను ప్రేమించడం మానుకున్నప్పుడూ - అసలు నన్ను పదిమందిలో ఎందుకు తిరగనిచ్చారు? ఆనాడే వద్దని చెప్పలేకపోయారా?' అని సూటిగా అడిగాను.

'ఇది పదిమందిలో తిరగడవల్లవచ్చిన అనర్థంకాదు మేరీ!'

'అప్పుతే, మీరే నాపై అధికారంచెలాయించక పోయారా? నన్ను అదుపాజ్ఞలలో పెట్టలేకపోయారా? నన్ను ఇంట్లోనే కట్టిపడేసి గొంతుపిసికి చంపలేకపోయారా? ఈ హింసలు, అవమానాలు పొందకుండా హాయిగాపోయేదాన్నే. ఇంతకంటే నా కదే ఆనందంగాఉండేదే!' ఇలా అని మళ్ళీ నేను వెక్కి వెక్కి ఏడ్వసాగాను.

సరిగ్గా ఆసమయానికి కాట్యా, సోన్యాలు బట్టలన్నీతడుపుకొని, పకపకలాడుతూ, కేకలువేస్తూ వసారాలోకివచ్చారు. మమ్మల్నిచూచి అరుపులు, నవ్వులు ఆపేశారు. వెంటనే ఎకాఎకి ఇంట్లోకి వెళ్ళిపోయారు. వాళ్ళలా వెళ్ళిపోయిన తరువాతకూడా చాలాసేపటివరకు మేం మాట్లాడుకోలేదు

నేను అరిచీ, అరిచీ ఏడ్చీ, ఏడ్చీ ఇహ ఊరుకున్నాను. వారివంక చూచాను: ఆయన తలక్రింద చెయ్యిపెట్టుకుని కూచున్నారు. కాని ఏమీ చెప్పకుండా దీర్ఘంగా నిశ్వసించి ఊరుకున్నారు నేను దగ్గరికివెళ్ళి ఆయనచెయ్యి పట్టుకున్నాను. ఆయన సాలోచనగా నావంక చూచారు. 'అవును మేరీ! మనందరికీ- అందులోనూ ముఖ్యంగా మీవంటి ఆడవాళ్ళకు స్వయంగా జీవితంలో ఎన్నెన్నో తాకిళ్ళు తగిలితేకాని మళ్ళీ సరైన త్రోవలోకిరారు. మీవంటివాళ్ళు ఒకరుచెపితేవినరు, అనుభవిస్తేతప్ప! నీ వా దుష్టమైనసమాజానికిలొంగి,పోవలసి నంతదూరం పోయావు. అప్పుడు నిన్నెంతో మెచ్చుకున్నాను. అలాంటివిషయాలలో జోక్యంకలిగించుకునేవయస్సు నా కేనాడో పోయింది. పైగా నీపై పెత్తనంచేయడానికికూడా నాకు అధికారం లేదనుకున్నాను అందువల్ల నీత్రోవను నిన్ను పోనిచ్చాను'-

ఆయన ఇలా చెప్పుకునిపోతుంటే నేను అడ్డువచ్చి 'మీరు నిజంగా నన్ను ప్రేమిస్తున్నట్లయితే నన్నలా ఎందుకు వదిలిపెట్టి ఊరుకునేవారు ? మీరూ నాతోపాటుండి నన్నే ప్రమాదంలోనూ పడకుండా కాపాడకపోయారా ? కాబట్టి -మీకు నామీద ప్రేమలేదన్నమాట !'- అన్నాను.

'ప్రేమలేక కాదు. నీఅంతట నీవే గుణపాఠం నేర్చుకో వాలని ఊరుకున్నాను'- అన్నా రాయన - 'ఇంకేం ? నేర్చు కున్నావు !'- అన్నారు.

'మీ రెంతో హేతువాదంచేస్తున్నారు. ఏమైనా మీకు కొంచెమైనా నామీద ప్రేమఉన్నట్టయితే'- -

తరువాత కాసేపు ఎవరం మాట్లాడలేదు ఆయన అక స్మాత్తుగా లేచి వసారాలో ఇటుఅటు పచార్లుచేస్తూ - 'నీవు చాలా కఠినంగా మాట్లాడుతున్నావు. అయినా నీవన్నది నిజం. అవును. తప్పంతా నాదే నే నసలు నిన్ను ప్రేమించ కుండానే ఉండవలసింది. ఒకవేళ ప్రేమించినా, ఏదో సామా న్యంగా ప్రేమించిఉంటే బావుండేది!'- అన్నారు.

'పోనీయండి. ఇహ ఆగొడవలన్నీ మరిచిపోదాం'- అన్నాను, భయంభయంగా. 'లేదు. జరిగిపోయిందెన్నటికీ తిరిగిరాదు'- అన్నారు. ఆయనకంఠస్వరం సన్నగిలింది. నేను వారిభుజాలమీద చేతులువేశాను.- 'అలా అనకండి. అదె ప్పుడో మళ్ళీ వచ్చేసింది'- అన్నాను. ఆయన నాచెయ్యి పట్టుకొని నొక్కారు. 'జరిగినదానికి చింతించడంలేదని ఇది వరకు నే నన్నాను. కానీ అది అబద్ధం. నిజానికి నే నెంతో చింతిస్తున్నాను. మనప్రేమ మళ్ళీ ఎన్నటికీ తిరిగిరాదని ఎంతో దుఃఖిస్తూవచ్చాను. ప్రేమ ఇంకా కొంచెం మిగిలి ఉన్నప్పటికీ అది వెనకటిలాంటిది కాదు' అన్నారు.

'అలా అనకండి. మనం వెనకటిలాగానే ఉందాం. అలాఉండడం అసాధ్యం ఏమీకాదు'- అని కంపితస్వరంతో పలికి - ఆయన కనులలోకి చూచాను. ఆయన చూపులు ఎంతో ప్రశాంతంగా ఉన్నాయి. నే నిలా వారితో మాట్లా డుతున్నానేకాని, నా కోరికలు నెరవేరవని నాకు తెలుసు. ఆయన చక్కని చిరునవ్వునవ్వారు. కాని అది ఒక వృద్ధుడి చిరునవ్వులా నాకు కనుపించింది. నే నాయనదగ్గరే నిలుచు న్నాను. నా మనసు చాలవరకు స్థిమితపడింది.

'ఇహ మనం జీవితాన్ని శోధించడానికి ప్రయత్నించవద్దు మేరీ. మనం ఒకరినొకరం మోసం చేసుకోనూవద్దు. మనకు ఆ వెనుకటి ఆరాటాలూ, ఆందోళనలూ అసలేవద్దు మేరీ. ఇహ మనం దేనికోసమూ వెతకవలసిన పనిలేదు, దేన్నిగురించీ కష్టపడవలసిన పనిలేదు మనం జీవితమంటే ఏమిటో రుచిచూచాం. కావలసినంత సుఖమూ అనుభవించాం.... కనుక ఇహ మనం కాస్త అపతలికి తప్పుకొని మరొకరికి త్రోవఇవ్వడం అవసరం'- ఇలా అంటూ ఆయన, వసారా నాకిట్లో మా అబ్బాయి వాన్యాను ఎత్తుకొని నిలుచున్న దాదివంక చూచారు. ఆ పిల్లలే ఇహ మన ఆనందం- అన్నట్లు చెయ్యి పెట్టి చూపించారు.- 'అదీ విషయం మేరీ!'- అని ముగించారు. నా తల తనరొమ్ముకు ఆనించుకుని, ముద్దాడారు. ఇప్పుడాయన నాకు ప్రియుడులా లేరు. ఏదో వెనకటి స్నేహితుల్లా అగుపించారు

ప్రక్కన పూతోటలోనుంచి పూలపరిమళం వచ్చి గుప్పున సోకుతోంది. చల్లనిరాత్రి. అంతా స్తబ్ధ నిశ్శబ్దం. ఆకాశంలో నక్షత్రాలు మిలమిల మెరుస్తున్నాయి. నేను ఆయనవంక చూచాను. నా ఆత్మలో రేగిన అగ్నిజ్వాలలన్నీ అకస్మాత్తుగా గుప్పున, చప్పున చల్లారిపోయాయి. ఇంతకాలంబట్టీ నన్ను వేధిస్తూ, బాధిస్తూవచ్చిన దేదో ఇప్పుడు క్షణంకాలంలో మటుమాయమైపోయింది. గతమంతామాసిపోయింది. దానితోపాటు పూర్వపు నా అభిప్రాయాలన్నీ అదృశ్యమైనాయి. వాటిని మళ్ళీ మనస్సులోకి తెచ్చుకుందామన్నా నాకు చేతకావడంలేదు. నా కెంతో సుఖంగా

కనుపించిన గతం నిజంగా మంచిదేనా? ఏమో! గతం గడిచి పోయికూడా చాలాకాలమైంది!

'ఇహ మనం శాస్త్ర టీకాగుదాం'- అన్నారాయన. ఇరువురం డ్రాయింగ్ రూంలోనికి వెళ్ళాం. అక్కడ వాకిట్లో మాకు దాది ఎదురుపడింది. వాణ్ని ఎత్తుకొని ఉంది. నేను పిల్లవాణ్ణి చేతుల్లోకి తీసుకున్నాను. వాడు పసికందు. వాడి కాళ్ళమీద పొత్తిగుడ్డ కప్పాను. నా చిట్టితండ్రిని హృదయానికి హత్తుకున్నాను. ముద్దుపెట్టుకున్నాను. వాడు అరవిచ్చినకళ్ళతో - ముఖం అటుఇటు తిప్పాడు. గుప్పిట తెరచి ఏదో కావలసినట్లు చేతులు ఆడించాడు. చిన్న కళ్ళు తెరచి దేనికోసమో వెతుకుతున్నట్లూ, ఏదో జ్ఞాపకంచేస్తున్నట్లూ చూచాడు. అకస్మాత్తుగా నా చిన్నారితండ్రికళ్ళు నామీద నిలిచాయి. మిలమిల మెరిశాయి. చిన్నారి పెదవులువిప్పి చిరునవ్వునవ్వాడు. వాడి బోసినోరు ఎంత ముద్దొస్తున్నది! 'నా చిట్టితండ్రే - నా బంగారుకొండే!'- అంటూ వాణ్ణి మరింతగట్టిగా హృదయానికి హత్తుకున్నాను. నా కప్పుడు కలిగిన ఆనందం చెప్పతరం కాదు. నా శరీరంయావత్తూ పులకించింది. నా బంగారుకొండకు ఎక్కడ నొప్పితగులుతుందో అని భయపడ్డాను. వాడి ముక్కు, ముఖం, కాళ్ళు, చేతులు, తల, పొట్ట - అన్నీ పదే పదే తనివితీర ముద్దుపెట్టుకున్నాను. అంతలో మావారు దగ్గరికివచ్చి నిలుచున్నారు వాడిముఖాన పొత్తిగుడ్డ కప్పి, మళ్ళీ వెంటనే తీసివేశాను! తన వ్రేలితో వాడి చిన్నగడ్డాన్ని కదుపుతూ మావారు - 'ఏమిరా, ఇవాన్ సెర్గీవిచ్!'-

అన్నారు ముద్దుగా. కాని నేను వెంటనే నాశిముఖాన మళ్ళీ గుడ్డకప్పాను. నా చిట్టితండ్రిని నేనుతప్ప మరెవరూ చూచే హక్కులేదు - నా కన్నతండ్రికి దృష్టితాకుతుంది!- అను కున్నాను. తరువాత మావారివంక చూచాను వారికళ్ళన్నీ నామీదే ఉన్నాయి. ఆ కళ్ళలో ఎంత ఆనందం కనుపిస్తు న్నది! ఎంతోకాలంనుంచీ పోగొట్టుకున్న సంతోషమంతా ఆక్షణంలో మొట్ట మొదటిసారి నాకు మళ్ళీ లభించినట్లని పించింది.

ఆనాటినుంచీ మావారితో నా ప్రేమ కలాపాలు కట్టిపెట్టాను. పాత భావనలన్నీ ఎంతో అమూల్యములై నాయి. మాతృశక్యంకాని జ్ఞాపకాలైనాయి. కాని పిల్ల లన్నా, మావారన్నా నాలోకొత్త ప్రేమానురానురాగాలు, కొత్తభావాలు మొలకెత్తాయి. అవి మరొక కొత్తజీవితానికి, మరొక సుఖజీవితానికీ-అనుకోండీ - పునాదులయినాయి. నేను కొత్తజీవితం ప్రారంభించాను. కానిపూర్తిగా భిన్నమైన మార్గాన- అదీ మావారి పుణ్యమాఅంటూ! అదేమార్గాన- అదేవిధంగానయినా ఈక్షణంవరకూ నా సంసార యాత్ర సుఖంగా కొనసాగిస్తూవచ్చాను.

సమాప్తము